ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# భాగవతకథ

## అష్టమ కాండము

గ్రంథకర్త - శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి

అనువాదం - శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య

శ్రీ భాగవత దర్శనము

# భాగవతకథ

( అష్టమ ఖండము )

శ్లో॥ వ్యాసశాస్త్రోపవనతః సుమనాంసి విచిన్వతా ।
కృతా వై ప్రభుదత్తేన మాలా 'భాగవతీ కథా' ॥


గ్రంథకర్త:

శ్రీ ౧౦౮ ప్రభుదత్త బ్రహ్మచారిగారు

అనువాదకుడు:

'శ్రీ రామ శరణ్'

శ్రీ కుందుర్తి వేంకటనరసయ్య





ప్రకాశకులు:

శ్రీరామ శరణ మందిరము, బుద్ధాం.

కాపీరైట్ ]　　1964　　వెల రు. 2-0-0

# విషయసూచిక

# భాగవతకథ

## అగ్రిమసృష్టివర్ణనము

ఏది జరిగినను దానికి కారణముండి తీరును. సూక్ష్మ రూపముననున్న రచన స్థూలరూపమును దాల్చును. ఉండుట కిబ్బందియై యొక గృహమును గట్టుటకు సంకల్పము కలిగెను. సంకల్పము కలుగఁగానే మనస్సులో దాని రూపురేఖ లేర్పడెను. ఇంత పెద్దది కావలయును, అట్లు కట్టవలయును, ఇట్లు కట్ట వలయును అని యాలోచించి తర్వాతఁ బ్రయత్నము కావించును. అంతఁ దన యిచ్ఛకు స్థూలరూప మొసంగును. అది తయారైన తర్వాత నందఱును మంచియిల్లు కట్టినావందురు. బయటివారి కది తయారైనప్పుడే కట్టినట్లు తెలియునుగాని, కర్తకు మనస్సులో నిది తయారగుచునే యుండును. దానికి ముందు కారణరూపమున నది కట్టఁబడినది. ఏలననఁగా నిదివఱ కిట్టిది లేకున్న నిప్పుడిట్లు కట్టుట జరుగదు. గృహమునకుఁ గారణము నిత్యము. దీనినే యిట్లనుకొనుము:- ఒక విగ్రహమును జేయువాఁడు రాతియందు విష్ణుని విగ్రహమును జెక్కును. మొట్టమొదట మనస్సులో నాలోచించుకొని యాతఁడొక చిత్రమును నిర్మించుకొనును. తర్వాత నులి, పోగరు మొదలగు పనిముట్లను దీసికొని, యా శిలను దొలిచి తొలిచి తన మనోనుకూలమగు విగ్రహమందు అవయవముల నేర్పఱచును. విగ్రహము తయారైన తర్వాత నందఱు నిట్లందురు—"ఆ శిల్పి యా శాలమున భవ్యమూర్తిని జెక్కినాఁడు." వాస్తవముగ దీనిని జెక్కుటకు పూర్వమే ఆతని మనస్సున నిది యేర్పడినది. విగ్ర

హము నెచ్చటనుండియో తెచ్చి యిచ్చటనుంచలేదు. కారణ రూపమున విష్ణువచ్చట నిత్యముగ నున్నాఁడు. అవ్యక్తరూప మున నున్నాఁడు. చిత్రకారుఁడు కేవలము దానిని వ్యక్తము చేసినాఁడు. వ్యక్త మొనర్చు కళ ఆతనికొక యవ్యక్తశక్తివలనఁ బ్రాప్తించినది. ఏలననఁగా అందఱును అవ్యక్త పాషాణ విష్ణు వును వ్యక్తము చేయఁజాలరు. సామర్థ్యము కలవారే యిట్లు చేయ సమర్థులు.

ఈ జగత్ప్రవాహము నిత్యమైనది. దీనికి మొదలును లేదు. చివరయు లేదు. అనాదికాలమునుండి యీ ప్రవాహము ప్రవహించు చున్నది. అనంతకాలము వఱకు ప్రవహించుచునే యుండును. తన శక్తిచే నాతఁడు బ్రహ్మను బుట్టించినాఁ డనుఁడు లేక బ్రహ్మయైనాఁడనుఁడు. బ్రహ్మయై ప్రాచీన ఋషులను మునులను స్మరించును. ప్రాచీన ప్రపంచమునఁ గల సమస్తోపకర ణములను నాతఁడు స్మరించును. కారణరూపమున దాఁగియుం డిన యీ సమస్తసంభారము బ్రహ్మయొక్క మనస్సులోఁ బ్రకట మయ్యెను. దానినే సూక్ష్మసృష్టియందుము. ఆ సూక్ష్మసృష్టి పదార్థములందు వాసనా ప్రాబల్యముండుటచే నది స్థూలరూప మును ధరించుచుండును. భగవంతుఁడు ప్రకాశస్వరూపుఁడు. ఆతని కెంతదూరమున నుండిన నంతగాఁ జీఁకటిలోనికిఁ బోవు చుందుము. తమస్సు వైపునకుఁబోవుట యనఁగా స్థూలతను గ్రహించుటయని తెలిసికొనవలయును. బ్రహ్మకు మునులు కొద్ది దూరములో నున్నారు. వారికంటెఁ బ్రజాపతులు, వారికంటె మనువులు, మనువులకంటె మనుపుత్రులు, మనుపుత్రులకంటె మనుష్యులు, మనుష్యులకంటె పశుపక్ష్యాదులు, పశుపక్ష్యాదుల

కంటె వృక్షపాషాణాదులుండును. ఇదేవిధమున స్థూలమునుండి సూక్ష్మమునకుఁ బోవుచో నెంతగాఁ బోయిన నంతగా భగవానునకు దగ్గఱపడుచుండురు. ఈ చక్రము నిరంతరము తిరుగుచుండును. దీనినే ఉత్పత్తి, ప్రలయ, జన్మ, మరణ ప్రవాహమందుము. ఇఁక సృష్టిప్రకరణము జరుగు చుండును. భగవంతుని నాభినుండి కమలము పుట్టినది, కమలమునుండి బ్రహ్మ యుదయించెను. బ్రహ్మనుండి దశమానసపుత్రులు, తర్వాత మను శతరూపలను మిథునము, ఇట్లు సూక్ష్మమునుండి స్థూలసృష్టి జరిగినది. దీనిని మనస్సులో నుంచుకొనియే శౌనకుఁడు సూతునితో నిట్లనెను:- సూతా ! నీవు వరాహావతార కథను, హిరణ్యాక్షోద్ధారమును జాల యద్భుతముగఁ జెప్పితివి. భగవత్కథలను వినుచువినుచు మానవజన్మమును గడుపుటయే మానవ జన్మకు సార్థకత. తీర్థయాత్రల నొనర్చి తన యంతఃకరణమును శుద్ధము గావించుకొనిన విదురుఁడే జీవితము యొక్క యథార్థ లాభమును బొందినాఁడు. భగవద్భక్తిచేఁ బరలోకమును సాధించినాఁడు. మైత్రేయునితోఁ గథాప్రసంగ మొనర్చి లోకోపకారము నొనర్చెను. సూతా ! లోకములోనికి గంగానది రాకున్నను, భగవత్కథలు లేకున్న నే మానవుఁడును నీ సంసార సాగరమును దాటి శాశ్వతశాంతికిని, అక్షయసుఖమునకును నధికారి కాలేఁడు. ఏలననఁగా దేహధారులకు తెలిసియుఁ, దెలియకయు, మనోవాక్కాయములచే నిరంతరము అసంఖ్యాకములగుఁ బాపముల నొనర్చుచుండును. ఒకొక్కప్పుడు పుణ్యమును జేయు చుండును. జీవి యథారీతిగఁ బుణ్య పాపముల ననుభవింపవలసి వచ్చినఁ గొన్నిదినములు నరకాగ్నిలోఁ బడి

బాధ లనుభవింపవలయును. ఒకవేళ పుణ్యములచే స్వర్గములోని యనిత్య, నశ్వర, క్షయిష్ణు భోగవిలాసముల ననుభవించినను నవి యల్పకాలమే నిలుచును. కాని త్రిపథగామిని యగు గంగయు, భగవత్కథలును సదా పాపములను హరించుచునే యుండును. విదురుఁ డడుగఁగా మైత్రేయుఁడు సమాధానరూపమునఁ జెప్పిన సమస్త పాపహారకములగు భగవత్కథలను నాకుఁ జెప్పుము.”

శౌనకుఁ డిట్లడుగఁగా సూతుఁడు ప్రసన్నుఁడై యిట్లనెను:— ఋషులారా! మీరే సంసారతాపసంతప్తులగువారికి నిజమగు తల్లులు, దండ్రులు, హితైషులు, సుహృదులు. మీరిట్టి ప్రశ్నను గావించి సంసారులకు నిష్కంటక రాజపథమును తయారు చేయుచున్నారు. మహామహుఁడగు మైత్రేయుఁడు విదురునకు వారాహ చరిత్రను జెప్పఁగాఁ బ్రసన్నుఁడై యాతనిని అగ్రిమసృష్టినిగూర్చి ప్రశ్నించెను.”

విదురుఁ డిట్లడిగెను: “స్వామీ! బ్రహ్మ మరీచాది దశపుత్రులను, మనుశతరూపలను సృజించి తర్వాత నేమే సృష్టిని గావించెను? తర్వాత సృష్టిని అందఱును గలిసి వృద్ధి గావించిరా లేక బ్రహ్మ యొక్కఁడే యంత్రమువలె నొనర్చెనా? కృపతో నాయీ ప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మీయవలయును.”

ఇది విని నవ్వుచు మైత్రేయమహాముని యిట్లనెను:— “విదురా! మాటిమాటికి సృష్టినిగూర్చి ప్రశ్నించి నాకు సదా సృష్టికర్త స్మరణ కలుగునట్లు చేయుచున్నావు. ఇదియే జీవునకుఁ

బరమ పురుషార్థము. మహాభాగా! భగవదేచ్ఛచేఁ గాల, కర్మ, ప్రకృతి సంసర్గము వలనఁ ద్రిగుణములలో క్షోభము కలుగునని నీకిదివఱకే చెప్పియున్నాను. దీనివలన మహత్తత్త్వము త్రివిధాహంకారము, పంచతన్మాత్రలు, పంచభూతములు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, వాటి కధిష్ఠాతృదేవతలు మొదలగునవి యుత్పన్నమై అండాకారముగ నయ్యెను. భగవంతుఁడు దానిలోఁ బ్రవేశింపఁగా నాతని నాభికమలము నుండి బ్రహ్మయుద్భవించెను. ఆతఁడు అవిద్యను, యక్ష, రాక్షస దేవతా, సురాదులను సృష్టించెను. అంత దిన, రాత్రి, సంధ్యాదులను సృష్టించి కాలవిభాగము గావించెను. తదనంతరము అప్సరస, గంధర్వ, భూత, పిశాచ, సిద్ధా, తంద్రోన్మాద, పితర, సాధ్య, కిన్నర, కింపురుష, సర్పాది సృష్టిని గావించెను. ఇంత సృష్టి యొనర్చినను బ్రహ్మకు సంతోషము కలుగలేదు. అప్పు డాతఁడు పురుషాకార శరీరమందు మానవుని బుట్టించెను. మానవ శరీరమునుగాంచి బ్రహ్మ సంతసించెను. దేవతల హర్షమునకు మేరలేకుండెను. వారిట్లనిరి :– "పితామహా! నీవు అద్భుత సృష్టిని గావించితివి. మాకుగూడ అన్నమును, జలమును గల్పించితివి. వీరు యజ్ఞయాగాదుల నొనర్చి మమ్ములను సంతోషపరచెదరు. ఈ శరీరముతో మోక్షలాభమునుగూడ పొందఁ గలుగుదురు. మనుష్యుల సృజించిన తర్వాత తపో, విద్యా, యోగ, సమాధులతోఁ గూడిన మునుల సృష్టి జరిగినది. ఆ సమయమున స్వాయంభువ మనువు, శతరూపల సృష్టి జరిగెను. శతరూప సృష్టిలో మొదటిస్త్రీ. ఆమె వివాహము స్వాయంభువ మనువుతో జరిగెను."

విదురుఁ డిట్లడిగెను:— "వీరిలో శ్రేష్ఠులెవరు ? పురుషుఁడా ? స్త్రీయా ?"

మైత్రేయుఁడు నవ్వి యిట్లనెను:— "విదురా ! వీరిలో నెవరు శ్రేష్ఠులో నీవే తెలిసికొనుము. ఎవరి స్థానములో వారే గొప్ప. రెండు చేతులు, రెండు కాళ్లు, రెండు ముక్కురంధ్రములు, రెండు కన్నులు వీనిలో గొప్ప యేవి ? కొద్ది యేవి ? బ్రహ్మ రెండుగ నయ్యెను. అట్టియెడ నిందు కొద్ది, గొప్ప భేదమేల యొనర్పవలయును ? పురుషుఁడు కుడిభాగమున నయ్యెను, స్త్రీ యెడమభాగమున నయ్యెను. సృష్టికి ఇద్దరు నవసరమే. రెండు చేతులులేక తాళము కొట్టలేము కదా ! కావున నిద్దరు సమానమే."

విదురుఁ డిట్లనెను:— "అయినను గొంచెముగ కొద్ది గొప్ప లుండి తీరును."

మైత్రేయుఁ డిట్లనెను:— "విదురా ! నా యభిప్రాయమున మొట్టమొదట పురుషుఁడగు బ్రహ్మయే ఇద్దరను బుట్టించినాఁడు కావున నీ క్రమముచేఁ దండ్రి శ్రేష్ఠుఁడు. సృష్టివృద్ధి శతరూపవలన నైనది కావున తల్లి శ్రేష్ఠురాలు. కావున తల్లి రూపముననున్న స్త్రీ శ్రేష్ఠురాలు. పతీపత్ని సంబంధములో పురుషుఁడు శ్రేష్ఠుఁడు. ఈ విధముగ శ్రేష్ఠత్వ మెచ్చటనుండదో అచ్చట కలహము అనఁగా గలి ప్రవేశించినదని గ్రహింపవలయును."

ఇదివిని విదురుఁడు బిగ్గఱగనవ్వి యిట్లనెను:— "స్వామీ! మీరు మరలఁ బ్రకారాంతమున నిద్దరను సమానముగఁ జెప్పి

తిరి. నిజమే. సర్వథా సమానముగ సృష్టి జరగనే జరుగదు. కొంచెముగ నసమానత యుండవలయును. సర్వథా విపరీతమందును సృష్టి జరుగదు. సృష్టిలో ననుకూల్యము కావలయును. అయితే శతరూపామనువులు కలిసి యెంతసంతానము నుత్పన్నము కావించిరి; వారి వంశ మెట్లు వృద్ధియైవది ?

అంత మైత్రేయుఁ డిట్లనెను:- "స్వామీ మనువు శతరూపాగర్భమునఁ బ్రియవ్రత, ఉత్తానపాదులను నిద్దరు ధార్మికులగు బుత్రులుదయించిరి. వా రిద్ద రీ వసుధకు ప్రభువులైరి. వా రీ విశ్వమునంతను బుత్రులవలెఁ బాలించిరి. వీరుగాక ఆకూతి, దేవహూతి, ప్రసూతి యను ముగ్గురు కన్యకలను బుట్టించెను. దేవహూతిని మహాయోగి యగు కర్దమ ప్రజాపతికిచ్చి పెండ్లిచేసిరి. వీరి గర్భముననే సాక్షాచ్ఛ్రీమన్నారాయణుని అంశావతారమగు కపిలమహాముని జన్మించెను. ఆకూతిని రుచియను ప్రజాపతికిచ్చి పెండ్లిచేసెను. ప్రసూతిని దక్షప్రజాపతి కొసంగిరి. వీరి వలననే యీ చరాచరప్రపంచ మంతయు నిండిపోవుసంతటి సంతాన ముద్భవించినది."

అంత విదురుఁ డిట్లనెను:- "స్వామీ! నే నవతార చరిత్రను వినఁ గుతూహలపడుచున్నాను. మీరు నాకు కపిలభగవానుని చరిత్రమును వినిపింపవలయును. దేవహూతి వివాహము కర్దమప్రజాపతితో నెట్లయ్యెను. భగవంతుఁ డెట్లవతరించెను. ఈ వృత్తాంతమంతయు నాకు సవివరముగా వినిపింపవలయును."

విదురుఁడిట్లు ప్రశ్నింపఁగాఁ బ్రసన్నుఁడై మైత్రేయమహాముని యిట్లనెను:- "మహాభాగా! అవతారకథలను విన నుత్స

హించు నీవు ధన్యుఁడవు. ఇప్పుడు నే నీకు కపిలభగవానుని చరిత్రను వినిపించెదను. నీవు అంతను సావధానుఁడవై వినవలయును."

భగవదారాధనఁ గామ్యముగఁ జేసినను, నిష్కామ్యముగ నొనర్చినను కల్యాణప్రదమే. భక్తుల హృదయములోఁ గోరికలు పుట్టించువాఁడును భగవంతుఁడే. హృదయములో నుత్పన్నమగు కోరికలు బూర్తియొనర్చుకొనుట హృదయేశుని బ్రార్థించిన దాని పూర్తికొఱకు ఆతనిని శరణువేఁడు నెడల ఆతఁడా కోరికలను నెఱవేర్చుటయేగాక చివరకు తన పదమును కూడ బ్రసాదించును. దీనుఁడు, క్షుధార్తుఁడగువాఁడు కృపణుఁడగు క్షుద్రపురుషుని నాశ్రయించి ప్రార్థించిన సంకోచవశమున వారికొక దినమునకు క్షుధానివృత్తికొఱ కన్న మొసంగిన నొసంగవచ్చును లేదా నిరాకరింపవచ్చును. కాని యుదారుఁడును, దయగలవాఁడును, సమర్థుఁడగు వానిని శరణుజొచ్చు నెడల, వానిదుఃఖమును విని దయావశమున వాని యాఁకలిని తక్షణము పోఁగొట్టుటయేగాక, తర్వాత వాని నివృత్తికొఱకేదైన నేర్పాటు చేయఁగలఁడు. ఈ విధముగనే కోరిక కలిగి సాంసారిక మానవునిగాని, భూతప్రేత, పిశాచములను లేక క్షుద్రదేవతలను శరణువేఁడి యాచించుచోఁ గొంచెముగనో గొప్పగనో వారికోరిక నెఱవేఱినను వారిదుఃఖము శాశ్వతముగ పోఁజాలదు. అట్లే భగవంతునే శరణువేఁడినచో కోరికలు నెఱవేఱుటయేగాక పరమార్థపథ పథికులగుట కవకాశము కలదు. శాశ్వతశాంతికి అధికారులు కాఁగలరు. భగవంతునకు దాసుఁడై తమకోరికలు నెఱవేరుటకు క్షుద్రుల నాశ్రయించుచో నాతఁడు

హరిదాసుఁడుకాక విషయదాసుఁడు లేక మాయాదాసుఁడు కాఁగలఁడు. ఆతఁ డెల్లప్పుడును యెనుబదినాల్గులక్షల జీవరాసులలోఁ దిరుగుచుండును. కర్దమమహాముని సకామతపస్సు నొనర్చి తన కోరికను నెఱవేర్చుకొనుటయేగాక చివరకు ముక్తినిఁగూడ బొందెను. ఈ ప్రసంగము నారంభించుచు మైత్రేయభగవానుఁడు విదురునితో నిట్లు చెప్పఁదొడఁగెను:-

మైత్రేయమహాముని యిట్లనెను:- "విదురా! కర్దముఁడు బ్రహ్మమానస పుత్రుఁడు. స్వాయంభువమనువు శతరూపను వివాహమాడఁగానే యీతనికిని వివాహేచ్ఛ జనించెను. భగవదిచ్ఛ అట్లుండుటచేతనే ఆతని కిట్టి కోరిక జనించెను. అంత నాతఁడు చేతులు జోడించి బ్రహ్మదేవుని కిట్లు నివేదించుకొనెను:- 'ప్రభూ! నా కాజ్ఞ యేమి?'

బ్రహ్మ ప్రజావృద్ధిని, సృష్టిచక్రమును ద్రిప్పవలయునని తలఁచుచుండెను. అందువలన నాతఁడు మిక్కిలి ప్రీతితో నిట్లనెను:- "నాయనా! ఇప్పుడు సృష్టి వృద్ధికొఱకు నాకు తోడ్పడుటయే కర్తవ్యము. ప్రజోత్పత్తియందు ప్రయత్నశీలుఁడవుకమ్ము."

చేతులు జోడించుకొని నమ్రతతో నాతఁ డిట్లనెను:- "స్వామీ! నేను నీ యాజ్ఞను శిరసావహింతును; కాని ప్రజావృద్ధి నెట్లు కావింపఁగలను? ఈ విషయము నా బుద్ధికి వచ్చుట లేదు."

బ్రహ్మ యీభావమును గ్రహించి యిట్లనెను:- "నాయనా! భగవద్భజన మొనర్చిన నసాధ్యమగున దొకటియును లేదు. నీవు భగవంతుని ఆశ్రయింపుము. తపస్సును జేయుము.

తపస్సువలన సమస్త సిద్ధులు లభింపఁగలవు. నీవు భార్య నపే క్షించు చున్నావు. భక్తి చేసిన భార్యయు లభింపఁగలదు, భగ వంతుఁడును లభింపఁగలఁడు.”

బ్రహ్మయొక్క యాజ్ఞనుబొంది మహాముని కర్దముఁడు అర్బుదశైల సమీపమున సరస్వతీనది తీరమున ఘోరతప మొన ర్చెను. ఆతఁడు యమ, నియమాసన, ప్రాణాయామ ప్రత్యాహా రాది యోగాంగములద్వారా సమాధినిబొంది పరాత్పరు నారా ధించుటలో నిమగ్నుఁడయ్యెను. సమస్త దిక్కులనుండియుఁ దన చిత్తవృత్తులను లాగి మనస్సును భగవంతుని యందుంచెను. ఈ విధముగ పదివేల సంవత్సరములు తపస్సును జేసెను.

స్వాయంభువమనువు శతరూపను వివాహమాడి గంగా యమునకు మధ్యనున్న బ్రహ్మవర్తప్రదేశము చాల పుణ్యప్రద మైనదని తెలిసికొని, అచ్చట తమ రాజధాని నేర్పఱచు కొనెను. బ్రహ్మవర్తములోనుండి ఆతఁడు భూమండలము సం తను ధర్మముగఁ బరిపాలించెను. ఆతనికి ప్రియవ్రతుఁడు, ఉత్తాన పాదుఁడను నిద్దరు పరాక్రమశాలురగు పుత్రులును, దేవహూతి, ఆకూతి, ప్రసూతి యను ముగ్గురు కన్యకలు నుద్భవించిరి.

దేవహూతి సుశీల, ధర్మపరాయణ, భక్తిమతి, సాధు స్వభావయగు కన్యక. ఆమె నిరంతరము భగవద్భజనమందు కాలము గడుపుచుండెడిది. ఆమెకు ఆటపాటలుగాని, లోకుల ముచ్చటలు గాని నచ్చవు. మెదలక కూర్చుండి భగవచ్చింత నము చేయుచుండెడిది. బాల్యమునుండియు నామె సౌందర్యవతి. ఆమెను జూచువారి కందఱకును సంతోషము వేయవలసినదే. ఆమె కొంచెము పెద్దదైన తర్వాత నొకానొక సమయమునఁ

కౌతుకవశమునఁ గందుకముతో నొంటరిగ మేడపైఁ గ్రీడించు
చుండ విశ్వావసను గంధర్వుఁడు విమానము నెక్కి పోవుచుండెను.
ఈ యనుపమ రూపసౌందర్య లావణ్యమునుగాంచి ఆమె సౌంద
ర్యమునకు మోహితుఁడై శరీరమును మఱచి విమానమునుండి
క్రిందపడిపోయెను. మనస్సుతో నాతఁడొనర్చిన పాపమునకు
వెంటనే ఫలమును బొందెను.

శుక్లపక్ష క్షపాకరుఁడు దినదిన ప్రవర్ధమానుఁడై తన
శీతల కిరణములచే లోకుల నందఱను సంతోషపెట్టుచుండును
గాని కాముకులకుఁ గష్టము కలుగుచుండును. అట్లే దేవహూతి
యౌవనవతి కాఁగానే అందఱకానందము కలుగుచుండెను గాని
తల్లిదండ్రులకుఁ జింత యధికమయ్యెను. ఇప్పుడు దేవహూతి
బాల్యావస్థను దాఁటి యౌవనవతియయ్యెను. ఆమెను యోగ్యుఁ
డగువాని కొసఁగి ఆమె జీవితమును సుఖమయము కావింపవల
యునని ఆమె తల్లిదండ్రులు కాంక్షించుచుండిరి. వారు భగవద్గు
ణాను వర్ణనము కావించుచు నీ చింతలోనుండిరి. ఇంతలో వీణా
గానము చేయుచు దేవర్షి నారదుఁడు బర్హిష్మతి యను మనురాజ
ధానికి వచ్చెను. బ్రహ్మమానసపుత్త్రుఁడు రాఁగానే స్వాయం
భువ మనువు గద్దెను దిగి నిలుచుండెను. రాఁగానే ఆతనికి
అర్ఘ్యపాద్యాది షోడశోపచారములచేఁ బూజించి, కూర్చుం
డుటకు మణిమయాసనము నొసంగెను. శాస్త్రీయవిధిచే చక్ర
వర్తి పూజలను గ్రహించి స్వస్థచిత్తుఁడై కూర్చుండిన తర్వాత
మంత్రి, కోశాంతఃపుర పరివారాదికుశలసమాచారము నడిగెను.
పరస్పర కుశలసమాచారములైన తర్వాత శతరూప విచ్చే
సెను. ఆమె మునికి మ్రొక్కి, తన పిల్లలచే మ్రొక్కించెను.

యోగ్యానుసారముగ నందఱు కాశీర్వాదమొసంగిన తర్వాత నందఱను గూర్చుండుట కాజ్ఞయొసంగెను. మహారాజుప్రక్కన శతరూప కూర్చుండెను. పిల్లలందఱును ముందుగూర్చుండిరి.

ఆ తర్వాత నారదమహాముని నవ్వుచు మనుమహారాజుతో నిట్లనెను:- "రాజా! నీ వేదియో చింతగానున్నట్లున్నది. నీ కేదియో మానసిక చింత యున్నట్లు నే ననుకొనుచున్నాను. నీ చింతకుఁ గారణ మేమో నాకు చెప్పుము. యథాశక్తిగ నేను నీ చింతను బోఁగొట్ట ప్రయత్నించెదను."

దేవర్షి నారదుఁడు పలికిన మధుర, సుఖదవాక్యములను విని మనువిట్లనెను:- "స్వామీ! ఈ గృహస్థాశ్రమము చింతా సాగరమేకదా! దీనిలో నొకటి తర్వాత నొకటి నిరంతరము చింతా తరంగము లుప్పతిల్లుచుండును. గృహస్థుని చింతలకు ప్రధానకారణములు రెండే. ధనము, సంతానము. ధనము లేకున్నచో దాని ప్రాప్తికై చింత. ఉన్నచో దానిని బెంచుటకును, రక్షించుటకును జింత. సంతానము లేకున్నఁ జింత. ఉండినవారిని బోషించుటకును, వారిని యోగ్యులుగా నొనర్చుటకును, వివాహము లొనర్చుటకును జింతకలుగును. ఈ చింతలన్నిటికిని మించిన చింత యుక్తవయస్సువచ్చిన కన్యకకు వివాహచింత చాల గొప్పది. ధర్మయుక్తుఁడగు తండ్రికి కుమార్తెను యోగ్యుఁడగు వరునికొసంగి వివాహము చేయునంతవఱకును జింతయే. వివాహమైన తర్వాత నామె సుఖాదులను గూర్చిన చింతయుండును గాని అంతయధికముగ నుండదు. మీ దయవలన నాకు ధనము నకుఁ గొదువలేదు. భగవంతుఁడిచ్చిన సంతానమును నైదుగురు కలరు. ఇప్పుడు నాకుగల చింత ఈ దేవహూతిని గుఱిం

చిహ్నే. ఈమె వివాహయోగ్యయైనది. ఈమెకుఁ దగినట్లుగఁ బరమభక్తుఁడును, సదాచారియునగు వరుఁడు దొఱకినఁ జాలు నని యున్నది. నన్నీ చింతయే సదా బాధించుచుండును. "

సమీపమునఁ గూర్చుండిన దేవహూతి యిది యంత యును వినుచుండెను. ఆమె సిగ్గుచేఁ దలవంచుకొని, నిరంతరము నేలనుజూచుచు, కాలి బొటనవ్రేలితో నేలను ద్రవ్వుచుండెను.

నారదుఁడిది విని కొంచెము సేపూరకుండి దేవహూతిని లక్షించుచు నిట్లనెను:- " అమ్మా! ఇటురమ్మా. నీ చేతిని జూపించుము. "

దేవహూతి సిగ్గుపడి తన తల్లివైపు చూచుచుండెను. ఇద్దరు నొక్కసారిగ నిట్లనిరి:- "వెళ్ళుమమ్మా! మహర్షి పిలుచు చున్నారు. నమస్కరించి వారికడకుఁ బొమ్మ." అత్యంత సంభ్ర మముతో దేవహూతి మునికిఁ బ్రణమిల్లి, సిగ్గుతోఁ దలవంచు కొని మునిసమీపమున నిలుచుండెను. ముని యరుణకమలాభ మగు నామె హస్తమును దనచేతిలోనికిఁదీసికొని రేఖలద్వారా ఆమె శుభాశుభములను గాంచెను. అన్నిటిని బరీక్షించి యాతఁ డిట్లనెను:- "రాజా! నీ కూఁతురు అతిశయ భాగ్యశాలి. ఆమె లోకములో గొప్ప యశస్విని కాఁగలదు. ఇప్పుడు నాకు జ్ఞాప కమునకు వచ్చినది. సరస్వతీ నదీతీరమున కర్దమమహాముని ఘోరతపస్సు చేయుచున్నాఁడు. ఆతఁడపరప్రజాపతియే. రూప, వయోగుణాదులందును, సదాచారమునను ఆతఁ డీ కన్యకకుఁ దగినవాఁడు. ఆతనిని మించిన తపస్విని, యశస్విని, ధర్మాత్ముని, సత్యపరాయణుని నే నెఱుఁగను. నీ వీ పిల్ల నాతనికిచ్చి వివా హము కావింపుము."

దేవహూతి చేతిని జూచి నారదుఁడిట్లు చెప్పుచుండఁగనే ఆమె గుండె కొట్టుకొను చుండెను. లజ్జావశమున నామె మెలి కలు తిరిగిపోవుచుండెను. ముని చేయిచూడకుండినచో నామె యంతఃపురమునకుఁ బరువిడి యుండెడిదే; కాని ఆమెకిప్పుడు పరు విడు శక్తియును లేకుండెను. ఆమె యచ్చటనే తలవంచుకొని నిలుచుండెను. ముని చేయి విడువఁగానే యామె నమస్కరించి లోనికిఁ బోయెను.

మునివచనములను విని యానందించుచు మనువిట్లనెను:- "స్వామీ! కర్దమమహాముని ప్రశంసను నేను చాల దినముల క్రిందటనే వినియుంటిని. ఆతనితో నిట్టి ప్రస్తావమును జేయుటకు నాకు సాహసములేదు. ఆతఁడు తపస్వి, బ్రహ్మచారి. ఈ ప్రస్తా వముచే నాతఁడు నాపైఁ గోపగించుకొనునేమోనని భయపడు చున్నాను. ఆతఁడు నా యీ పుత్రికను స్వీకరించెనా నీమె జన్మము సఫలము కాఁగలదు. నేనును నిశ్చింతుఁడ నగుదును. ఆతఁ డీమెకుఁ దగినవాఁడే."

నారదమహామునియిట్లనెను:- "రాజా! మీరీ విషయమును గూర్చి చింతింపవలదు. కర్దమమహాముని భావమును నే నెఱుఁ గుదును. బ్రహ్మచారులు రెండు విధములు:- నైష్ఠికులు, ఉప కుర్వాణులు. జీవితాంతము వఱకు వివాహము చేసికొనక అఖండ బ్రహ్మచర్యవ్రతమును బాలించువాఁడు నైష్ఠిక బ్రహ్మ చారి కేవలము వివాహము పర్యంతము బ్రహ్మచర్యమును బాలించువారు ఉపకుర్వాణులు. కర్దముఁడు ఉపకుర్వాణుఁడే. బ్రహ్మచర్యమైన తర్వాత యోగ్యమగు కన్యక లభింపఁగానే వివాహము చేసికొనఁగలఁడు. కావున నీ వీ సర్వలక్షణసంపన్న

యగు నీ కన్యకను త్యాగియుఁ, దపస్వియు, సర్వసమర్థుఁడు నగు ముని కర్పింపుఁడు  ఇట్లు చేయుటచే నీమెకును లోకములోఁ గీర్తి వృద్ధికాగలదు. మీరును బరమపుణ్యభాగులు కాఁగలరు."

నారదుని యీ వాక్యములను విని స్వాయంభువ మనువు నకు హర్షాతిరేకముచే శరీరము పులకరించెను. ప్రేమచేఁ గంఠము రుద్ధమగుటచే నోట మాట రాలేదు. కొంచెము సేపటి కాతఁడు ప్రకృతిస్థుఁడై యిట్లనెను:- "మహాముని! మీరు కృప చేసితిరి. నన్ను అతిశయచింతనుండి గట్టెక్కించితిరి. లోకములో సాధువుల భ్రమణము పరోపకారము కొఱకే  వారి దర్శన మాత్రముచేతనే మానవుల దుఃఖములు తొలఁగి పోఁగలవు. స్వామీ! నేను రేపే నాగృహిణితోడను, నాకుమార్తెతోడను సరస్వతీ నదీతటమునకుఁబోయి కర్దమమహాముని యాశ్రమము నకుఁబోయి యాతనినిఁ బ్రార్థించి వినయవిధేయతలచేఁ బ్రస న్ననిఁ గావించుకొందును."

మైత్రేయుఁ డిట్లనెను :- "విదురా! ఈవిధముగ స్వాయంభువ మనువుచే సత్కృతుఁడై వారికడనుండి నారద మహర్షి స్వేచ్ఛగా వీణ గానముచేయుచు నన్యలోకములకుఁ బోయెను. ఇచ్చట మహారాణియగు శతరూపయుఁ బుత్రికతోఁ గర్దమమహామునియాశ్రమమునకుఁ వెళ్లుటకు సిద్ధపడుచుండెను."



# కర్దమునకు భగవద్దర్శనము, వరదానము.

కామనా పూర్తికొఱకు భగవంతుని యాచించుటయే జీవునిలోఁగల యపూర్ణత. చరాచర విశ్వ సృష్టి, స్థితి, లయము లకు స్వామియు, కర్మనియామకుఁడునగు పరమాత్మకు ప్రతి వాని విషయమును దెలియును. ఏజీవి కెట్లొనర్చిన మేలుకల్గునో ఆవిషయము బాగుగా నాతనికే తెలియును. ఏజీవికి ఏకార్యము వలన మేలుకలుగునో ఆవిషయములు బాగుగా నాతనికే తెలి యును. మనము మధ్యలోఁ గర్తృత్వమును బెట్టుకొని చింత నధికము కావించుకొను చుందుము. భగవంతుఁడు భక్తులకు కల్పతరువువలె మనోవాంఛితఫలముల నొసంగుచుండును. కల్ప తరువు, సాంసారిక భోగపదార్థములనే ప్రసాదింపఁగలదు. దాని నాశ్రయించిన ముక్తి లభింపదు. కాని వాసుదేవు నాశ్రయించిన ముక్తి భక్తులను రెంటెని బొందవచ్చును. ఆతని నాశ్రయించిన తర్వాత మానవుఁడు దేనిని కోరునో అది లభించి తీరును. ఈ విషయమును లక్ష్యమునం దుంచుకొనియే మైత్రేయ మహా ముని విదురునకుఁ రాఁబోవు కథను జెప్పుచున్నాఁడు.

మైత్రేయుఁడిట్లనెను:- "విదురా! ఇచ్చట నారదమహాని స్వాయంభువమనువున కిట్లు చెప్పి వెళ్లిపోయెను. అచ్చట కర్దమ మునికిని తపస్సు పూర్తియగు సమయ మాసన్నమయ్యెను. ఆతని ఘోరతపస్సునకుఁ బ్రసన్నుఁడై వరమొసంగువారిలో శ్రేష్ఠుఁడును, భక్తవత్సలుఁడు నగు భగవంతుఁడు కర్దమమహా మునికిఁ బ్రత్యక్షమయ్యెను. కర్దమమహాముని సరస్వతీతటమునఁ దన పరమరమణీయమగు నాశ్రమమందు స్వస్థచిత్తుఁడై సుఖాస నమున నుండెను. ఆతఁడు చిత్తము నేకాగ్రము కావించుకొని

భగవంతునియందు లగ్నమొనర్చెను. ఆతఁడు ధారణా ధ్యాన ములను దాటి సమాధిలో శ్యామసుందరుని సాక్షాత్కరింపఁజేసి కొనెను. భగవంతుని సౌందర్య, మాధుర్యరూపమగు నమృత మును బానము చేయుటచే సంతుష్టుఁడై బాహ్యప్రపంచమును మఱచెను. భగవంతుని మనోహరమూర్తి హృదయమునుండి యంతర్హితమయ్యెను. ధ్యేయవస్తువు విలీనమగుటచే వ్యాకులుఁడు కాఁగా నాతని సమాధి భంగమయ్యెను. అందువలన నాతఁడు కన్నులను దెఱచెను. కన్నులు దెఱచునప్పటికి సమాధిలో నింత వఱకును గనఁబడుచుండిన మనోహరమూర్తియే యెట్టె యెదుటఁ బ్రత్యక్షముగ నుండెను. శంఖ చక్ర గదా పద్మము లను ధరించి, వనమాలాలంకృతుఁడై, కౌస్తుభమణి ప్రభాపట లముచే దశదిశలను బ్రకాశింపఁజేయుచు కనకాంబరమును ధరించి, మందహాసము చేయుచు శ్రీమహావిష్ణువు సశరీరుఁడై మూర్తిమంతుఁడై యెట్టయెదుట నిలిచెను. కోటి సూర్య చంద్రు లొక్కసారిగా వెలిఁగినట్లు ఆతని నిర్మలప్రకాశము నలు దిశల వెలుగుచుండెను. అద్భుతానుపమానసమున అసితాలకా వళి విరాజిల్లుచుండెను. విద్యుత్ప్రభలను లజ్జింపఁజేయు పీతాంబ రము కదలుచు భక్తుల నాశ్వాసించుచు నభయప్రదానము కావించు చున్నట్లుండెను. కర్ణకుండలముల కాంతి కపోలశోభ నినుమడించు చుండెను. మనోహర మందహాసము చిత్తమును హరించుచు భక్తులహృదయమున సంజీవనీ సుధాసంచా రము కావించుచుండెను. వాయువేగమును మించిన వేగము కలవాఁడును, సామవేదమంత్రముల నుచ్చరించు ఱెక్కలు కలవాఁడు నగు వినతానందనుఁడగు గరుడునిపై నెక్కి ఆకాశ

ముఁన భగవంతుఁ డుండుటనుగాంచి కర్దమమహామునికి ఆనందము నకు మేఱలేకుండెను. ఆతఁడు సంభ్రమమున వెంటనే లేచెను. ప్రేమోద్రేకముచే నాతఁడు కర్తవ్యనిర్ణయము చేయఁజాలక పోయెను. కింకర్తవ్యతా విమూఢుఁడై ప్రేమవ్యాకులుఁడై కృతకృత్యుఁడైతి ననుకొని సాష్టాంగ ప్రణామము చేయుచు నేలపైఁ బడెను. అత్యంతప్రేమచే నాతని నేత్రద్వయమునుండి ప్రేమాశ్రువులు వెడలుచుండెను. అంతఁ బ్రణామము కావించి గద్గదకంఠముతో వాసుదేవుని స్తుతింప మొదలిడెను."

కర్దమముని యిట్లనెను:— "ప్రభూ! ఈ కన్నులీ సాంసారిక పదార్థములను వాసనా యుక్తముగఁజూచి కలుషితములైనవి. ఇవి మిమ్ములను దర్శించినప్పుడే సఫలములైన వనవలెను. నీ దర్శనము నీ కృపలేక యోగాది సాధనములచే లభింపదు. ఈ జీవి సంసారములో మాయావశుఁడై అవశమున నానాయోనులలో భ్రమించుచున్నాఁడు. ఇంద్రియములు సాంసారిక భోగములకుఁ దగుల్కొనిన వాటిని అనుభవింపవలయునను కోరిక జనింపఁగలదు. ఉపభోగమువలన వాసన వృద్ధిచెందును. వాసనవలన సంసారబంధనము వృద్ధియగును. సంసారమును దాఁటించు నిన్ను విషయప్రాప్తికొఱకు ఉపాసించువారు చక్రవర్తిని సందర్శించి తవుడును యాచించినట్లు, కల్పవృక్షముక్రిందఁ గూర్చుండి జిల్లేడుపాల నడిగినట్లును, భాగీరథీతీరమునకుఁ బోయి క్షుద్రమురుగునీటి తటాకజలమును ద్రావఁ గోరినట్లుండును. కాని నీ వొసంగఁజాలని దొకట్టియును లేదు. నీ చరణముల కడ కే భావముతో వచ్చి, నీ సమీపభక్తుఁడే వస్తువును యాచించునో నీవు దానినే యొసంగుచుందువు. నీవు ఆర్తజిజ్ఞాసు, అర్థార్థి,

జ్ఞాని యనఁబడు భక్తులందఱ కోరికలను దీర్చుచుందువు. అర్థార్థికి అర్థమును, విద్యార్థికి విద్యను, ధనార్థికి ధనమును, పుత్రార్థికి పుత్రులను, ధర్మార్థికి ధర్మమును, కామార్థికి కామమును, భార్యార్థికి సుందర మనోనుకూలయగు భార్యనుగూడ యొసంగెదవు."

భగవానుఁడు నవ్వి యిట్లనెను:- "కర్దమా! వారట్లుగు చుందురు. కాని నీవింతటి ఘోరతపస్సును పది వేల సంవత్సరముల నుండి చేయుచున్నావు. నీవు వారిలో లేవు. నీవు నన్ను నిష్కామ భావముతో నారాధించుచుంటి వనుకొందును."

కర్దముఁ డిట్లనెను:- "లేదు స్వామీ! నేనుకూడ అట్టి అజ్ఞులలో నొకఁడను. నా తపస్సుకూడ నిష్కామమైనది కాదు. మనస్సులోఁ గోరిక నుంచుకొనియే నిన్ను ధ్యానించుచున్నాను."

భగవానుఁ డిట్లనెను:- "కర్దమా! నీ కోరిక యేమి? నాకు చెప్పుము. నేను దానిని తప్పక తీర్చఁగలను."

కర్దముఁడు కొంచెము సిగ్గుపడి యిట్లనెను:- "స్వామీ! ఏమి చెప్పుదును? నీవు సర్వజ్ఞుఁడవు. ధర్మార్థ కామములను, సర్వ విషయసుఖముల నొసంగు నొక సుందర కామధేనువు కావలయును."

భగవానుఁడు నవ్వి యిట్లనెను:- "సముద్ర మంథన సమయమున నైదు కామధేనువు లుద్భవించినవి; కాని వానిని ఋషులు కొనిపోయిరి. ఆ గోవులలో నే కామధేనువునైనను నీవు కోరునెడల నా ఋషిచే దానిని నీకిప్పించెదను. నీయాశ్రమములోఁ గట్టింపఁగలను. అది నీ వేమియడిగిన దాని నీయఁగలదు."

కర్దముఁడు సంకోచించెను. భగవానుఁడు ఆటగాఁడు. అన్ని విషయములను ద్రచ్చి ద్రచ్చి యడుగుచుండెను. స్పష్టముగఁ జెప్పింపవలయునని యాతని యాశయము. కావున నాతఁడు సిగ్గుతో నిట్లనెను:- "స్వామీ! నాకు నాల్గుకాళ్ళ కామధేనువు అవసరము లేదు. నాకు నాల్గుకాళ్ళకంటె శ్రేష్ఠమైనదగు రెండు కాళ్ళ కామధేనువు కావలయును. ఆ కామధేనువు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది సుఖముల నొసంగు వస్తువులనే యుత్ప న్నము కావింపఁగలదు; కాని నే నడిగిన ఈ రెండుకాళ్ళ కామ ధేనువు స్వయముగ నీ తన్మాత్రల సుఖముల నన్నిటిని బ్రసా దింపఁగలదు. దాని స్వరము సదా వీణాస్వరమును వినిందించు చుండును. పురుషునివాక్కు- పదునాఱేండ్లుకాఁగానే బొంగుపారి పోవును. సుఖదరూపము, సర్వరసముల నొసంగు శక్తి, గంధము, స్పర్శ మనోజ్ఞముగ నుండవలయును. నే నా కామధేనువును మేకునకుఁ గట్టివేయను. దానిని గృహేశ్వరిగను, హృదయేశ్వరి గను జేసికొందును. గృహమునకు యజమానురాలగుటచే నామెను గృహిణి యందును."

సమీపమున నున్న లక్ష్మీదేవి లోలోన నవ్వుకొను చుండెను. భగవానుఁడు నామెవైపు చూచెను. ఇద్దరి కన్నులు నాలుగు కన్నులయ్యెను. అంత నిట్లనెను:- "మంచిది, మునివరా! నీవు నీ కనురూపమగు భార్యను గోరుచున్నావు. నీవు గృహస్థుఁ డవు కాఁగోరుచున్నావు."

కర్దమముని సిగ్గుపడుచు నిట్లనెను:- "స్వామీ! ఏమి చెప్పుదును? కోరికలు పుట్టించువాఁడవును నీవే. నీ వేదాజ్ఞ రూపమగు త్రాటిమీఁద జీవులు బంధింపఁబడినారు. నీ వెట్లొ

డించిన వారట్లాడెదరు. ఇందు మా దోషమేమి యున్నది? లేకున్న, నిన్నుఁ బ్రసన్నుని గావించుకొనియు నిన్ను విషయ సుఖముల నేలకోరుదును? నీ భక్తు లీ సాంసారిక విషయముల వైపు కన్నుల నెత్తియైనను జూడరు. వారు నిరంతరము నీ కథా కీర్తన రూపమగు నమృతమును బరస్పరము కలసి వ్యగ్రతతోఁ బానము చేయుచుందురు. నీ నామకీర్తన, గుణకీర్తనముల వలన నాతని కెన్నటికిని దృప్తికలుగక యతృప్తుఁడుగానే యుండును. అట్టివాఁడు దేహధర్మములను మఱచి, పిచ్చివానివలెను, వెఱ్ఱి వానివలెను నీ ధ్యానములో నిమగ్నుఁడై యుండును. నీ కీర్తిరూప మగు నమృతమును బానము కావించి ఆతఁడజరామరుఁడగును. నీవు సర్వజ్ఞుఁడవు, సర్వశక్తిమంతుఁడవు. భక్తులేమి యాచించిన దానినొసంగుచుందువు కాని యీ సాంసారిక పదార్థము లిచ్చుట కిష్టములేదు. కావున నీవీ నా వివాహేచ్ఛను నెఱవేర్పుము. చివరకీ సంసారసాగరమునుండి ముక్తిని బొందింపుము. నాకు నీ వంటిపుత్రుఁడు పుట్టవలయును. వానివలన నిహలోక పరలోక సుఖములను అనఁగా భోగమోక్షములను బొందవలయును."

భగవంతుఁడు నవ్వి లోలోననిట్లనుకొనెను:—"చూడుఁడు ముని యెంతటి బుద్ధిమంతుఁడో! తపస్సు చేయుటచే నెంతగా బుద్ధినిర్మలమైనది! ఒక్కకోరికలోనే భార్యను, పుత్రుని నడి గెను. అదియు సామాన్యపుత్రుఁడు కాఁడు. నన్నే కొడుకుగాఁ గోరెను. చివరకు ముక్తియు నడిగెను. కాని నేను భక్త విక్రీ తుఁడను. వారేది యడిగిన దానిని విచారింపకయే యిచ్చి వేయుదును." అని యిట్లాలోచించుకొని భగవానుఁడిట్లనెను:—"మునివరా! నీ వన్నివస్తువుల నడిగితివి."

ఇదివిని ముని లోలోన నానందమును జెంది యిట్లనెను:– "స్వామీ! సుమేరువు నెక్కి సువర్ణమునకు లోభపడ నేల? గంగాతీరమును జేరి గంగాజలమును ద్రావ సంకోచింపనేల? మీ దర్శనమైన మీఁదకూడ ఇంత గోరికలుండునా యేమి? దయాసాగరుఁడ వగు నిన్ను శరణు వేఁడియు నపూర్ణకాముఁడ నగుదునా? మీ దర్శనమే సమస్తకోరికలను నెఱవేర్పఁగలదు."

ఇది విని భగవానుఁడు నవ్వి యిట్లనెను:– "మునివరా! నీ వే కోరికతో నన్నారాధించితివో అది నాకు తెలియనిదికాదు. నాకు నీ మనోగతభావములు తెలియును. నన్నే భావముతో నారాధించినను నిష్ఫలము కాఁజాలదు. అట్టియెడ నీవంటి విరాగి, త్యాగియైన మునీశ్వరుల తపస్సు వ్యర్థమెట్లు కాఁగలదు? నేను నీ కోరికలనన్నిటిని నెఱవేర్చెదను. నీవడుగుటకు పూర్వమే నేను నీ వివాహమున కేర్పాటు కావించితిని. అంతయు సిద్ధమైనది."

మునిహృదయము ముప్పొంగెను. ఆతఁడిట్లనెను:– "అయితే స్వామీ! నే నెంతవఱకు ప్రతీక్షింపవలయును?"

భగవానుఁడు నవ్వుచు, తన మాటను సమర్థించుకొనుచు నిట్లనెను:– "ఎంతవఱకో యెందులకు? రేపు లేదు ఎల్లుండి నీకు మనోహారిణియగు గృహిణి లభింపఁగలదు."

కర్దమముని తన యుత్సుకత నణఁచుకొనుచు నిట్లనెను:– "స్వామీ! ఇంతవఱకు మాటయును లేదు మంతనమును లేదు. ఎల్లుండి పెండ్లి యెట్లు కాఁ గలదు? పిల్ల యెచ్చటనుండి రాఁ గలదు? జటాజూటధారియు, ధూళిధూసరితుఁడగు నంబోటి

వాని కెవనిపిల్ల నీయఁగలఁడు ? కాని మీ కసంభవ మేమి కలదు? నీ యుచ్ఛ్వాస నిశ్శ్వాసముల చేతనే సృష్టిప్రలయములు జరుగఁ గలవు. ఒక్క వివాహవిషయములో లెక్కయేమి కలదు ?"

మునియొక్క అత్యంతోత్సాహమును గాంచి భగవానుఁ డిట్లనెను:— "మునివరా! నీవు ధైర్యమును వహింపుము. సాధారణమైన బాలిక కాదు. సప్తద్వీపాధిపతియగు మనుమహారాజు కూఁతుతో నీకు వివాహము కాఁగలదు. ఆ బాలిక అట్టి దిట్టిది కాదు. లక్ష్మీదేవిని బోలిన రూప, గుణ, వయశ్శీల, సదాచారములుకల పరమ సుందరియగు దానితో నీకు వివాహము కాఁగలదు. నీవు పిల్లనడుగుట కామె యింటికిఁ బోనక్కఱ లేదు. కన్యను వెంటఁబెట్టుకొని రాణియు, రాజును నీ కుటీరమునకే రాఁగలరు, వారు నీ చరణములపైఁబడగలరు. నాభక్తుల సమస్త వాంఛలు, ప్రతిష్ఠతోఁ బూర్తి కాఁగలవు. వారి కార్యముల నన్నిటిని నేనే నెఱవేర్పఁగలను."

రాజకుమార్తె త్యాగియు, విరాగియు నగు నాతని గని యిష్టపడదని ఆతని కనుమానము. ఇద్దరకు పరస్పర ప్రేమ యుండవలయును భగవానుఁడాతని మనోభావమును గ్రహించి యిట్లనెను:— "ఆపిల్ల పరమ సుశీల, శ్యామసుందరి, సద్గుణ సంపన్న. ఆమె నీకు భార్యయై ఈశ్వరబుద్ధితో సేవింపఁగలదు. ఆమెయు నారాధనము చేయుచుండినదే. నీవును పదివేల సంవత్సరములు తపస్సును జేయుటచే నంతఃకరణము నిర్మల మైనది. కావున మీ దాంపత్యము అనురూపముగ నుండఁగలదు. మీలో మీకు ప్రేమ వృద్ధి కాఁగలదు."

కర్దముఁ డిట్లనుకొనెను :- "గృహస్థునకు సంతానము లేకున్న గృహము శూన్యముగనే తోఁచగలదు. ఇంతకు సంతానము కలుగునో కలుగదో ?" ఆతని మనోభావమును గ్రహించి భగవానుఁ డిట్లనెను:- "మునివరా ! నీ వీర్యము వలన నా మనుపుత్రికకు పరమ యశస్వినులగు తొమ్మిదిమంది కన్యక లుద్భవింపఁగలరు."

కర్దముఁడు చేతులు జోడించి యిట్లనెను:- "స్వామీ ! ఒకరు ఇద్దరును కారు తొమ్మిదిమంది. వారైనఁ గన్యకలే. ఒక్క కన్యకకు వరుని వెదుకుటకే చాలబాధ కలుగుచున్నది. తొమ్మిదిమందికి నేను వరుల నెట్లు వెదుకఁగలను ? నాకు లోకవ్యవహారముకూడ తెలియదు."

భగవానుఁ డాతని యమాయకత్వమునకు నవ్వి యిట్లనెను:- "మునివరా ! ఆడుపిల్ల యెంతయో అదృష్టమునఁ గాని జన్మింపదు. లోకములో నన్నదానము, భూదానము, గోదానము, సువర్ణదానము ఇవి శ్రేష్ఠదానములని చెప్పఁబడినవి. కాని కన్యాదానము అన్నిదానములకంటె శ్రేష్ఠమైనది. సుశీల, సుందరియగు కన్యను వస్త్రాలంకారములతో దానముచేసిన మానవుఁడు అక్షయ పుణ్యలోకములను బొందఁగలఁడు. వరాన్వేషణకై నీ వెచ్చటికిని బోనవసరము లేదు. తొమ్మిదిమంది వరు లిచ్చటికే రాఁగలరు. ఇచ్చటనే వారికి వివాహము కాఁగలదు. ఈ భూమండలము నంతను దమ సంతానముచే నింపునట్లుగ నా కన్యకలు సంతానమును గనఁగలరు."

కర్దముఁ డిట్లనెను:- "స్వామీ! కన్యకలు సరియే కాని వంశము నిల్పుటకును, పున్నామ నరకమునుండి యుద్ధరించుటకు నీవంటి పుత్రుఁడు కావలయును."

భగవానుఁడు నవ్వుచు నిట్లనెను:- "మునివరా! నేను తండ్రినై వచ్చితిని; కాని నీవు నన్నుఁ గుమారునిగ నొసర్చితివి. నా భక్తుని నోటినుండి పొరపాటున నేది వచ్చినను దానిని సఫలము కావించెదను. నీవు నావంటిపుత్రుని గోరితివి. లోకములో నావంటివాఁడను నేనే. కావున నేనే నా యంశచే నీకు బుత్రుఁడనై పుట్టి, నీ యశస్సును లోకమంతటను వ్యాప్తి కావించెదను. మీ యిద్దరిని సంసారవిముక్తులఁ గావించెదను. ఇంకేమి కావలయునో చెప్పుము? నీ వింకేమి యడిగినను నొసంగెదను."

ఇది విని గద్గద కంఠముతో కర్దమ ముని యిట్లనెను:- "ప్రభూ! ఇంక నడుగవలసిన దేమున్నది? నేను దార కొఱకు తపమొనర్చితిని. రాజపుత్రియుఁ బరమసుందరియు నగు సతీ వరదానము, నవకన్యకలు కలుగు వరదానము, నీవు పుత్రుఁడవగు వరదానము, నన్ను నా భార్యను ఈ సంసారమునుండి తరింపఁజేయు వరదానము నొక్కసారిగ నొసంగితివి. భుక్తి ముక్తులు రెండును లభించినవి. గొప్పవారిని కొద్దిగా యాచించినను నధికముగ లభింపఁగలదు. ఇంక నింతకంటె నేనేమి చెప్పఁగలను?"

మైత్రేయమహాముని విదురునితో నిట్లనెను:- "విదురా! ఇట్లు పలికి ప్రేమవిహ్వలుఁడై ముని భగవంతుని సమ్ముఖమున సాష్టాంగదండప్రణామము కావించెను. కన్నులు తెఱచి చూచు

నప్పటికి సామవేదబుక్కుల నాతని పక్షములచే నుచ్చరించుచు గరుడుఁడు భగవానుని దీసికొనిపోవుచుండెను. క్షణకాలములోనే ఆతఁడు మునిదృష్టినుండి యదృశ్యుఁడయ్యెను. కర్దముఁ డట్లే పైకి చూచుచుండెను."



## కర్దమముని ఆశ్రమమునకు మనువు వచ్చుట.

లోకములో నధికాంశములగు విషయములు అనుమానముచేఁ దెలియఁబడు చున్నవి. కవులు వ్యుత్పన్నమతులు, విశాలబుద్ధులు గలవారుగ నుందురు. జీవితకాలమంతయు సంపర్కము కలిగియుండినను గ్రహింపలేని విషయములను కవులు అనుమానము ద్వారమున నెఱుఁగుదురు. అందుకనియే చెప్పినారు "రవికాననిచోఁ గవి కాంచఁగలఁ"డని. కొన్ని విషయములు అనుభవములేక దెలియఁబడవు. అనుభవములేక వానిని వర్ణింపఁబూనుట అనధికారకార్యమే కాఁగలదు. సంబంధ నిశ్చయమై వివాహముహూర్త నిశ్చయమైనతర్వాత వయస్సువచ్చిన వధూవరుల హృదయమందెట్టి యుత్కంఠత కలుగునో దాని నెవరును అనుభవము లేనివారు చెప్పఁజాలరు. సంబంధ నిశ్చయమైన తర్వాత ప్రాప్తవయస్కులగు వధూవరుల హృదయములలోనుండు ఉత్కంఠత అనుభవము గలవారికి తెలియవలసినదే కాని జీవితములో నట్టి యవసరము లేనివానికిఁ దెలియఁజాలదు.

మైత్రేయముని విదురునితో నిట్లనెను:- "విదురా! భగవంతుఁడు కర్దమునకు వరమిచ్చి వెడలిపోయెను. ఇప్పుడు కర్దమ

ముని తన యాశ్రమములో నొంటరిగా నుండెను. మన్మథుఁ డాతని మనస్సులోఁ బరువిడఁ బ్రారంభించెను. నేఁడు మంగళ వారము. బుధవారము మధ్యలోనున్నది. గురువారము నాఁటికి రాజు రాఁగలఁడు. ఆ దినమున శుభముహూర్తము. వివాహమై పోవును. భగవద్వచనము అబద్ధము కారాదు. రాజు రథమెక్కి రాఁగలఁడు. ఈతని వద్ద స్వాగత సత్కారము లొనర్చుటకైన నేమియును లేదు. రేఁపటినుండియే అధికముగఁ గందమూల ఫలములను బ్రోవుచేయుచును. భగవానుఁ డా చక్రవర్తి పుత్రిక నెంతోఁ బ్రశంసించెను. ఆమెను లక్ష్మీదేవితోఁ బోల్చెను. ఇంతవఱకామె సుఖముగఁ బెరిగినది. రాజభవనములలో నివ సించినది. వేలకొలఁది దాసదాసీజనములు నిరంతరము సేవించు చుండును. ఇప్పుడామె వనములో నివసింపవలసి యుండును. ఆమె మనస్సునకీ నిర్జన వనమెట్లు రుచింపఁ గలదు? ఆమె ప్రకృతిప్రియ, ప్రకృతిసౌందర్యోపాసిని యగుచో నిచ్చట ఆమెకుఁ జాల సామగ్రి లభింపఁ గలదు. ఈ వనము దట్టముగ నున్నది. నందనవనమువలె సమస్త ఋతువులలోను పుష్పించి ఫలించు చుండును. పరాగయుక్తములగు పుష్పములు కల యీ కదంబ వృక్షములెంత కమనీయముగ నున్నవో కదా! వీటిమీఁద భ్రమరములు వ్రాలినప్పుడు స్వర్ణకందుకముమీఁద నీలమణులు కూర్చినట్లున్నది. ఈ దట్టమగు చంపకలతయందలి పుష్పములం దెంతటి మోహక గంధము కలదు? పరమ తేజస్వియగువాని దగ్గఱకు పాపాత్ముఁడు రాఁజాలనట్లు భ్రమరములు దాని దగ్గ ఱకే చేరుటలేదు. ఈ యశోకవృక్షమున కెట్టి నూతన మృదు పల్లవములు కలవు? అశోకమను పేరు దీనికి సార్థకమైనది. దీని

క్రిందఁ గూర్చుండిన నే విధముగ శోకము లుండఁజాలవు. ప్రప్రథమమున నశోకము పుష్పించినప్పుడు పుత్ర పౌత్ర ప్రపౌత్రాదులతోఁ గూడుకొనిన పుణ్యాత్ముఁ డగు గృహస్థుఁ డున్నట్లు శోభించు చుండును.

ఈ పొగడ యెంత దర్శనీయముగ నున్నది! దీని పుష్ప సుగంధ మెంత హృదయాహ్లాదకరముగ మందముగ నున్నది! పుష్పములెన్నో రాలుటచే నా చెట్టుక్రింద వనవిహారులు పుష్ప శయ్య పరచుకొన్నట్లుండెను. కుందమందార పుష్పములు దశ దిశలు తమ వాసనలను వెదఁజల్లు చున్నవి. వీటి అన్నిటికంటె విలక్షణమగు కుటజగంధ మెంత తీక్ష్ణముగ నున్నది? మాధవీ కుంజములోఁ గూర్చుండుటచే నాకాశమందు ఛిద్రములట్లు కనఁ బడుచున్నవి. జవనులకు జడయూడినప్పుడు పుష్పమాలనుండి పూలురాలునట్లు మాలతీపుష్పములు లతలనుండి రాలుచున్నవి. ధూర్తుల సేవకుఁ బ్రసన్నమై వారివశమైన సాధుపురుషులట్లు వివిధవర్ణములు కల పాటలీపుష్పములు కంటకలతలపై శోభిల్లు చుండెను.

ఈ వృక్షముల నాశ్రయించుకొని సత్పరిపాలకుని ఆశ్ర యించుకొని గుణవంతులు, కళాకారులు, పండితులున్నట్లు వివిధ రకములగు పక్షులున్నవి. ఉద్యానవనములలో విహరింపవచ్చిన కాముకుఁ డొకానొక కమనీయ కామినిని గాంచి దాని చుట్టు నూరకఁ దిరుగునట్లు పుష్పించిన పుష్పముల చుట్టును మత్త మధుపములు తిరుగు చున్నవి; రాజు రాఁగానే నర్తకులు నాట్యముచేసినట్లు మేఘములను గాంచి మయూరములు నృత్య ములు చేయుచున్నవి. పరదేశమునుండి తిరిగివచ్చిన తన పతినిఁ

ప్రసన్నునిఁ జేయుటకై పతివ్రత మధురగీతాగాన మొనర్చినట్లు వసంతాగమనమునఁ గోకిలలు తమ కమనీయ కలకంఠములతో మధురగానము చేయుచున్నవి. ఈ పక్షికూజితములచే వనమంతయుఁ బ్రతిధ్వనించుచుండెను. ఇచ్చట తప్పక మనుపుత్రియగు దేవహూతి మనస్సు ఆకర్షింపఁబడగలదు. ఆమె యీ వృక్షములనీడఁ గూర్చుండఁగలదు. పక్షిశాబకములతోఁ గ్రీడింపఁగలదు. ఇచ్చట ఆటవిక పశువులుకూడ చాల కలవు. హరిణములెంత యమాయకపు జంతువులు! వాటి కన్నులకుఁ దన కన్నులకుఁ బోల్చుకొని యామె వానినిఁ బ్రేమింపఁగలదు. కపిలగోవులెంత అమాయకములు! వాటినిఁ బట్టుకొని ఆడుకొనఁగలదు. కొండముచ్చులవలన నామెకు మనోరంజనము కలుగఁగలదు. సూకర, సింహ, వ్యాఘ్ర, గజములు, చిఱుతపులు లున్నప్పటికి, అవి క్రూరమృగములైనప్పటికి నా తపఃప్రభావముచే నవియును వాని క్రూరస్వభావమును మఱచి పెంపుడు హరిణములవలెఁ దిరుగుచు నెవరిజోలికిని పోవు. మనుపుత్రిక వానితో వివిధక్రీడ లొనర్పఁగలదు. వానినిఁ బ్రేమింపఁగలదు. ఈ మూలకముగ నామె మనస్సిచ్చట లగ్నము కాఁగలదు.

వనములో నుండుటకుఁ గొంచెము విసుగు జనించెనా నీ బిందు సరోవరసమీపమునఁ గూర్చుండఁగలదు. ఈ సరోవర జలము లెంతటి ఆరోగ్యప్రదములు, అమృతోపమానములు, సుందర, శీతల, సుస్వాదుజలములు? భగవానుని ప్రేమాశ్రు బిందువులచే నిట్టి మనోరమతీర్థ మేర్పడినది! సరస్వతీ నదీజలములచేఁ జుట్టుకొనఁబడిన నీ రమ్యసరోవరము దుఃఖులనుగూడ సుఖులుగ నొనర్పఁగలదు. దీనికి నలువైపులను బచ్చని దట్టమైన

వృక్షములు కలవు. ఈ శీతలవృక్షచ్ఛాయల( గూర్చుండి వాయు తాఁకిడిచే జేగిన తరంగములను గాంచినచో నామె రాజభవన ములను గూడ మఱచిపోఁగలదు. జలములలో వివిధరంగులు కల మత్స్యములు కమలములను గంపింపఁజేయుచు నిటునుండి యటుఁ బోవు టెంత మనోహరముగనున్నది! పశు పక్ష్యాదు లీ పుణ్యసలిలమును ద్రావి యెంత ప్రముదితము లగుచున్నవి! ఈ పుష్కరిణి రాజపుత్రిని తప్పక రంజింపఁజేయఁగలదు. హంస, సారస, చక్రవాక, చకోర, బక, జలకుక్కుట, కురర, కారండవ, జలకాకాది యనేక జలవిహంగములతోఁ శోభిల్లు నీ సరోవర మును చక్రవర్తియొక్క వివిధ రత్నయుక్తమగుఁ గోశమును గాంచి సంతోషించినట్లు సంతోషింపఁగలదు. దంభము లోలోన దాఁగియున్నట్లు మకర, కచ్ఛపాదు లిందు దాఁగి యున్నవి. స్త్రీలు రహస్యవిషయములను దాఁపఁజాలనట్లు మరకత సదృశములగు నీ స్వచ్ఛజలములు కమలపత్రములను దనలోదాఁచుకొనలేకపోవుచున్నవి. భగవానునినేత్రబిందువులచే నిర్మితమై, నీలిమరంగు కలిగి, స్వచ్ఛజలములతోఁ గూడియున్న నీ సరోవర మెంత నయనాభిరామముగ నున్నది. నా ప్రియురా లీ సరోవరప్రాంత నవపల్లవకుంజములలో విహరించుచో నామె రాజధానిలోని సుఖములను మఱచిపోఁగలదు. నగరములో స్త్రీ పురుషులు, పెంపుడు పశువు లెక్కువగ నుండును. వాటికి బదులుగా నిచ్చట వనములో వృక్షలతలు, ఆటవికజీవము లెక్కుడుగ నుండును. ఇవన్నియును ప్రేమించును. వీనికిని చైత న్యము కలదు. ఇవియును సుఖదుఃఖముల ననుభవించుచున్నవి. వీనితో సంబంధము కలిగెనా ఇఁక సాంసారికులతోఁ బని యుం

డదు. నేడు సూర్యుఁ డస్తంగతుఁడగుచున్నాఁడు. మధ్య నింకొక దినము మాత్రము కలదు. ఎల్లుండి రాజు రానేవచ్చును. రాజు, రాణి ఆశ్రమమునుగాంచి ప్రసన్నులగునట్లు కొంచెము సిద్ధము కావించుకొనవలెను. రాకుమార్తెయొక్క మనస్సు కూడ ప్రసన్నము చెందవలెను."

మైత్రేయముని యిట్లనెను:- "విదురా! ఈ విధముగ మునివరుఁ డా విషయమునుగూర్చి యూహాపోహములు చేయ సాగెను. ఆతనికి రాత్రి నిద్రయును బట్టలేదు. తెల్లవారఁగానే పెందలకడ లేచి యాతఁడు చిమ్మి, శీఘ్రముగ నిత్యకర్మలు నిర్వర్తించుకొని ఆశ్రమము నలంకరింప మొదలిడెను. ఆతఁడు ద్వారమును గట్టి కుటీరమువఱకు వెడల్పుగ మార్గము నేర్పఱిచెను. ఆప్రక్కనే రాళ్లు తెచ్చి వరుసగా నుంచెను. వెదురు పొదలనుండి యొక సుందరద్వారమును నిర్మించి, రసాలములపైఁ బ్రాఁకిన మాలతీలతలను దానికిఁ గట్టెను. ఎండుపుల్లలను విఱచియుంచెను. నేఁడు పగలంతయును నీకార్యమందే లగ్నమై యుండెను. తల్లి, తండ్రి, సోదరులు, చుట్టా లుండియుండినఁ బెండ్లిప్రయత్నమును జేసెడువారే. ఇప్పుడు ముని యివియన్నియు స్వయముగఁ జేసికొనవలసివచ్చెను. మనస్సులో నధికమగు నుత్సాహ ముండెను. ప్రతీక్షాఘడియలు చాల దీర్ఘములుగ నుండును. ఆతఁడు దినమంతయుఁ బనిచేయుచు మనస్సును దానిలో లగ్నము కావించెను. ఎట్టులో ఆ దినమును గడచి పోయెను. కాలము గడచినకొలఁది మునికి ఉత్సాహ మధికము కాఁజొచ్చెను. నాఁటి రాత్రి యాతనికి దీర్ఘముగఁ దోఁచెను. పదివేల సంవత్సరములలో నింతటి దీర్ఘరాత్రి ఆతని కొక్కటి

యును లేదు. చుక్కలు లెక్కించుచు నాతఁ డా రాత్రి నెట్లో గడిపెను. ప్రాతఃకాలమునఁ గోకిల కుహూకుహూయని కూయ సాగెను. వాసంతి శీతల మంద సుగంధ సమీరము నూతనోత్సాహముతో మునికి కాన్కయొసంగ నేతెంచెను. ఆమ్ర మంజరీ సుగంధమును గైకొని యనిలుఁడు ముని నాసికాఛిద్రములగుండా హృదయమందుఁ బ్రవేశింపఁ జేసెను. కోకిలాకూజితముచేఁ గర్దమ ముని హృత్తంత్రీ ఝుంకార మొనర్చెను. ఆతఁ డరుణోదయము నకుఁ బూర్వమే లేచెను. భగవానుఁడగు భువనభాస్కరుఁ డింకను ప్రాచీదిశా అరుణాంచలము మాటున నిద్రించుచుండెను. అరుణాంబరముచేఁ గప్పఁబడిన మదవతియగు ప్రాచీదిశ భావి పతివియోగమును స్మరించి మ్లానవదనయయ్యెను. నేఁడు మునికి మిక్కిలి తొందర పుట్టెను. స్వచ్ఛములగు సరస్వతీ సలిలము లందు స్వభావానుసారముగ వేదమంత్రములను బఠింపుచు నాతఁడు స్నానతర్పణము లొనర్చెను. అగ్నిశాలలో నగ్నిని ప్రజ్వలింపఁజేసి విధ్యుక్తముగ హోమము కావించెను. నియమ పూర్తికొఱకు సాధారణజపము కావించి తన యాసనముపైఁ గూర్చుండెను. గతరాత్రియే యాతఁడు గోమయముచే నాశ్రమ మంతయు నలికెను. అగ్నిహోత్రముయొక్క సుగంధితధూపము ఆశ్రమమునంతను సుగంధిత మొనర్చుచుండెను. మరీచి మాలి యగు సూర్యుఁడు సహస్రరశ్మిలతో నవ్వుచు ముని యాశ్రమ మునఁ బ్రవేశించెను. ఆతఁ డుదయింపఁగానే లజ్జావతియగు పెండ్లికుమార్తెవలె నిశాదేవి పాఱిపోయెను. అలికి ముగ్గులు పెట్టఁబడిన యాశ్రమము బాలసూర్యప్రకాశముచే వెలిఁగిపోవు చుండెను. సమస్తమంగళములు స్వయముగ వచ్చి ఋషి కార్య

మందు సహకార మొసర్చుచుండెను. నారాయణప్రియ యగు శ్రీదేవి వచ్చి యాశ్రమమున దన కాం[illegible]ని బ్రసరింపఁజేసెను. ముని నేఁటి ఆశ్రమశోభను గాంచి ముగ్ధుఁడయ్యెను.

విధ్యుక్తముగ భస్మధారణమును గావించి చేత మాలను ధరించి ముని జపము చేయుచుండెను. నేఁటి జపభారము కర జిహ్వాలకు మాత్రము వప్పగించెను. మనస్సు స్వాయంభువమను మహారాజు రథమును వెదకుచుండెను. క్రౌంచెముగ నాకుల చప్పుడయ్యెనా ముని యదరిపడి యటే చూచుచుండెను.

ఇచ్చట స్వాయంభువమనువున కుపదేశించి నారదుఁడు వెడలిపోఁగానే రాణి కన్యాదానమునకుఁ గావలసిన సంభారము లన్నిటిని సేకరించి యథాస్థానమున నుంచెను. దేవహూతి మనస్సు హర్షశోకములమధ్య కొట్టుకొను చుండెను. తన ప్రాణనాథునితో సంయోగము కలుగుచున్నందులకు సంతోషమును, పురజన పరిజనులతోఁ గలుగుచున్న వియోగమునకు దుఃఖమును కలుగుచుండెను. ఆమె తోఁబుట్టువులు, సఖులు వచ్చి యామెతో నిట్లనిరి:– "అమ్మాయీ! గొప్ప తపస్వికి పత్నివై మమ్ములను మఱచెదవేమో! నీవు ఋషిప[illegible]దవు. దేవ, గంధర్వ, ఋషి, మునులు వచ్చి నీ [illegible] బడుచుందురు. అప్పుడు మేము జ్ఞాపకముందుమా? అప్పుడు మమ్ములను గుర్తింపనైన గుర్తింపఁజాలవు."

దేవహూతి ప్రేమ కోపస్వరమున నిట్లనెను:– "మీరు విచిత్రముగఁ బలుకుచున్నారు. ఇప్పుడు మాట్లాడకుఁడు. మీ రెట్టి గాలిమేడలు కట్టుచున్నారు?"

సఖులిట్లనిరి:- "అమ్మాయి! మమ్మేల భ్రమపెట్టెదవు? తూర్పున నుదయించెడు సూర్యుఁడు పశ్చిమమున నుదయించినను నారదవచనము లబద్ధములు కావు. మామాటలు నీకిప్పుడు బాగుండవని యేలచెప్పవు? నీవింకేమో ఆలోచించుచున్నావు."

దేవహూతి యిట్లనెను:- "ఏమిజరుగునో చూడుఁడు. పైన దేవుఁడున్నాఁడు. మీరందఱును నాకు ప్రాణప్రియులు. మీ యందఱ వియోగము నన్ను దుఃఖపెట్టుచున్నది." ఇట్లను చుండఁగనే దేవహూతి నేత్రములవెంట జలజల బాష్పములు రాలెను. సఖులు తమ పైటచెఱఁగులతోఁ గన్నులను దుడిచి, యామె నాలింగనము చేసికొని యిట్లనిరి:- "అక్కా! బ్రతికిన నాళ్లు తాను క్లేశపడుటయు, నితరులకుఁ గ్లేశము కలిగించుటయునే ఆడబ్రదుకుగ నున్నది. పుట్టఁగానే యిల్లంతయుఁ జింతించు చుందురు. కొంచెము పెద్దది కాఁగానే తల్లిదండ్రులు రాత్రిం బవళ్లు చింతించుచుందురు. వివాహమై అత్తవారింటికి వెళ్లునప్పు డందఱ నేడ్పించి పోవును. విధాత స్త్రీలనేడ్చుటకే సృజించి నాఁడు కాఁబోలును. కృపణుఁ డితరులకొఱకు కష్టించి ధనమును గూడఁబెట్టినట్లు తండ్రి తనయ నితరునికొఱకు పెంచును. ఆడపిల్ల యింటిలోఁ గొలఁదికాలమే యుండును. ఏదినముననో ఆమె పతి గృహమునకు వెళ్లితీరవలయును. భగవంతుఁడు నీకు శుభ మొనర్చుఁగాక. నీవు నీ ప్రాణనాథునకుఁ బ్రియపగుదువుగాక! నీవు పుత్ర పుత్రికలతోఁ గళకళలాడుచు నుండవలయునని మా యొక్క హృదయపూర్వకమగు కోరిక." ఈవిధముగ రాత్రియం తయు మాట్లాడుకొనుచునే యుండిరి. దేవహూతి నిరంతరము కంటనీరు పెట్టుచునేయుండెను.

ప్రాతఃకాలమయ్యెను. మహారాజు నాజ్ఞచే విశాలమగు రథము సుసజ్జితమై యంతఃపురము ముందు నిలిచెను. సామానంతయు రథముపై వేసిరి. మహారాజు మహారాణినిఁ దొందఱ పెట్టుచుండెను. మహారాణియగు శతరూప తన పుత్రికను వెంటఁ బెట్టుకొని రథము సమీపమునకు వచ్చెను. అనేకములగు దాసదాసీజనములు, తోఁబుట్టువులు, చెలికత్తెలు చుట్టు నుండఁగా రాజపుత్రియగు దేవహూతి రథ సమీపమునకు వచ్చెను. ఆమె కన్నులనుండి యారక నశ్రుధారలు ప్రవహించుచుండెను. ఆమె యేడ్చుచు నందఱను కౌఁగిలించుకొని వెక్కి వెక్కి యేడ్చుచుండెను. అందఱిహృదయములు బద్దలగుచున్నట్లుండెను. మహారాజు తొందఱ పెట్టుచుండెను. రాణి మాటిమాటికి నిట్లనుచుండెను. "అమ్మా! ప్రయాణమున నేడ్వరాదు. మనమందఱము మరల రాఁగలము." ఈ విధముగఁ దల్లి యోదార్చుచుండ నశ్రువుల రాల్చుచు దేవహూతి రథముపై గూర్చుండెను. తర్వాత మహారాణి కూర్చుండెను. ముందు మహారాజు కూర్చుండెను. సారథి రథమును నడిపెను. మేఘగర్జనము చేయుచు రథము వెళ్లిపోయెను. సర్వస్వమును గోల్పోయిన వారివలె స్త్రీలు, పురుషులు, దాసదాసీజనము లట్లే నిలిచిపోయిరి. నీరు క్రమ్మిన కండ్లతో దేవహూతి తన తోఁబుట్టువులను, దాసదాసీజనములను జూచుచుండెను. రథము రాజపథమునకు రాఁగానే ఆమెదృష్టి మఱలెను. ముందును, వెనుకను వేలకొలఁది గుఱ్ఱపురౌతులు వచ్చుచుండిరి. ఈ విధముగ ననేక దేశ, నద, నదీ, నగరములను దాఁటుచు రథము మిక్కిలి శీఘ్రముగఁ బరువెత్తు చుండెను. మధ్యలో నొక్క దినముండి

మహారాజుసేన నచ్చటనే వదలెను. ఆతఁడొంటరిగ రథముపై నెక్కి, కర్దమమహాముని ఆశ్రమమునకుఁ బోయెను.

చిన్నచిన్న పర్వతశ్రేణులచే నాప్రదేశము అత్యంత శోభాసంపన్నముగ నుండెను. వివిధ ఫలపుష్పములుగల వృక్షములను గాంచుచు మహారాజు సరస్వతీతట సమీపమునఁ గర్దమ మహాముని ఆశ్రమసమీపమునకుఁ జేరుకొనెను. ఆశ్రమమునకు దూరమున వృక్షఛాయలందు రథమును నిలిపి పదత్రాణములు లేకయే కాలినడకను ముని సమీపమునకుఁ బోయెను. ముందు మహారాజు వెళ్లుచుండెను. ఆతని వెనుక రాణి, అందఱకు వెనుక దేవహూతి అటునిటుఁ జూచుచు వెళ్లుచుండెను. అత్యంత సుందరమగు ఆశ్రమమును దర్శించి, ఆమె మిక్కిలి కుతూహలమును జెందుచుండెను.

మునికి క్షణక్షణము భారమగుచుండెను. ఆతఁడు క్షణ క్షణము లేచి చూచుచు నిట్లనుకొనుచుండెను:- "ఇంత వేళైనదే. ఎండ చాలయెక్కినది. కాని యింకను మనువు రానికారణ మేమియో? నేఁడే గురువారము. భగవానుఁడు నేఁడనియే కదా చెప్పివెళ్లినది. భగవానుని వాక్యములు మృష లెట్లు కాఁగలవు? వచ్చుచుండవచ్చును." ఇట్లనుకొనుచుండఁగనే రథధ్వని వినిపించెను. ముని హృదయమానందమునఁ బొంగిపోవుచుండెను. తన యానందమును నాపుకొనుచు మృషాజపమున నర్ధోన్మీలిత లోచనుఁడై యుండెను. దూరముననుండి పత్నీ పుత్రికలతో స్వాయంభువమనువు ఆశ్రమమువైపునకు వచ్చుటను గాంచెను. చూడఁగానే మిక్కిలి స్నేహసంభ్రమములతో కర్దమమహాముని లేచి గద్గదకంఠముతో నత్యంత మమత్వమును బ్రదర్శించుచు

దూరమున నుండియే యిట్లనెను:- "ఓహో! ధన్యవాదము, ధన్యవాదము. సుస్వాగతము, సుప్రభాతము. మనుమహారాజు అకస్మాత్తుగ దర్శనమిచ్చినారు యిది మహాభాగ్యము. నేఁడు లేచినవేళ మిక్కిలి శుభకరమైనది."

ఈ విధముగ ముని స్వాగతవచనములు పలుకుచుండఁగా మనుమహారాజు గబగబ పరువెత్తుకొనివచ్చి నేలమీఁదఁ బడి మునివరు చరణములకు సాష్టాంగనమస్కార మొనర్చెను. సప్త ద్వీపాధిపతియు, ఏకఛత్రాధిపతియు నగు మనుమహారాజు తన పాదములపైఁ బడుట గాంచి ముని యాతనిని జేతులతో బల పూర్వకముగ లేవనెత్తెను. ఆతనిపైఁగల ధూళిని దులిపి మిక్కిలి స్నేహముతో నొక తృణాసనమునఁ గూర్చుండఁ బెట్టుకొనెను. ఇంతలోనే పుత్రికను దీసికొని మహారాణి వచ్చెను. వారు ముని చరణములకుఁ బ్రణమిల్లిరి. తల్లి ప్రణమిల్లిన తర్వాత దేవ హూతి సిగ్గుచేఁ దన వస్త్రములను బాగుగా సవరించుకొని, ప్రేమభారభరిత హృదయము నణఁచుకొని, శిరస్సుచే నేలకంటి సాష్టాంగప్రణామము। కావించెను. నమస్కరించి లేవఁగానే ఆమె దృష్టియు, మునిదృష్టియుఁ గలిసికొనెను. నాలుగు కన్నులైనవి. ఇంతలోనే లజ్జాదేవివచ్చి మధ్య నిలుచుండెను. రాజకుమార్తె ఉప్పొంగి వాల్చెను. ఆమె లజ్జించుచుఁ దన తల్లిచాటునకు వెళ్లి దాఁగి కూర్చుండెను. నేఁడామె నేత్రము లేల ద్రోహులయ్యెనో తెలియకున్నది. అవి పైఁట చాటున సప్రయత్నముగనే అగ్ని వలె వెలుఁగుచుఁ దేజస్వియగు ముని శ్రీయంగములపైఁ దిరు గాడుచుండెను.

ముని దృష్టినుండి యీవలకు వచ్చి తల్లి చాటుననుండి, యింత తపస్సు చేసినను ముని శరీరము దుర్బలముగాక బలిష్ట ముగా నుండుటను గాంచెను. భగవద్దర్శనముచే నాతఁడు మరల హృష్ట పుష్టశరీరము కలవాఁడయ్యెను. శరీరము నునుపుగానుండి, ముడుతలు లేక కండ బలిసి యుండెను. దుగ్ధ ఫేనమువలె స్వచ్ఛముగను, కమలదళమువలె విశాలముగను, చంద్రునివలె సుందరముగను, దర్శనీయముగను నాతని విశాల నేత్రము లుండెను. సాక్షాచ్ఛివుఁడున్నట్లు శిరస్సున పండిన పసుపు పచ్చని జడలు ముకుటమువలె నుండెను. నడుమున కోక వల్కల వస్త్రము చుట్టఁబడియుండెను. శరీరమంతటను భస్మమలఁదఁబడి యుండెను. అట్లలఁదఁబడియున్నను సానపట్టని మహామణికాంతి అది మలినమైనను మెఱయునట్లు ఆతని శరీరము వెలుఁగు చుండెను. దేవహూతి తన సర్వస్వము నాతని పాదముల కర్పించెను.

కర్దమ మహాముని మొట్టమొదట గంధాక్షత, పుష్ప, కుశ, తృణ యుక్తమగు నర్ఘ్యజలములను మహారాజున కొసంగెను. అనంతరము జల, ఫల, కందమూలములచేతను అన్య సామగ్రులచేతను మహారాజునకు యథోచిత సత్కారములను గావించెను. మునిచేసిన శాస్త్రీయపూజలను మహారాజు శాస్త్రీయముగనే గ్రహించి తన కృతజ్ఞతను ప్రకటించెను. తదనంతరము మహారాజుయొక్క రాజ్యముయొక్కయు, కోశము యొక్కయు, సేనయొక్కయు, అమాత్య మంత్రులయొక్కయు, బరివారము యొక్కయుఁ గుశలము నడిగెను. తన కుశలమును జెప్పి మహారాజు ముని తపస్సుయొక్కయు, అగ్నిహోత్రము

రొయొక్కయు, అగ్నియొక్కయు, వృక్షముల యొక్కయు కుశలము నడిగెను. పరస్పర కుశల ప్రశ్నానంతరము కర్దమమహాముని శిష్టాచారమును ప్రదర్శించుచు మహారాజుయొక్క ఆగమన కారణ మడిగెను.



## కర్దమమునితో వివాహ ప్రస్తావము

పరస్పర స్వార్థముచే వ్యవహారములు నడుచును. మన మొక వస్తువును గొనవలసి యుండును; మఱియొక వస్తువు నమ్మవలసి యుండును; అప్పుడు సంబంధము స్థాపితము కాఁ గలదు. క్రయ, విక్రయ, ఆదాన, ప్రదానములు కేవలము స్వార్థముచే జరుగవు. ఇద్దరకును సమానముగు స్వార్థమున్నప్పటికి నెవఁడైన దన స్వార్థముకొఱకు యితరుల సమీపమునకుఁ బోయిన నాతనిది పై చేయిగ నుండును. మనకు పెరుగు కావలయును. పెరుగునమ్మువాఁడు పెరుగు నమ్మకొనవలయును. ఇంతకు మనము డబ్బు, గిన్నె తీసికొని వానికడకుపోయితిమా వాఁ డిట్లనును:– "నీవీ ధరకు తీసికొనఁదలఁచిన తీసికొనుము, లేదా వచ్చిన త్రోవను బట్టుము." మన మా ప్రకారము తీసికొని తీరవలయును. వాఁడు రెండుమాటలనినను మన యవసరమును బట్టి తీసికొందుము. కాని పెరుగునమ్మకొనువాఁడు స్వయముగ 'పెరుగమ్మా, పెరుగు!' అని అఱచుచు నమ్మకొనవచ్చిన మన కవసరమున్నను బెట్టుగా నుందుము. పెరుగు బాగుండలేదనియు, నిట్టిది మా కవసరము లేదనియు, నీ వీయఁదలచిన వే

మడిగిన ధర కీయవలయుననియు కోరుకొనుచుందుము. కొంచె మక్కడక్కడ వంగుటచే పనులగుచో బాగుండును. లేకున్న విషయ మాగిపోవును.

కర్దమమహాముని కి వివాహము చేసికొనవలయునను బ్రబలేచ్ఛ కలదు. ఈ భావనచేతనే యింతటి తపస్సు చేసెను. భగవదారాధన చేయఁగా నాతఁడు ప్రసన్నుఁడయ్యెను. అంత వరదానములో 'గృహమేధ ధేనువును' యాచించెను. ఇటు మనువుకూడ తన పుత్రికకు వివాహముచేయ వ్యాకుల పడు చుండెను. ఎవఁడైన ముని కన్యనడుగుటకు తన యింటికివచ్చిన నేదో నెపము చెప్పవచ్చును. కాని నేఁడాతఁడు తన పుత్రికను దీసికొని స్వయముగ నామెను దానము చేయుటకు ఆశ్రమము నకు వచ్చెను. అందువలనఁ గర్దమమహాముని చేయి పైననుం డెను. మైత్రేయమహాముని యిట్లనెను:- విదురా! కర్దమమహా మునికి అన్నియును దెలియును. భగవానుఁడన్నియు నాతనికి చెప్పియుండెను. మహారాజు తన కాతని కుమార్తె నిచ్చుటకు వచ్చెనని తెలియును. అట్టియెడ శిష్టాచారవిరుద్ధముగ నాతఁడే ముందుగ నేల ప్రస్తావింపఁగలఁడు? అందువలన నాతఁ డెఱుగని వానివలె మనుమహారాజుతో నిట్లనెను:- "మహారాజా! మీరు అకించనులగు మాబోటివారి ఆశ్రమమునకు వచ్చి అనుగ్రహిం చితిరి. మీరు సప్తద్వీపవతియగు వసుంధరకుఁ జక్రవర్తులరు. మీరు సాక్షాత్తుగ విష్ణుస్వరూపులరు. ఏలననఁగా భగవంతుని యొక్క పాలనశక్తి అంశమున మీ యవతారము కలుగును. మీ శరీరమందు సూర్య, చంద్రాగ్ని, ఇంద్ర, వరుణ, కుబేర, యమ, ధర్మ, వాయువు మొదలగువారి శక్తి యుండును. మీ

దర్శనము భగవద్దర్శనము వంటిదే. మీరు నా యెడలఁగల స్నేహావశమున నే దయచేసితిరి. ఇంక మీరు వచ్చుటకు మఱి యొక కారణమింకేదైన నున్న యెడల మీరు నాకు చెప్పఁడు."

వీరితో నెట్లు చెప్పుదునా యని మనుమహారాజు సంకోచించుచుండెను. ఇంతలో మునియే అందుకొని యిట్లనెను :– "మీరు వచ్చిన విషయము ప్రత్యక్షమే. మీరీ విధముగ ధనుస్సును ధరించి భూమిపైఁ బర్యటింపకుండిన వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థ యెట్లుండఁగలదు? శిష్టపాలనము దుష్టదమనము మీకు ప్రధానమగుఁ గర్తవ్యము. మీరు మీ ప్రచండ కోదండ టంకారము చేయుచు నిటునటు భ్రమింపకుండిన దస్యులు ధర్మ ప్రజలకు బాధకలిగింపఁగలరు. వారిధనములను దోఁచుకొనఁగలరు. మీరు సదా సర్వథా సావధానచిత్తులరై ప్రజలకష్టసుఖములను విచారించుచు దుర్మార్గులను సంహరించుచుండినచో ప్రజలు సుఖులుగ నుందురు. అప్పు డధర్మమునకు హ్రాసము, ధర్మవృద్ధియు కలుగఁగలదు. మీరు ప్రజకు పూజనీయులు, నమా నీయులు, వందనీయులు. ప్రజల దుఃఖములను జూచుచు మీరు నాఆశ్రమమునకుఁగూడ వచ్చితిరి. ఇది చాల సంతోషకరమగువిషయము. దేవదుర్లభ దర్శనముచే మీరు నన్నుఁగూడ కృతార్థునిఁ గావించితిరి. నేను మీకు చేయఁదగిన స్వాగతసత్కారములను జేయఁజాలకపోతిని."

మైత్రేయ మహాముని యిట్లనెను :– విదురా! ముని యీవిధముగ నెఱుఁగనివానివలె మధురవాక్యములతో మహారాజుతోఁ బలుకఁగా, రాజు పరమప్రసన్నుఁడై, కృతజ్ఞతను బ్రకటించుచు నిట్లనెను :– "స్వామీ! ఇట్టి ప్రేమపూర్ణమగు

సారగర్భిత వచనములు మీకనురూపముగనే యున్నవి. మేము, మీరు బ్రహ్మనుండియే పుట్టినప్పటికిని మీరు ముఖమునుండియు మేము బాహువులనుండియుఁ బుట్టితిమి. మీరు ముఖమునుండి పుట్టుటచే ముఖ్యులు, శ్రేష్ఠులై తిరి. మీరు విషయములం దనాసక్తులై తపో, విద్యా, యోగ సంపన్నులై మోక్షధర్మము నవలంబించు బ్రాహ్మణు లనఁబడుచుండిరి. మీయొక్క తపస్స్వాధ్యాయములు నిర్విఘ్నములగునట్లును, మీకెవరును క్లేశములు కలుగజేయకుండఁగను మీకు సేవచేయుటకై క్షత్రియులమగు మమ్ము బ్రహ్మ సృజించెను. కావునఁ బ్రజాపాలనము చేయుట మాధర్మము. మీ చరణసన్నిధిని జేరి శిక్షను బొందుట మాకు ప్రధానమగుఁ గార్యము. మీరు మిక్కిలి కౌశలముగా నన్నుఁ బ్రశంసించు నెపమున రాజధర్మము నుపదేశించితిరి. రాజేమి చేయవలయునో, యెట్లు వర్తింపవలయునో నేర్పితిరి. ఇఁకఁ బ్రజారక్షణ మే మేమి చేయఁగలము? రక్షించువాఁడును, రక్షింపఁజేయువాఁడు నా శ్రీహరియే. ”

ముని యిట్లనెను :- “ రాజా ! మీరా భగవంతుని యొక్క శ్రేష్ఠవిభూతి. మీ దర్శనమువలనఁ బరమ పుణ్యము లభింపఁగలదు. ”

మనుమహారా జిట్లనెను :- “ మహారాజా ! మేము మీ సేవకులము, ద్వారపాలురము. మేము కృతకృత్యుల మగుటకు మీ చరణసన్నిధికి వచ్చుచుందుము. మీదర్శన మందఱకును లభింపదు. పూర్వజన్మపుణ్యఫల ముదయించినపుడు మీ వంటివారి దర్శనము లభింపఁగలదు. నేఁడు నా సౌభాగ్యము వలన మీదర్శనము లభించినది. నేనిప్పుడు ప్రజాపాలనకార్యము

కొఱకు మీ చరణసన్నిధికి రాలేదు. ఇప్పుడొక విశేషప్రయోజనము కొఱకు మీ చరణసన్నిధికి వచ్చితిని. కాని దానినిఁ జెప్పుటకు సంకోచించుచున్నాను."

మిక్కిలి స్నేహముతో ముని యిట్లనెను:- "రాజా! సంకోచించు టెందులకు? మీవంటివారుకూడ సంకోచించుటయా? మీరు నిస్సంకోచముగ నావలన నగుఁ గార్యమున కాజ్ఞాపింపుఁడు. మీకార్యమును నెఱవేర్చు భాగ్యము నాకు పట్టిన నది నాకు సౌభాగ్యము కాఁగలదు."

మను విట్లనెను:- "ప్రభూ! ఈమె దేవహూతి యను పేరుగల పరమ సుశీలయగు కన్యక. ఇప్పుడీమె వివాహయోగ్యయైనది. స్వామీ! తన పుత్రికకు తగిన వరుఁడు లభింపవలయునను కోరిక తండ్రికి యుండితీరును. ఈడువచ్చిన పుత్రికకు వివాహము చేయుటకంటె నింకొక సచ్చింత యుండనే యుండఁజాలదు. ఈ చింతచే నాచిత్తమత్యంత దీనమైనది. నాకు నిద్రాజాగరములం దీచింతయే బాధించుచుండును. దీనికనురూపమగు పతి దొఱకెనా నేనొక మహాచింతనుండి బయటపడినవాఁడ నగుదును."

ముని కొంచెము నిస్పృహను బ్రదర్శించుచు నిట్లనెను:- "రాజా! మీరు సత్యమునే చెప్పుచున్నారు. పుత్రిక తల్లిదండ్రుల కాత్మయే. తల్లిదండ్రు లామె సుఖిగా నుండవలయునని కోరుకొనుచుందురు. నీకు పిల్లలెందఱు?"

ముని సర్వవిషయములను దెలిసికొనఁగోరుచున్నాఁడని తెలిసికొనఁగానే మనుమహారాజునకుఁ గొంచె మాశ జనించెను.

శాస్త్రకారులు సోదరులులేని కన్యను ప్రశంసింపలేదు. ఇట్టికన్యను వివాహమాడిన బావయని పిలుచుటకు వీలుండదు. ఈ విషయములోఁ జెప్పఁదగినవి చెప్పఁదగనివి చెప్పఁబడుచుండును. ఈమెకు సోదరులు లేరని ముని యనుకొనలేదు. అందువలననే మనువిట్లనెను:– "మీ దయవలన నాకు ఇద్దరుపుత్రులు, ముగ్గురు పుత్రికలున్నారు. ప్రియవ్రతుఁడు, ఉత్తానపాదుఁ డను నిద్దరు కొడుకులును, ఆకూతి, దేవహూతి, ప్రసూతి యను ముగ్గురు పుత్రికలున్నారు. ఈమె పేరు దేవహూతి. ఈమె నిరంతరము భగవద్ధ్యానములో నుండును. క్రోధమనునది ఈమె యెఱుఁగదు. ఇంటిలో నందఱి సేవ చేయుచుండును." ముని క్రీగంట దేవహూతినిఁ గాంచెను. ఆమె తదేకదృష్టితో లావణ్యాయుక్తమగు ముని ముఖమండలమును ముసుఁగుచాటునుండి చూచుచుండెను. నాలుగుకన్నులై దృష్టులు కలియఁగానే రాజపుత్రి కన్నులు క్రిందకు వ్రాలెను. ఆమె భూమివైపు చూచుచుండెను. సంబాళించుకొని ముని యిట్లనెను:– "మహారాజా! మీరు మిక్కిలి యదృష్టవంతులు. ఏలనఁగా మీకు యోగ్యమగు సంతానము కలదు. మీరీపిల్లకు యోగ్యమగు వరుని వెదకినారనుకొందును."

ఈ ప్రశ్నను వినఁగానే దేవహూతి ముఖమునఁ జింత వ్యక్తమగుచుండెను. ముని మిక్కిలి నిస్పృహతో మాటలాడుచున్నాఁడు. ఈతని మాటలలో వివాహము చేసికొనవలయునను కోరిక కనఁబడుటలేదు. తండ్రి తన పుత్రికాభావమును గ్రహించి యత్యంత వినయముతో నిట్లనెను:– "స్వామీ! ఇంతవఱకీమెకు యోగ్యుఁడగు వరుఁడు లభింపలేదు. నారదునివలన మీయొక్క రూప, శీల, స్వభావ, సౌందర్యాది గుణములను గూర్చి విని

నప్పటినుండి మీ చరణకింకరి కావలయునని కోరుచున్నది. స్వామీ! నేనిట్లు నివేదించుటకు వెఱచుచున్నాను. కాని యీపిల్ల చాల పట్టుబట్టుచున్నది. అందువలననే నేను మీకడకు వచ్చితిని." తన తండ్రి యిట్లు పలుకుటను గాంచి దేవహూతి లజ్జచే మిక్కిలి సిగ్గుపడుచు నేలవైపు చూచుచుండెను. ఆమె హృదయములో విచిత్ర కుతూహలము కల్గుచుండెను.

ముని యాతని భావమును గ్రహించి మిక్కిలి ధైర్యముతోఁ దనలోఁదాను సంబాళించుకొని యిట్లనెను:- "మహారాజా! మీ రెట్టిపలుకులు పలుకుచున్నారు? వనవాసులమగు మా యునికెక్కడ? రాజోచిత భోగములనుభవించు మీ ప్రియపుత్రిక యెచ్చట? మీ పుత్రికను సంతోషపెట్టఁగల సామర్థ్యము నాకేది?"

మనుమహారాజిట్లనెను:- "స్వామీ! మీ రీవిషయములో జింతింపనవసరము లేదు. రాజమహాలులోనుండియు నామె సదా విషయభోగములందు విముఖురాలై యుండును. మీరు కృపతో మా పిల్లను స్వీకరించునెడల మీకు సేవచేయుచు మీ యాశ్రమమును స్వయముగ నిర్వహింపఁగలదు. గృహస్థోచిత బంధముల నుండి మీరు విడివడి యుండఁగలరు."

సాహిత్యములో "స్థూణా ఖనన న్యాయ"మను నొక న్యాయము కలదు. ఒక మేకును గొట్టి, తర్వాత దానిని గదలించెదరు. మరలఁ గొట్టెదరు. కదలించుట దానిని బీకివేయుటకుఁ గాదు, దానినింకను దృఢముగఁ గొట్టుటకు. ఆలాగుననే మాటిమాటికి ముని నిస్పృహను బ్రకటించుట వివాహ మక్కఱ

లేక కాదు, దానిని దృఢ మొనర్చుటకే. కావున ముని యిట్లనెను:- "రాజా! మీపుత్రిక సుశీల, ధర్మపరాయణ, సేవానిరత యనునది నిజమేకాని మేము తపస్వులము. తపస్సునకు భార్యకు మిక్కిలి విరోధము కలదు."

దేవహూతి ముఖము తెల్లబారెను. 'ముని స్పష్టముగ చెప్పుచున్నాఁడు. నేను నిరాశతో వెళ్లవలసినదేనా? తిరిగి పోయితినా నా చెలికత్తె లేమందురు? నారదు వచనములుకూడ అన్యథా కాఁగలవా? చేతిలోని రేఖలుకూడ పోవునా? కాని, ముని నిర్మొగమాటముగఁ జెప్పుచున్నాఁడు.' ఈ భావము రాఁగానే యామె యంగములన్నియు శిథిలములయ్యెను. ఆమె పడిపోయెడిదే కాని తల్లియాధారమున నిలువఁగలిగెను. శరీర మంతటు చెమటపోసెను.

మనుమహారాజు గంభీరముగ రాజకీయస్వరమునఁ బలుక నారంభించెను:- "మునివరా! నేను శ్రద్ధతో నీ పిల్లను దీసికొని మీ సమీపమునకు వచ్చితిని. నాకు నారదుఁడు చెప్పకుండిన నిట్టి సాహసము చేసెడువాఁడను గాదు. మీరు నైష్ఠిక బ్రహ్మచర్యదీక్షను గ్రహింప లేదని నేను వింటిని. మీ రుపకుర్వాణ బ్రహ్మచారులు. మీ రిచ్చు బ్రహ్మచర్యవ్రతస్నానము కావించి గృహస్థాశ్రమమును స్వీకరించుటలోఁగలదు. ఇదియే నిజమైనచో మీరు నా మాటను వినితీరవలయును."

ఆతఁడెంతటి త్యాగియైనను శ్రద్ధాపూర్వకముగఁ దన కుపయోగించు వస్తువును దెచ్చియిచ్చునెడల త్యాగగర్వమున దానిని విసర్జింపరాదు. వారి సంతోషముకొఱకు దానిని గ్రహింపవలయును. తన కవసరము లేకున్నను దానిని గైకొని

వారు వెళ్లినతర్వాత నితరుల కీయవలయును లేదా గ్రహించిన తర్వాతఁ దనదగును గావున మరలఁ బ్రసాదరూపమున వారికే యీయవలయును. ఇది పరమత్యాగుల విషయము. కాని కోరిక లుండి, యిచ్ఛ యుండి, యిచ్ఛితవస్తువు నెవఁడైన నిచ్చు నెడల దానినిఁ బ్రసన్నతతో గ్రహింపవలయును. అట్లుగాక త్యాగ వైరాగ్యములను బ్రదర్శించుటకు ప్రేమతో సమర్పింపఁబడిన వస్తువులను దిరస్కరించి, యావల పారవేసిన, నిచ్చినవారి మనస్సు చాల బాధపడఁగలదు. వారి శాపము తగిలితీరును. వాని కోరిక యింకను బ్రబలమగును. ఆతఁడా వస్తువు కొఱకై యితరులను యాచింపవలసివచ్చును. అడిగినవారు కృపణులై యివ్వరు. తిరస్కరించెదరు. ఆతని నిందింతురు. ఇట్లు జరుగుటచేఁ దన యశము నాశము కాఁగలదు. కీర్తి మలినమగును. కావునఁ బ్రేమపూర్వకముగ నొసంగఁబడిన కోరినవస్తువు నెన్నఁడు నవహేలనము చేయరాదు. తెచ్చినవారినిఁ దిరస్కరింపరాదు. ఇదియే శాస్త్రీయనీతి. కుమారియగు కన్యకకు వేలకొలఁది పతులు కలరు. ఒకరు కుదురకపోయిన నింకొకరు కుదురుదురు. వివాహమైనతర్వాత శాశ్వతసంబంధ మేర్పడఁగలదు.

"కేవలము నారదభగవానుని యాజ్ఞచేతనే నేను మీతో నిట్టి ప్రస్తావము కావింప సాహసించితిని. మీ కిష్టము లేకున్న నే బాధయును లేదు. నే నింకొక-చోట వెదకికొందును."

తన తండ్రి యిట్లు స్పష్టముగ మాట్లాడుటను గాంచి దేవహూతి భయపడెను. తండ్రిగారిచ్చుటకూడ తన తేజస్వితను జూపించెను. ఒకవేళ ముని చేసికొనఁదలఁచినను నీమాట వినినఁ జేసికొనఁడు. ఆమె లోలోన భయభీత యగుచుండెను.

ఇచ్చుటఁ గర్దమమహాముని యిట్లాలోచించెను:- ఇప్పు డీక బెట్టు తగ్గిపోవుచున్నదని గ్రహించి మిక్కిలి స్నేహభావముతో నిట్లనెను:- "లేదు లేదు, రాజా! నా అభిప్రాయ మది కాదు. నారదుఁడు మీకు చెప్పినదంతయును సత్యమే. అవును నేను వివాహమాడఁదలఁచినాను. నేనుపకుర్వాణబ్రహ్మచారినే; కాని నేనింతవఱకు మాట్లాడినది మీ కుమార్తె కేమైనఁ గష్టము కలుగుననియే. లేకున్న సప్తద్వీపవసుంధరకు నేకైక శాసకుఁడగు స్వాయంభువమనువుయొక్క కుమార్తెయు, ప్రియవ్రతోత్తానపాదుల సహోదరియు, రూప గుణ సౌందర్యములో నద్వితీయయు నగు దేవహూతితో వివాహమాడుట నా సౌభాగ్యము కాక మఱియేమి? కాని మహారాజా! ఒక్క విషయమును మీ రాలోచింపుఁడు."

ఆనందమును బ్రకటించుచు మనుమహారా జిట్లనెను:- "దాని కేమి? దానినిగూడ చెప్పుడు."

ముని కొంచెము దృఢస్వరముతో నిట్లనెను:- "మహారాజ! నేను వివాహమాడెదను కాని, యీమెతో సంతానము కలుగనంతవఱకు కలిసియుండెదను. సంతానము కలిగిన పిదప నేను సర్వసంగవినిర్ముక్తుఁడనై శమదమాది హింసారహిత ధర్మాచరణము కావించుచు న్యస్తదండుఁడనై సన్న్యాసధర్మమును బాలించెదను. నేను మరల ననన్యభావముతో నా సర్వేశ్వరుఁడగు ననంతభగవానుని యుపాసనములో లీనమయ్యెదను."

ఈ విధముగా ముని పలుకఁగా మనుమహారాజు విని మిక్కిలి హర్షించెను. మహారాణియగు శతరూపకు మిక్కిలి యానందము కలిగెను. ఇంతవఱకు దేవహూతి ముఖము వాడి

యుండెను. తన తండ్రికి, మునికి జరిగిన సంభాషణమున లేచిన సుడిగాలి ఆమె హృదయమున నిప్పుడు కొంచెము శాంతించెను. ముఖము శరత్కాలచంద్రునివలెఁ బ్రకాశించెను. చకోరము తదేకదృష్టితోఁ జంద్రునిఁ జూచినట్లు దేవహూతి మునిచంద్రుని ముఖచంద్రమును జూచుచుండెను.

ముని వివాహమున కంగీకరించుటచే మహారాజున కానందమయ్యెను. నాభార్యకు ఈ సంబంధమున సంతుష్టికలదు. పుత్రికకును బూర్తిసమ్మతి కలదు. అందువలన నాతని హర్ష మున కంతు లేకుండెను. ఆతఁడిప్పుడు వైదికవిధిచే వివాహము చేయఁ బ్రయత్నము చేయుచుండెను.

మైత్రేయుఁ డిట్లనెను:— "విదురా! ఇప్పుడు వనములో మంగళము జరుగుచుండెను. అద్వైతమునుండి ద్వైతసృష్టి ప్రారంభమయ్యెను. ఒక్కఁడు పలువిధముల కావలెనను సంక ల్పము ప్రయత్నము జరుగుచుండెను."



# కర్దమమునితో దేవహూతి వివాహము

ఇంకను వివాహావశ్యకత లేని పిల్లను కన్యయనఁబడునని శాస్త్రకారులు వచించిరి. ఇట్టికన్యను శాస్త్రీయవిధిచే దానము చేయుటకే కన్యాదాన మందురు. ఏ కుమారి బాల్యావస్థను దాఁటి యౌవనావస్థలోఁ బ్రవేశించినదో, యెవ్వతెకు వివాహ మవసరమగుచున్నచో దానిని ఋషులు వివాహమనిరి. వివాహ ములోఁగూడ బ్రహ్మవివాహము, గాంధర్వవివాహము, రాక్షస వివాహము, పైశాచవివాహ మని చాల భేదములు కలవు. తల్లిదండ్రు లెవనికి కన్యను దానముచేయుదురో ఆ వివాహ ములోఁ గన్య అంగీకార మక్కఱలేదు. గోవును, కన్యను నెవరి కంటఁగట్టిన వారితో వెళ్ళిపోవునను సామెత కలదు. వివాహము విషయములో తల్లిదండ్రుల అభిప్రాయమే ప్రధానము. ఏల ననఁగా బాలబాలికలా వయస్సులో నిట్టి గంభీరవిషయమును నిర్ణయింపఁజాలని స్థితిలో నుందురు. వారు క్షణికప్రలోభము లలోఁ బడిపోఁగలరు. తల్లిదండ్రులపై నకారణముగ నవిశ్వాస మును బ్రకటించుట అధర్మము. వారు చేసెడు మేలింకెవరును జేయఁజాలరు. మన కల్యాణము, సుఖము వీటియొక్క చింత ముఖ్యముగ నెక్కువగ వారికే యుండును. వారేమి చేసినను మన హితముకొఱకే చేయుదురు. యువావస్థవచ్చిన పిల్ల విష యములోఁ దల్లిదండ్రులు పిల్లయొక్క ఆకారప్రకార చేష్టలను బట్టి వివాహమునకుఁ బూర్వము సమ్మతి తీసికొనవలయును. ఆమె అసంతుష్టినిఁజెందిన భవిష్యజ్జీవనములో నామెకు దుఃఖమే కలుగును గావున నామె కసంతుష్టి కలుగరాదు.

దేవహూతి వివాహయోగ్య. ఆమె కుచ్ఛనీచములు తెలియును. మనువు కర్దమునితో మాటలాడుచునే తనకుమార్తె ముఖమును జూచుచు నామె మనోగతభావములను గనిపెట్టు చునే యుండెను. నారదుని నోట ముని రూప, శీల, వయో గుణాదులను వినినప్పటినుండి తన కుమార్తె మనస్సు ముని వైపున కాకర్షింపఁబడినదని తెలిసికొనినప్పటికిని, ముని యంగీక రించి నవ్వినప్పుడా మందహాసముఖమును గాంచి దేవహూతి యానందమును జెందినదని తెలిసికొని మిక్కిలి సంతసించెను. ఆతనికి కన్యావిషయకమగు చింత దూరమయ్యెను. తనభార్యయు నంగీకరించుటను దెలిసికొని, యిఁక వివాహసామగ్రినిఁ బ్రోవు చేసికొన మొదలిడెను.

మైత్రేయమహాముని యిట్లనెను:- "విదురా! అది కృత యుగారంభ సమయము. మను శతరూపలకు వివాహమైనది కాని యందు బ్రహ్మయొక్క ఆజ్ఞయే ప్రధానముగ నుండెను. అంతవఱకు వైదికవిధిగా వివాహమునకుఁ బ్రచారప్రసారములు జరుగలేదు. వేదమంత్రములతో నగ్నిసాక్షిగా వర్ణాశ్రమ ధర్మ మర్యాదానుసారము జరిగిన మొదటివివాహ మిదియే. శాస్త్ర ములలోఁ జెప్పఁబడిన వివాహవిధి ననుసరించి మంత్రముల ద్వారా కర్దమ దేవహూతులకు వివాహము జరిగినది.

ఈ వివాహముచేఁ బ్రపంచములో సర్వత్ర ఆనందము నిండినది. దేవతలు సంతోషముతో దుందుభులను మ్రోగించి వధూవరులపైఁ గల్పవృక్ష దివ్యపుష్పములను వర్షింపఁజేసెను. అప్సరసలు నృత్యముచేసిరి. గంధర్వు లనేక స్వరమూర్ఛనము లతో గానమొనర్చిరి. ఋషులు సామవేదమంత్రములను బఠిం

చిరి. మను శతరూపలు వధూవరులను గాఁగిలించుకొని ప్రేమిం
చిరి. వారికి వివిధాశీర్వాదముల నొసంగిరి.

శతరూప వివిధములగు పట్టువస్త్రములను, నూలుగుడ్డ
లను, వివిధములగు మణిమాణిక్య రత్న జటిత సువర్ణాభరణము
లను, నింకను గృహస్థాశ్రమోచిత వస్తువులను వెంటఁ గొని
వచ్చినది. వానినన్నిటిని మిక్కిలి హర్షముతో నా కన్యక కొసం
గెను. ఈ విధముగ నిద్దరకును వివాహమయ్యెను. మహారాజు
చింతావిముక్తుఁ డయ్యెను. ఆతని శిరస్సున భారమేదో దింపి
నట్లయ్యెను.

ఇప్పుడు సంబంధము మారినది. కూఁతురుయింట రాణి,
రాజు నీ రెట్లు త్రాగఁగలరు ? అందువలన వారు రాజధానికి
వెళ్ల సిద్ధపడిరి. ఇంతవఱ కందఱకు వివాహోత్సవము కలదు.
భవిష్యత్కార్యము విషయమున నుత్సాహము కలదు. కార్య
సమాప్తి కాఁగానే ఉత్సాహసమాప్తియు నయ్యెను. ఇప్పుడు
కుతూహలస్థానమునఁ గర్తవ్యము కలదు. నేఁడు వారి పుత్రికతో
వియోగముకలుగుచున్నది. ఈ విషయమును తలఁచుకొనఁగానే
మహారాజు హృదయము దుఃఖమయమగుచుండెను. ఇంతవఱకు
మమత్వముతో, గారాబముగఁ బెరిగిన బిడ్డ నేఁటికి పరదేశిని
యైనది. అన్యపరివారము, అన్యగోత్రవతి యైనది. ఇది తలఁచు
కొనఁగానే మహారాజునకు గుండె పగులుచుండెను. ఇంతవఱకు
తల్లిదండ్రులను వదలని పుత్రిక నేఁడు వనవాసిని యగుచున్నది.
తండ్రి తన్నచ్చటనే వదలి వెళ్లునని తెలియఁగానే ఆమె కన్ను
లంధకారమయములయ్యెను. మహారాజు వధూవరుల నాశీర్వ
దించి వెళ్లఁబోఁగాఁ గన్యకయొక్క కోమలహృదయము బ్రద్ద

లయ్యెను. ధైర్యము సడలినది. ఆమె తండ్రిని గౌఁగిలించుకొని పెద్దగ నేడ్చెను. మహారాజింతవఱకు నేడ్పాపుకొనుచుండెను. కాని యిప్పు డాపుకొనలేకపోయెను. శ్రావణ భాద్రపద వర్షము వలె నాతనికన్నుల నీరు దేవహూతి వస్త్రములను, వేణిని, అతి సుందరమగు నలకావళిని దడిపివేసెను. తండ్రి మాటిమాటి కామె శిరస్సునఁ జేతితో నిమురుచుండెను. గద్గదకంఠముతో నేడ్పుస్వరముతో నాగియాగి యిట్లనెను:- "బిడ్డా! ఏడువకుము. ఈ మునియే నీ కిప్పుడు సర్వస్వమును. మేము నిన్నుఁ ద్వరలోఁ బిలిపించుకొందుము." ఆయన దేవహూతి నేడువవలదని చెప్పుచుఁ దా నేడ్చుచుండెను. పుత్రీస్నేహముకూడ యెంత విలక్షణముగ నుండును. ఇచ్చట దేవహూతి తండ్రిని వదలుట లేదు. రాణి వచ్చి యామె శిరస్సున నిమురుచుండెను. మాటి మాటికి ముద్దిడుకొనుచు నిట్లనెను:- "అమ్మా! ఇట్లు వ్యాకు లము చెందరాదు. ఆడపిల్ల లింట నుండరు. ఏదినముననో తమ యింటికి వెళ్లెదరు."

ఇప్పుడు దేవహూతి తండ్రిని వదలి ప్రేమమయియగు జననిని గౌఁగిలించుకొని యామె పైఁటచెఱఁగును దన ముఖము నకుఁ గప్పుకొని వెక్కి-వెక్కి యేడ్వసాగెను:- "అమ్మా! ఇచ్చట అరణ్యమందు నన్నొంటిగా విడిచి వెళ్లెదవా? నాతల్లీ!" తల్లి హృదయము కఱుగుచుండెను. తల్లికూఁతుం డ్రిట్లు విలపించు టను గాంచి మునికిఁగూడ కంట నీరు వచ్చెను. ఆతఁ డిట్లు తలఁచెను:- "గృహస్థాశ్రమమున నెట్టి కరుణాప్రసంగము కలదు! ఆతఁడును దలవంచుకొని మెదలకుండెను. ఆతనికిని కంట నీరు వెడలుచుండెను. అత్తమామలను బంపుటకు ముని భార్యతోఁ

గూడి ఆశ్రమద్వారమువఱకు వచ్చెను. రాజు, రాణి రథముపైఁ గూర్చుండఁగానే దేవహూతి ధైర్యము క్రుంగిపోయెను. ఆమె రథమును గట్టిగాఁ బట్టుకొనెను. రాణియు నేడ్చుచుండెను. మహారాజు దిగి తన పుత్రికను మరల నాలింగనము చేసికొని యిట్లనెను:- 'వత్సా! చింతింపకుము. మేము వచ్చిపోవుచుందుము.' ఈ విధముగ నోదార్చి మహారాజు రథమెక్కి తోల నాజ్ఞాపించెను. రథము ధణధణ శబ్దము చేయుచుఁ బోయెను. దాని విశాలధ్వజము వాయువేగముచే మాతాపితృవియోగముచే దేవహూతిచిత్తము చంచలమైనట్లు చంచలించుచుండెను.

భార్యాభర్త లిరువురు వాయువేగముతోఁ బోవు రథమును జూచుచుండిరి. కొంచెముసేపటిలోనే రథము కన్నులకగపడకుండ పోయెను. కేవల మెగురుచుండిన ధ్వజము కనఁబడుచుండెను. చివరకు ధ్వజముకూడ మాయమై కేవలము ధూళి కనఁబడుచుండెను. కొంచెముసేపటి కదికూడ మాయమయ్యెను. ఖిన్నమనస్సుతో నిద్దరును దమయాశ్రమములోనికిఁ దిరిగివచ్చిరి.

స్వాయంభువమనువు తన పత్నితో సరస్వతీతీరముననే మునుల పవిత్రాశ్రమములను దర్శించుచు వెళ్లుచుండెను. ఆ యాశ్రమములలో నగ్నిహోత్రధూమము వెలువడుచుండెను. వల్కలవస్త్రము లారవేయఁబడియుండెను. కోయఁబడిన సమిధలుండెను. ఫలపుష్పసమన్వితమై యా యాశ్రమములు మిక్కిలి శోభిల్లుచుండెను.

ఈ విధముగఁ బుణ్యవనములను, నుపవనములను గాంచుచు గంగాతీరమునఁగల తమ రాజధానియగు బర్హిష్మతీనగర

సమీపమునకుఁ జేరుకొనిరి. బ్రహ్మావర్త (విఠూర్) ప్రజలు తమ రాజు వచ్చుచున్నారను వార్తను వినఁగానే స్వాగత సత్కారము లొనర్చుటకు వ్యగ్రులై పరువిడిరి. మహారాజును సత్కరించుటకు నగరము విచిత్రముగ నలంకరింపఁబడెను. ప్రజ లందఱును వారికి హృదయపూర్వకముగ స్వాగతమొసంగిరి. వారు రాజభవనమునకుఁబోయి పూర్వరీతిని రాజకార్యము లొనర్చుచుండెను.

అంత శౌనకుఁ డిట్లనెను:- "సూతా! మనుమహారాజు నగరమునకు బర్హిష్మతి యను పేరేల వచ్చినది? పృథివియందీ భూమియే సర్వశ్రేష్ఠమును, బరమ పవిత్రమును బ్రహ్మర్షులకు సేవనయోగ్యముగ నేలయయ్యెను? దీని కారణమును నీవు మాకు చెప్పవలయును."

ఇది విని సూతుఁ డిట్లనెను:- "మునులారా! భగవంతుఁడు పృథివిని బాతాళమునుండి తెచ్చినపు డీ దేశమందే యాతఁడు ప్రకటమయ్యెను. అందువలన నీ ప్రాంతమునకు సూకరక్షేత్రమను (సోరోఁ, ఏటా) పేరు కలిగినది. బ్రహ్మావర్త (విఠూర్) మందు వరాహమూర్తి శరీరమును విదల్చెను. ఆ విదల్పునకుఁ జాల రోమములు రాలెను. ఆ రోమములే కుశకాశ రూపముగఁ బచ్చపచ్చగఁ బెరిగెను. యజ్ఞవరాహమూర్తి యొక్క రోమములవలనఁ బుట్టుటచేఁ గుశలు మిక్కిలి పవిత్రములుగ నెన్నఁబడుచున్నవి. అవి శ్రాద్ధ, యజ్ఞ, పితృ, దేవతా, ఋషి కర్మలలోఁ బ్రయోగింపఁబడుచున్నవి. మనువీ స్థానమునఁ గుశగాశలతో బర్హిస్సును బరచి పూజగావించెను. అందువలన దీనికి బర్హిష్మతియను పేరు వచ్చెను. ఇప్పటికి నా దేశములోఁ

గుళతెక్కువగఁ బెరుగును. అందువలన నీ భూమి బ్రహ్మర్షులచే సేవింపఁబడుచుఁ బరమ పవిత్రముగను, యజ్ఞయాగాదులకుఁ బరమయోగ్యమగు స్థానముగ నెన్నఁబడుచున్నది."

శౌనకుఁ డిట్లు ప్రశ్నించెను:– "సూతా! మనువు తన కాలము నెట్లు గడిపెడువాఁడు?"

అంత సూతుఁడు శీఘ్రముగ నిట్లనెను:– "స్వామీ! ఆతని కాలముగడుపుట విషయములో నడుగవలదు. ఆతఁ డొక క్షణమైనను వ్యర్థ మొనర్పఁడు. ప్రాతఃకాలము బ్రహ్మముహూర్తమున లేచినది మొదలుకొని పరుండువఱకు భగవత్పూజా, సేవార్చా కథా కీర్తనములందు నిరంతరము గడుపుచుండెడువాఁడు. ఆతని కాలమంతయు సార్థకమగుచుండెడిది. ఆతనికి శారీరక, మానసిక, దైవిక, భౌతిక దుఃఖములు లేనే లేవు. నిరంతరము సుఖస్వరూపుఁడగు హరి చర్చలో నుండఁగా నీ దుఃఖము లెట్లాతనికి సంతాపమును గలిగింపఁగలవు? మునులారా! ఈ విధముగా స్వాయంభువమను నొక మన్వంతరము వఱకు పృథ్వినంతను బరిపాలించెను."

మైత్రేయమహాముని విదురునితో నిట్లనెను:– "విదురా! నే నీవిధముగా నాదిరాజైన స్వాయంభువమనుచరిత్రమును జెప్పితిని. ఈతఁడే సృష్టికి ఆదినియమకర్త. ఈతఁ డెంతటి ధర్మాత్ముఁడు, పవిత్రహృదయుఁ డనఁగా గొప్పగొప్ప త్యాగులు, విరాగులు, యతులు, తపస్వులు వీరి సమీపమునకు వచ్చి తమ శంకల నన్నిటిని దీర్చుకొనెడువారు. ఒకానొకసారి ఋషులందఱును వచ్చి వర్ణాశ్రమధర్మములనుగుఱించి నానాప్రశ్న లడిగిరి. మును

లెప్పుడును ప్రజల హితమునే చూచుచుందురు. మునులు ప్రశ్నించినపుడీతఁడు శాస్త్రీయవిధిచే జక్కని జవాబు లొసంగెను. ఆ ప్రశ్నోత్తరముల స్మృతియే యిప్పుడు లోకములోఁ బ్రసిద్ధిచెందిన మనుస్మృతి. వర్ణాశ్రమ ధర్మావలంబులందఱు నీ నియమముల నాదరించుచుందురు. యథాశక్తిగ, యథావకాశముగఁ బాలనచేయుచుందురు. విదురా! నీవు నీతిశాస్త్రములోఁ బండితుఁడవు. అందువలననే 'విదురనీతి' యను పేరు వచ్చినది. అదేవిధముగ మనువన్నివిషయములలోఁ బండితుఁడు, బాగుగాఁ దెలిసినవాఁడు. ప్రపంచములో నాయన చేసిన నియమములు ఆతని పుత్రులు, పౌత్రులు, వంశీయులు నేఁటికి నాచరించుచునే యున్నారు. ఘోరకలియుగము రాఁగానే యీ నియమములకు శిథిలత కలుగఁగలదు. ప్రాయికముగ లుప్తమై పోఁగలవు; కాని మరల కృతయుగము రాఁగానే ఋషిగణ మీ నియమములను బ్రచారము చేయఁగలరు.

ఈ విధముగ నే నత్యంతసంక్షేపముగ నీ మనుచరిత్రను జెప్పితిని. ఇఁక మీరు కర్దమమహాముని దేవహూతి చరిత్రను శ్రవణము చేయుఁడు.

# కర్దమముని తపస్సు - దేవహూతి సేవ.

విషయములతో నింద్రియసంసర్గము కలుగనంతవఱకు ధైర్యపరీక్ష జరుగదు. ఇంద్రియవికారములను గలిగించుటకు హేతుభూతమగు విషయములు సమ్ముఖమున నున్నను వికారముపొందని మనస్సు గలవాఁడు ధీరుఁడు. వస్తువు అభావమున సంయమము చేయుటయు శ్రేష్ఠమే. అన్నము లేకపోవుటచే నేకాదశీవ్రతముండుటయు నుత్తమమే; కాని యన్నియు నుండఁగా మనస్సును నిరోధించుట మిక్కిలి శ్రేష్ఠము. మనీషులు విషయములయొక్కయు నింద్రియములయొక్కయు సంబంధము వెన్నకు, అగ్నికి గల సంబంధముగాఁ బోల్చుచుందురు. అగ్ని సమీపమునకుఁ బోయినపుడు వెన్న కరిగిపోవును; కాని అట్టి సమయమున నెవఁడు మనస్సును సంయమము కావించి వానికి లోఁబడకుండునో ఆతఁడే ఆదర్శపురుషుఁడు. ఆతఁడే చరిత్రవంతుఁడు. ఆతనిని స్మరించుటచేతనే మన హృదయము పవిత్రమగును. ఆతని ననుకరించుటచే జీవితములో గొప్పదనము రాఁగలదు.

మైత్రేయమహాముని విదురునితో నిట్లనెను:- "విదురా! ఇంతవఱకు మునికి వివాహమనిన నుత్సాహము కలదు. వివాహము కాఁగానే ఆతని యుత్సాహము విలీనమయ్యెను. ఆతఁడు దృఢముగ మనస్సును విషయములనుండి తొలఁగించి, తన పత్నితో నిట్లనెను:- "రాజపుత్రీ! నీవు భయపడవుగదా! నా యెడల నీకు శ్రద్ధ యుండదుకదా! మాకు తపస్సే ధనమను విషయము నీకు తెలిసినదే. అందువలననే మేము తపోధను

లనఁబడుచున్నాము. నేను మరల తపస్సు చేసెదను. నీవు దుఃఖింపకుము.''

అగ్నితో సమానమగు తేజస్వియుఁ దపఃప్రభావముచే దేదీప్యమానుఁడు నగు తన పతికిఁ జేతులు జోడించి దేవహూతి యిట్లనెను:- "ప్రభూ! సతీసాధ్వియగు స్త్రీకి పతియే సర్వస్వమని నేను బాల్యకాలమునుండియు శిక్షణగఱచితిని. పతిసేవయే సతికి ముఖ్యకర్తవ్యము. ఆతని అభిప్రాయమునకు సతి సమ్మతించుచో నామె కక్షయలోకములు లభింపఁగలవు. పతికి దేని యం దానందమో నాకును దానియందే ఆనందము. మీరు తపస్సు చేయుఁడు. నేను సర్వవిధముల మీకు సేవచేసెదను.''

తన భార్య యిట్టి ధర్మవచనములను బలుకుటను దెలిసికొని కర్దమమహాముని మిక్కిలి యానందించి, మరల తపస్సులో మునిఁగెను. ఆతఁడు సమాధిసుఖము నానందించుచుండెను. ఆతని కీ విషయము లేమి యానందమీయఁగలవు? ఆతఁడు ప్రాతఃకాలమున నిత్యకర్మలనుదీర్చుకొని ధ్యానములోఁగూర్చుండిన నేరాత్రికో ధ్యానభంగమయ్యెడిది. ఒక్కొక్కప్పుడు మఱునాఁడును, ఒక్కొక్కప్పుడు చాల దినములకును ధ్యానభంగమయ్యెడిది. అగ్నిహోత్రాదికార్యములు దేవహూతియే చేయుచుండెడిది. ఆమె రాజపుత్రికనను నభిమానమును వీడి నిరంతరము పతిసేవలో నిమగ్నమైయుండెడిది. స్వయముగ వనమునుండి యెండుకట్టెలను దెచ్చెడిది. తన చేతితో సమస్తాశ్రమమును జిమ్మి, నీళ్లు జల్లి, పేడతో నలికి స్వస్తికమును, గృహమండలమును నిర్మించి, కందమూలఫలాదులను దెచ్చియుంచి, ధ్యానభంగము కాఁగానే భగవన్నివేదనము కావించి, భర్త

భుజించినమీఁదట శేషమును భుజించెడిది. భర్త చాలదినములు ధ్యాననిమగ్నుఁడై యుండినచో నామెయు నుపవాసముండెడిది. ఈ విధముగ నామె నిష్కపటభావముతోఁ బతిసేవ చేయుచుండెడిది.''

విదురుఁ డిట్లు ప్రశ్నించెను:- ''స్వామీ! దేవహూతి యువతి. ఆమెకు సర్వగుణసంపన్నుఁడగుఁ బతి లభించినాఁడు. ఆమె మనస్సులో సంసారసుఖేచ్ఛ యేల కలుగలేదు ?''

అంత మైత్రేయుఁ డిట్లనెను:- ''మహాభాగా! ఆమె కిచ్ఛయున్నను ధర్మపాశబద్ధురాలుకదా! ఆమెపతికి దపస్సులో సుఖము కలదు. నా యిచ్ఛను ఆతని యిచ్ఛలో మిళితము గావింపవలెను. ఛలకపటముచేఁ గాదు, దంభపూర్వకముగ నామె యిట్లు చేయుటలేదు. హృదయపూర్వకముగ నామె తన పతిని బరమేశ్వరునిగ భావించెడిది. ఎన్నడును నామె పతిని ద్వేషించెడిదికాదు. మనస్సును, నింద్రియములను దన వశమునఁ బెట్టుకొనెడిది. ఆమె పతికి విరుద్ధమగు నాచరణ చేసెడిది కాదు. సోమరితనమన్నమాట యెఱుఁగదు. అతంద్రితభావముతో సదా సావధానమనస్కయై పతిసేవలో నిమగ్నయై యుండెడిది. త్రికాలములందు పవిత్ర సరస్వతీ సలిలములందు స్నానమాడి, శుచియై యమ నియమములతో నుండెడిది. శృంగార మెన్నఁడును జేసెడిదికాదు. నూనె రాయకపోవుటచేతను, దువ్వక పోవుటచేతను నామె వెండ్రుకలు మలినములై యుండెను. జడలు కట్టెను. జడ ఒక్కటిగనే పెనవేసికొనెను. యౌవనచిహ్నము లన్నియు విలుప్తములయ్యెను. ఆమె సుందరశరీరము శుష్కించి కృశించెను. శరీరచర్మము నల్లబడెను. ఎన్నడును నూనెతోఁ

నలుగుఁబెట్టుకపోవుటచే శరీరము ముడుతలుపడిపోయెను. శరీరము మురికిపట్టెను. కన్నులు గుంటలుపడెను. బుగ్గలు సొట్టలుపడెను. అయినప్పటికిని ఆమె సమస్తకార్యములను సంతోషపూర్వకముగఁ జేయుచు, మునితో సదా ప్రేమపూర్వకముగ భయపడుచు సంభాషించెడిది. ఆమె మాటలాడుటకు పూర్వము నవ్వెడిది. ఆమె నవ్వక, ప్రసన్నవదనములేక మాట్లాడెడిదే కాదు. ఇట్టి కపటరహితమగు ప్రేమపూర్వక పరిచర్యచే పాషాణములైనను గరుగును. అట్టియెడ తపోపూతమగు మహర్షియొక్క నవనీతస్నిగ్ధహృదయ మేల కరుగదు ? ఆతఁడు దేవహూతియొక్క శీల, స్వభావ, సంతోష, ఇంద్రియ దమనములకును, శ్రద్ధాపూర్వకముగ నొనర్చిన సేవకును సంతుష్టుఁడయ్యెను. ఒకదినమున నత్యంతస్నేహముతో సమస్త మమకారమును వెడలఁగ్రక్కుచు, నామె శిరస్సుపైఁ జేతితో నిమురుచుఁ గర్దమమహాముని యిట్లనెను:—"మనుపుత్రీ! నీవు నిష్కపటభావముతోఁ జేసిన సేవచే సంతుష్టుఁడనైతిని. నా సేవకై నీవు శరీరమును దాఁచుకొనలేదు. దానిని శుష్కింపఁజేసితివి. నిన్ను భార్యగాఁ బొంది నేను గృతార్థుఁడనైతిని."

చేతులు జోడించి భయపడుచు దేవహూతి యిట్లనెను:— "ప్రభూ ! నేఁడు మీరిట్లు మాటలాఁడుచున్నారేమి ? ఈ శరీరము మీదేకదా ! సేవ చేయుటే నాకు పరమధర్మము. నేను సేవింపకుండినఁ బాపము రాఁగలదు. స్వధర్మచ్యుతియు కాఁగలదు. నేను ప్రశంసింపఁదగిన కార్యమును దేనినిఁ జేయలేదు. నా కర్తవ్యపాలనము గావించితిని. అదియు నబల నగుటచేఁ బూర్తియైయుండదు."

కర్దమమహాముని యిట్లనెను:– "రాజనందినీ! ప్రాణు లందఱకు మిక్కిలి ప్రియమైనవి ప్రాణములు. ప్రాణములు దేహములో నుండుటచే నది క్షీణించుట కెవరు నంగీకరింపరు. తమ శరీరము నశింపవలయునని యెవ్వరును గోరరు. నీవు నా మూలకముగ నీ శరీరమును జూచుకొననేలేదు. నీవు చేసిన పని మిక్కిలి ప్రశంసనీయమైనది. కర్తవ్యపాలనమైనను అందఱుఁ జేయఁజాలరు. పుణ్యపురుషులే కర్తవ్యపాలనమును జక్కఁగఁ జేయఁగలుగుదురు. కావున దేవీ! నేఁడు నీ కోరికల నన్నిటినిఁ దీర్చెదను. నేఁడు నా కృపాద్వారము నలువైపుల తెఱవఁబడి యున్నది. నీవు నన్నుఁ గేవలము బూడిదపూసికొనిన బైరాగి యని తలఁపకుము. నా గోచిని జూచి నన్నకించనుఁ డనుకొన కుము. నేను ధర్మపూర్వకముగ శాస్త్రవిధిచేఁ బురాణపురుషుఁ డగు హరి నుపాసించితిని. నా తపస్సమాధి యోగ యజ్ఞముల ద్వారా నాకన్నిసిద్ధులు ప్రాప్తించినవి. సాంసారిక శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములకు సంబంధించిన విషయములు తుచ్ఛ ములు, క్షణికములు, నశ్వరములు. దివ్యములు, కల్పకల్పాంతర ములవఱకు నశింపని భోగములు నాకు భగవదారాధనా ప్రభా వముచే లభించినవి. నేఁ డా సిద్ధుల నన్నిటిని నీ యానందము కొఱకు వినియోగింపఁదలచినాను. చెప్పుము, నీకేమి కావల యును?"

తన కారాధ్యదేవుఁడును, ప్రాణనాథుఁడు నగు పతి యొక్క యపరిమేయ కృపను గాంచి దేవహూతి యానందము మేఱలేకుండెను. గుంటలుపడిన కన్నులందు జ్యోతి వెలిఁగెను. మ్లానముఖము కమలమువలె వికసించెను. ఆమె రోమములు

ప్రసన్నతచే నిక్కిపొడుచుకొనెను. ఆమె తన యానందమును నాపుకొనఁజాలకుండెను. అత్యంతోల్లాసముతో గద్గదవాక్కులతో నిట్లనెను:- "ప్రభూ! సేవకు సర్వోత్కృష్టపారితోషికము తన యారాధ్యదేవుఁడు ప్రసన్నుఁడగుటయే. ఇన్ని సిద్ధులను సంపాదించిన నా యారాధ్యదేవుఁడు ఈ దాసియొక్క క్షుద్ర సేవకు సంతోషించుటకంటె నింక శ్రేష్ఠమగు వరదాన మేముండును? మీ ప్రసన్నతయే నా సకలసుఖములకును మూలము. మీ కృపాప్రసాదమే నాకు సర్వస్వమును."

కర్దమమహాముని తన భార్యయొక్క వినీతవచనములను విని, యింకను బ్రసన్నుఁడై ద్విగుణీకృతోత్సాహముతోడను, నుల్లాసముతోడను నిట్లనెను:- "ప్రియా! నీవు గౌరవముచే నిట్టి వాక్యములు పలుకుచున్నావు. నీ కింకను నా మహిమము తెలియదు. ఆ మహిమ యీ చర్మచక్షువులకుఁ గనఁబడునది కాదు. భక్తిభావముతో భగవంతుఁడే సర్వస్వమని యుపాసింపనివారీ మహిమామాత్త్వము నెఱుంగఁజాలరు. దేవీ! నేను నీకు దివ్యదృష్టి నొసంగుచున్నాను. ఇంద్రుని త్రిలోకములనైనఁ దిరస్కరింపఁజాలు నా మహిమమును జూడుము."

ఇట్లు పలికి ముని దేవహూతికి దివ్యదృష్టి నొసంగెను. ఆమె ముఖముమీఁద తపఃపూతమగు నాతని కరమును నిమిరెను. ఇప్పుడు దేవహూతికి సమస్త దివ్యసుఖములు ప్రత్యక్షముగఁ గనఁబడెను. అష్టసిద్ధులు చేతులు జోడించుకొని ఋషి సమ్ముఖమునఁ బ్రత్యక్షముగఁ గనఁబడెను. ఇదివఱకెన్నడు విననని, చూడని దివ్య విషయసుఖములను గాంచి దేవహూతి నిర్ఘాంతపడెను. తన పతి సాధారణ ఋషి కాఁడనియు, అపర

బ్రహ్మ యనియు, మాయాపతి యనియు, సమస్తైశ్వర్యమున కధిపతియనియుఁ దెలిసికొనెను. ఆ దివ్యసుఖములమీఁద కామె మనస్సు పోయెను. ఆమె ప్రేమపూర్వకముగఁ బతి పాదపద్మములపైఁ బడెను.

కర్దమమహాముని పత్నిని లేవఁదీసి ప్రేమపూర్వకముగఁ గౌఁగిలించుకొని యిట్లనెను:- "ప్రియా ! ఇప్పుడు నీవు సంకోచమును వీడి నీ కోరికను జెప్పుము."

పతి యింత ప్రేమగానున్నాఁడని తెలిసికొని దేవహూతి నేఁడు తన జన్మము సఫలమైనదని తలంచెను. ఋషి మాటి మాటికి అడిగినప్పటికిని ఆమె కొంచెమైనఁ బలుకఁజాలనంతటి ప్రేమలో మునిఁగిపోయెను."



## దేవహూతికి వరప్రదానము

దూరత్వములో శిష్టాచారము, సంకోచ ముండును. సమీపత్వమున మానవుని ధృష్టునిగా నొనర్చును. గంభీరత్వమునకు ఒక హద్దు కలదు. మానవుఁడు కొందఱకడఁ గొన్ని యవసరములలోఁ గొంతకాలమువఱకు గంభీరముగ నుండఁగలఁడు. సదా సర్వదా యెవ్వఁడును గంభీరముగ నుండఁజాలఁడు. అట్లుండవలసిన యావశ్యకతయును లేదు. మానవుఁడు కృత్రిమమును వీడి స్వాభావికతనుగూడ అనుభవింపఁగోరును. రాజులను, మహారాజులను, ఆచార్యులను, ధర్మోపదేశకులను మనము

సభలలో నత్యంతగంభీరముగ, శిష్టాచారయుక్తముగ, తూఁచి తూఁచి మాట్లాడువారినిగఁ జూతుము. వారినే వారి కత్యంత నికటవర్తులగు స్త్రీ, పుత్ర, భృత్య, శిష్య, ఘనిష్టసంబంధులతో నేకాంతముగనున్నప్పుడు మాటలాడుటను గాంచితిమా వారిలో నా యస్వాభావిక గంభీరత కనఁబడదు. వారు విచ్చలవిడిగ మాటలాడుదురు, నవ్వుదురు, ఆడుదురు, వినోదములు కూడ చేయుదురు. గంభీరాతిగంభీరుఁడుకూడ పిల్లలతో నాడునప్పుడు పిల్లవాఁడై పోవును.

భార్యాభర్తల సంబంధము నిట్టిదే. ఆరంభమునఁ బరస్పరము హృదయమును వశపఱచుకొనునంతవఱకు సంకోచము, లజ్జ, శిష్టాచారము భయముండును. సంపర్కము పెరిగినకొలఁది పరస్పరము స్నేహపాశముచేఁ గట్టఁబడినప్పుడు క్రమక్రమముగ సంకోచ శిష్టాచారములు తొలఁగి, ఆ స్థానములో ధృష్టత వచ్చిచేరును.

మైత్రేయమహాముని యిట్లనెను:- "విదురా! వివాహానంతరము కర్దమముని మరల ఘోరతపస్సులో నుండెను. ఇద్దరికిని స్త్రీ పురుష వ్యవహారము లేదు. దేవహూతి యాతనిని శ్రద్ధేయుఁ డనుకొని మిక్కిలి గౌరవముగ సేవచేయుచుండెను. ముని కన్నెత్తి యామెవైపునైనఁ జూడఁడు. ఆమెయు భయపడుచుఁ దలవంచుకొని చేతులు జోడించుకొని చెప్పవలసినది చెప్పును. లేకున్న మెదలక సేవలో మునిఁగియుండును. ముని యామె సేవకు సంతుష్టుఁడై ఆమెకు వరమునీయ నుద్యమింప, నాతఁడు తన మమత్వమును, సంపూర్ణప్రేమను దన యనురక్త పత్నియం దుంచినపుడు ఆమె పొంగిపోయెను. ముని నేత్రము

లలో స్నేహముండెను. దేవహూతికి భయము పోయెను. సంకో చము పారిపోయెను. ఆతని యోగమాయయొక్క అతులైశ్వర్య మును గాంచి యామె మంత్రముగ్ధవలెనయ్యెను. 'నా యారాధ్య దేవుడు నేడు నాకు సమస్తసుఖముల నీయ నుద్యమించినాడు. నేడాతడు తన సమస్తసిద్ధుల చమత్కారమును నా యానంద మునకై యుపయోగింపఁ దలఁచినాడు.' అను విషయమును దలఁచుకొనఁగానే యామె శరీరము పులకరించుచుండెను. ముని యిప్పుడు గంభీరముగ లేడు. నవ్వుచు మాటలాడుచుండెను. ఆమె ముఖమును జేతితో నిమిరి తన దివ్యైశ్వర్యమును జూపఁ గానే ఆమె సాహస మినుమడించెను. మహాముని పిల్లవానివలెఁ గిలకిల నవ్వి యిట్లనెను:—"ప్రియా! నా తపఃప్రభావమును గాంచి తివా? మీ తండ్రియింట నిట్టి యైశ్వర్యము కలదా?"

తండ్రి మాట వినఁగానే దేవహూతికిఁ బ్రణయకోపము వచ్చెను. ఇప్పుడాతఁడు మునికాఁడు. ఇప్పుడాతఁడు ప్రాణనాథుఁ డయ్యెను. ఇప్పుడు నిస్సంకోచముగ మాట్లాడుట కధికారము ప్రాప్తించెను. పతితో వినోదముచేయు సమయ మాసన్న మయ్యెను. దేవహూతి కపట గాంభీర్యమును బ్రదర్శించుచుఁ జేతులు జోడించుకొని నవ్వు నాపుకొని యిట్లనెను:— "ద్విజ వృషభా! నీ యైశ్వర్యమునుగూర్చి చెప్పవలసినదేమి? మీరు సమస్తైశ్వర్యమునకు స్వాములు."

ఇది విని మహాముని నవ్వి యిట్లనెను:— "మనుపుత్రీ! నీవు పెద్దయింటిదానవని నాకు తెలియును. మాట్లాడుట, నడు చుట, సంయమము, శిష్టాచారము నెఱుఁగుదువు; కాని నీవు

వట్టి గ్రామీణవుగానైతివి. ద్విజవృషభమనిన నేమనుకొంటివి ? బ్రాహ్మణులలో నెద్దనియేగా? పతిని నెద్దసవలయునా యేమి?"

తన నవ్వు నాపుకొని, చేతులు జోడించుకొని, మృషా శిష్టాచార స్వరముతో నిట్లనెను:- "ప్రభూ ! భార్యాభర్తల మాటలు కూపధ్వని వంటివి. బావిలో నే శబ్దము చేసిన మరల నదియే శబ్దము వినఁబడును. ఇచ్చట మీరు తప్ప వేఱు పురుషులు లేరు. ఏకాంతములో భార్యాభర్త లేమైన ననుకో వచ్చును. మీరు భగవత్సమ్ముఖమున నన్ను గృహమేధ ధేను వంటిరి. అతనిని కామధేనువు నడిగితిరి. గోవుకు పతి యెద్దుయే కదా ! నే నేమి యనుచితమును బలికితిని ?"

ఇది వినఁగానే మునివరుఁడు బిగ్గఱగఁ గిలకిల నవ్వి, తన రెండుచేతులను జాపి, ఆమెను ప్రేమతో నాలింగనము చేసికొని యిట్లనెను:- "దీనిని నీ కెవరు చెప్పిరి ?"

పతియొక్క ప్రేమాలింగనమునుబొంది దేవహూతి నేఁడు పొంగిపోయినది. ఆమె యంగములన్నియు శిథిలములయ్యెను. నలికిన యరఁటిపలె నామె తన భర్తయొక్క వక్షఃస్థలమున వ్రాలెను. ఆమె శుష్కశరీరమును గాంచి ముని మిక్కిలి జాలి పడెను. ఆమెయొక్క జడలుకట్టిన వెండ్రుకలను గాంచఁగానే మునికి హృదయము కఱిగిపోయెను. అప్పుడాతఁ డిట్లనుకొనెను:- "సమస్తసుఖముల ననుభవింపఁదగిన రాజపుత్రిక కెట్టి దుర్దశ కలిగినది ! మర్త్యలోకములోఁ జక్రవర్తినులకును, స్వర్గములో నింద్రపత్నియగు శచీదేవికిని దుర్లభములగు భోగములను నేనీమె కొసంగెదను. మిక్కిలి స్నేహముతో నిట్లనెను:- "ప్రియా !

నీకుఁ బ్రియమగు కార్యమును దేనినిఁ జేయవలయునో నాకు త్వరగాఁ జెప్పుము."

దేవహూతి ముని దృష్టిలో నామె దృష్టిని గలిపి యిట్లనెను:- "ఇప్పుడు మీరు మాటిమాటికి నేమి యడుగుచున్నారు? ఇప్పుడు నాకు దుర్లభమగు వస్తువేమియున్నది? మీరు లభించిననాఁడే నాకన్నియును లభించినవి. నేను స్వతః అన్నిటికి నధికారనైతిని. పురుషుఁ డనేక సంవత్సరములు పఠించి పండితుఁడు కావలయునని మా స్త్రీల కోరిక. అట్టివాని యింటికి స్త్రీ రాఁగానే చదువకయే పండితురాలు కాఁగలదు. గురువున కెంతయో సేవచేసి పతి వైద్యుఁడగును. పత్ని అత్తవారింటికి రాఁగానే వైద్యురాలగును. ఇదేవిధముగా మీరు వేలకొలఁది సంవత్సరములు తపస్సుచేసి తపస్వులైతిరి. నేను రాఁగానే తపస్వినైతిని. మీ సిద్ధులన్నియు నాకు స్వాభావికముగనే ప్రాప్తించినవి. పతి ప్రసన్నుఁడైనపుడు పత్నికొక్కటే కోరిక యుండును."

"ఆ కోరిక యేమి?" యని ముని యనెను.

దేవహూతి యిట్లనెను:- "వివాహమునకు ముఖ్య సుఖము కావలెను శ్రేష్ఠసంతానము కూడ కలుగవలయును. భార్యకు భర్త సాంసారిక భోగపదార్థములన్నిటిని సమర్పించి పత్నీత్వమునకు సంబంధించిన ముఖ్యసంబంధము లేకున్నను, పతిద్వారా సత్సంతానము కలుగకున్నను నుప్పులేని కూరవలె వ్యర్థములగును. నా వివాహసమయమందును నా తండ్రితో గర్భధారణమువఱకు నీమెతో సంగసంగముండునని శలవిచ్చితిరి. ఆ ప్రతిజ్ఞను నెఱవేర్చుకాల మాసన్నమైనది. మీరు నా

యెడలఁ బ్రసన్నులరైనయెడల, నాకు గృహస్థోచిత సుఖము లొసంగఁదలఁచినట్లైన దానికొఱకు బ్రయత్నింపుఁడు."

నవ్వుచు ముని యిట్లనెను:- "దీనికి బ్రయత్నింపవలసిన దేమున్నది ?"

దేవహూతి నవ్వుచు నిట్లనెను:- "స్వామీ ! మీరు మహర్షులై తిరి. మీ కేమని చెప్పుదును ? కొంచెముగ వస్త్రాభూషణములు కావలయును; నూనె పూవులు కావలెను. నలుగు, యితర అంగరాగములు కావలయును. కుంకుమబరిణ, కాటుకకాయ కావలయును.

అన్నిటికంటె ముఖ్యముగ గృహము కావలయును. గృహములేనిది గృహస్థుఁడగు టెట్లు ? ఇల్లు, ఇల్లాలుండిననే గృహస్థుఁడని పిలువఁబడును. ఇటుకరాళ్లతోఁ గట్టఁబడిన యిల్లుండఁగానే గృహస్థుఁడు కాఁజాలఁడు. ఇల్లులేక, ఇల్లాలిని వెంటఁబెట్టుకొని తిరుగుచుండినను యథార్థమగు గృహస్థుఁడు కాఁడు."

కర్దమముని యిట్లనెను:-"ఈ కుటీరముండినఁ జాలును." దేవహూతి కోపగించుకొని యిట్లనెను:- "ఇంక మీకెట్లు చెప్పుదును ? ఇటువంటి పూరింటిలో నెచ్చటనైన గృహస్థుఁడు సుఖభోగము లనుభవించునా? నే నీ కుటీరమునకు వచ్చి సంవత్సరము దాఁటినది. ఎండాకాలము రాఁగానే శరీరమునంతనుగప్పు దుమ్ము రేగును. గాలి దుమారముచే, నలువైపులను ధూళి నిండును. పాత్రలు, ఫల, పుష్పములు, వల్కలములు ఇతరవస్తుసామగ్రి ధూళితోఁ గప్పఁబడును. ఊడ్చ్చగా నూడ్చ్చగా నా

చేతులు నొప్పులు పుట్టుచున్నవి. వర్షాకాలములో నలువైపు లను టపటప మని చినుకులు పడును. నేల బురదగానుండును. వల్కలములు తడిసిపోవును. నిద్రపట్టదు. ఇచ్ఛలేకున్నను జాగర ణమే. స్వతః తపస్సగుచున్నది. ఇంకఁ జలికాలము విషయము చెప్పవలసిన పనియే లేదు. నలువైపులనుండి చలిగాలి వీచు చుండును. అది శూలమువలె వచ్చి శరీరమున గ్రుచ్చుకొనును. ఇంక విశ్రామ మెచ్చట, ఎక్కడి నిద్ర? పొట్టలోఁ గాళ్లు ముడుచుకొని రాత్రియంతయు గడుపవలసినదే. కావున గృహస్థ సుఖములను భోగింపవలయుననిన నా తండ్రిగారికివలె నొక సుందరభవన ముండవలెను.''

ఇది విని కర్దముఁడు నవ్వి యిట్లనెను:– "ప్రియా! నా మహిమము నెఱింగియు నీవు మర్త్యలోకవస్తువులను గోరు చున్నావు. నీ కొఱకు ఈ లోకములో ననేల, త్రిలోకములం దును దానికి సాటిలేని భవనమును నిర్మించెదను."

దేవహూతి యిట్లనెను:– "స్వామీ! అంత పెద్దది అవస రము లేదు. దానికై చాల సున్నము, ఇటుక, రాయి మొద లగు సామాను కావలసియున్నది. చాలమంది కట్టుబడి పని వాండ్రు కావలయును. తయారగుటకు చాల సంవత్సరములు పట్టును. కొంచెము కూర్చుండుటకు నిలుచుండుటకు భవనము, అంతఃపురము, వంటయిల్లు, వచ్చు పోవువారికి పనికివచ్చు భవనము చాలును. దీనితోఁ సాధారణగృహస్థునకు పని గడచి పోవును."

నవ్వుచు ముని యిట్లనెను:– "మంచిది. నీవు కొంచెము సేపు కన్నులను మూసికొనుము." దేవహూతి యిది విని కన్ను

లను మూసికొనెను. ముని యిట్లనెను:— "ఇదిగో నీవు క్రీగంటఁ జూచుచున్నావు. బాగుగా మూసికొనవలెను." దేవహూతి రెండుచేతులతోఁ గన్నులను మూసికొని యిట్లనెను:— "ఇంకెట్లు మూసికొందును? నాయందు విశ్వాసము లేకున్న మీరే మూయుఁడు." నవ్వుచు ముని యిట్లనెను:— "కన్నులను దెరువుము. చూడుము. నీ కెదురుగా నేమున్నది?"

దేవహూతి కన్నులను దెఱచునప్పటికి ఆమెదృష్టి మిఱుమిట్లు గొలిపెను. తాను నిద్రించుచున్నదో మేల్కొనియున్నదో మొదట ఆమెకు తెలియలేదు. నాకుఁ గనఁబడుచున్నది యథార్థమా లేక స్వప్నలోకమా? చాలసార్లు ఆమె తన చేతులతోఁ గన్నులను దుడుచుకొని, తడబడి, మాటిమాటికి తన నాథుని వైపును, నా యాశ్చర్యమువైపును జూచుచుండెను.

ముని నవ్వుచుండెను. దేవహూతి హర్ష విస్మయములలోఁ బడియుండెను. ఆమె తనయెదుట నొక దివ్యవిశాల భవనమును గాంచెను. దాని గోడలన్నియును శుద్ధ సువర్ణముతోఁ గట్టఁబడినవి. అది సర్వసంపత్సంపన్నముగను, సర్వశ్రేష్ఠముగను, నతిశయసుందరముగను, సమస్తదివ్యకామనలను దీర్చునదిగను, సర్వాతిశయ శోభాయుక్తముగ నుండెను. దాని స్తంభములన్నియు మణిజటితములు. దానిమీఁద నింద్ర నీలమణులతోఁ బనిచేయఁబడినది. ఒకదానిపైన నొకటి సప్తఖండములందును నుపవనములు కలవు. మధ్యలో నన్నిటిలో విశాలభవనము, మేడ కలదు. భవనము లన్నిటిలో వేఱువేఱుగా సుందర, సుసజ్జిత, స్వచ్ఛ, తోషకములగు దిండ్లతో శయ్య లమర్పఁబడినవి. వాటిమీఁద పాలనురుగునంటి, వెన్నెలవంటి సన్నని తెల్లని

వస్త్రములు పరచఁబడినవి. బంగారుతోఁ బనిచేయఁబడిన యాసనము లమర్పఁబడినవి. ఆసనములమీఁద నత్యంత కోమలములగు మెత్త లమర్పఁబడినవి. నానారంగులుగల వంకెలపై నానావిధరంగులతోఁగూడిన బహుమూల్యములగు వస్త్రములు వ్రేలాడుచున్నవి. కప్పుమీఁదను, గోడలమీఁదను ననేకరకములుగఁ బనితనము చూపఁబడినది. రత్నజటితములగు సువర్ణ వికారముగల బల్లలు కలవు. విశ్రాంతికై ముఖమ్మల్లు పరుపులు పరిచిన బల్లలు వేఱుగఁగలవు. యథాస్థానములందు చిన్నవి, పెద్దవి పంకా లమర్పఁబడినవి.

ఆ విశాలభవనము సమస్త ఋతువులందును సుఖదాయకముగ నుండెను. చలికాలములో నది యుష్ణముగ నుండును. గులాబిధూపములచే నుపభవనములు, ముఖ్యభవనము నిండిపోయెను. ఎండకాలములోఁ జల్లగనుండును. పాకీదొడ్ల వాసనరాదు. ఎంతటి గాలిదుమారము వచ్చినను నొక రేణువు ధూళియైనను లోనికిరాదు. ఉష్ణము దాని ద్వారము కడకైనను రాదు. బయటనుండి తొంగిచూచి యది తనదారి పట్టును.

వర్షాకాలములో నొక్క దోమయైనను రాదు. ఈఁగ యెక్కడ వ్రాలిన నక్కడనే యుండును. దానిలోఁ గూర్చుండిన వర్షఋతువు మిక్కిలి సుఖముగ గడచిపోవును. దానిలో స్నానగృహము, మనోరంజన గృహము, శృంగార గృహము, శయన గృహము, విహారగృహము, భోజనగృహము ఇట్లన్నియు వేఱు వేఱుగఁ గలవు. అన్నిటిలో నీటివసతి కలదు. శౌచాలయము దానికి చాలదూరమున నున్నది. వంటయిల్లు వేఱుగనున్నది. అచ్చట నిప్పురాజేయవలసిన పనిలేదు. దేనిని గోరిన నాసామగ్రి

అప్పుడే వచ్చెను. అది కేతుపతాకములచే సుసజ్జితమైయున్నది. రంగుల రంగుల పతాకములు గాలికెగురుచు నానందము గొల్పు చుండెను.

శృంగార, భోజన, వస్త్రాది సామగ్రికి అచ్చట కొదువ లేదు. వాడని పుష్పమాలలచ్చట వ్రేలాడుచుండెను. వాటి సువాసన యోజనముల వఱకు వ్యాపించుచుండెడిది. ఆవాసనకు మధులోలుపమత్తమధుకరములు ఝుంకారము చేయుచుండును.

అచ్చటి ప్రాంగణము మహామరకతమణులచే నిర్మింపఁ బడినది. మానసరోవరములో మహనీయతరంగము లెగిరినట్లు దూరమునకుఁ దోఁచుచుండును. చిత్రవిచిత్ర వేదికలు లోపలను, వెలుపలను కూర్చుండుటకై కట్టఁబడినవి. అవి విద్రుమముగ నుండెను. వజ్రములచేతను, ముత్యములచేతను బొదగఁ బడిన సువర్ణకవాటము లమర్చబడి యుండెను. పైన నింద్ర నీలమణి శిఖరములమీఁద విచిత్రముగఁ బనితనము చూపఁబడిన కలశము లుంచబడినవి.

దానిలోని ప్రతివస్తువును సౌందర్యయుక్తమై యుండెను. విమాన మద్వితీయముగ నుండెను. తోరణములు ముందు వ్రేలాడుచుండెను. దానిలోపల నొక సుందరోద్యానవనము, చిన్నసరోవరము ఉండెను. ఉపవనమందు వివిధములగు దివ్య పుష్పములు వికసించియుండెను. సుందర సఘనవృక్షములు ఫలభారముచే వంగియుండెను. సరోవరమందు వివిధములగు పుష్పములు రక్త, నీల, శ్వేత, పీతవర్ణములతో శోభిల్లుచుం డెను. వివిధవర్ణములుగల కమలములు వికసించియుండెను. ఆ సరోవరతీరమున మణులతో సోపానములు కట్టఁబడినవి. సుంద

రములగు చిన్నచిన్న బురుజులు కట్టఁబడినవి. వాటిపై సజీవ మూర్తులనిపించు హంస, సారస, చకోర, కోకిలాది పక్షులు నిర్మింపఁబడినవి. కొలనులో హంస, సారసాదులును, చకోర, కోకిల, మయూరాది విహంగములును కూజితము లొనర్చు చుండెను. నలువైపులను బుష్పములపై షట్పదములు గుంజా రవము చేయుచుండెను. ఆ విమానశోభ అవర్ణనీయము. దానికి సదృశమగు విమాన మీ మూఁడులోకములందు లేదనిన నది యతిశయోక్తి కాదు.

క్షణములో నిట్టి విమానమును గాంచి దేవహూతి పరమ విస్మయమును జెంది, ప్రేమతోఁ దన పతిని జూచుచు నిలుచుండెను. వాక్కు రుద్ధమగుటచే నామె నోటినుండి యొక్క శబ్దమైనను వెలువడలేదు. అయినను ఆమె యిట్టి విమానమును గాంచి మిక్కిలిగ సంతోషింపలేదు. ఆమె హర్షశోకముల మధ్య పడిపోయెను. ఆమెకు భర్తయొక్క యీ దివ్యైశ్వర్య మును, అలౌకిక సామర్థ్యమును గాంచి హర్షమును, తన స్థితిని గాంచి శోకమును గలిగెను. ఆమె యిట్లనుకొనెను:– "విమాన మతిసుందరముగ నున్నది, కాని నా శరీరమింతగాఁ గృశించి మలినముగానున్నది. నేను దీనిపై నెక్కఁజాలను. ఒకవేళ యెక్కినను నామలినశరీర సంసర్గముచే నింతగా మెఱయుచున్న నీ విమానము మాసిపోఁగలదు. అందువలన నామె తన పతితో నేమియు మాటలాడలేదు."

—*—

## కర్దముఁడు పత్నితోఁగూడి సుఖము లనుభవించుట.

నిరంతరము సాంసారిక సుఖములే జీవితలక్ష్యముగఁ బెట్టుకొని, వాటికొఱకై మిక్కిలి వ్యగ్రతతో నుండువారికి, వారు కోరినట్లుగా విషయసుఖములు ప్రాప్తింపవు. వారికి భగవంతుఁడు కూడ దూరమగును. కాని, భగవంతుఁడే తమకు సర్వస్వమని యెంచుకొని, తమ సుఖదుఃఖములను భగవంతునికి దప్ప వేఱొకనికిఁ జెప్పుకొననివారు, భగవంతునొక్కనినే అనన్య భావముచే నారాధించువారు, వీరికి విషయభోగేచ్ఛ యుండదు; కాని త్రిలోకములందు వీరి కత్యంత దుర్లభమగు విషయభోగ ములు ప్రాప్తించును. కారణవిశేషములచే వారు వాటినిఁ గొంతకాలము గ్రహించుచుందురు. చివరకు వారు మలమూత్ర ములను విసర్జించి నిస్పృహులై యుండి వాటివంకనైనఁ జూడ నట్లు వాటిని విసర్జించుచుందురు.

మైత్రేయమహాముని విదురునితో నిట్లనెను:— "విదురా! తన భార్యయగు దేవహూతి కోరఁగాఁ గర్దమమహాముని నిమిషములోఁ దన యోగమాయ ప్రభావముచే సమస్తసుఖ సంపన్నమును, నిచ్ఛానుసారముగఁ దిరుగు విమానమును నిర్మిం పఁగా దేవహూతి హర్షవిస్మయములతో నిట్లనెను:— "స్వామీ! కృశశరీరి కింతటి పెద్దభవనమా! నేను దీని నెట్లెక్కుదును? దీని చిమ్మి బాగుచేయువా రెవరు? మీరు భవనములు కొలువ లేక చేసితిరి. రోజంతయు దీనినిఁ జిమ్మిచిమ్మి యలసిపోఁగలను."

కర్దమముని యామె యభిప్రాయమును గ్రహించి యిట్లనెను:— "నీవు భయపడెద వెందులకు? ముందుగా భగవ

న్నిర్మితమగు నీ పరమరమ్య మహాపావన బిందుసరోవరమందు స్నానమాడుము. అంత నీ కోరికలన్నియు నెఱవేరఁగలవు."

దేవహూతి యిట్లనెను:- "స్వామీ! నేను నిత్యము మూఁడుసార్లు స్నానముచేయుచున్నాను. మరల మీయాజ్ఞచేఁ జేసెదను. నేఁటి స్నానములో విశేషమేమైనఁ గలదాయేమి?"

గంభీరస్వరముతో ముని యిట్లనెను:- "అవును! నేఁటి స్నానములో విశేషమున్నది. భగవంతునిచే నిర్మింపఁబడిన యీ తీర్థము కల్పవృక్షముతో సమానమైనది. దీనిలో నే కోరికతో స్నానము చేయుదురో ఆ కోరిక వెంటనే నెఱవేరును."

ఇది వినఁగానే దేవహూతి తన వల్కలములను దీసికొని బయలుదేరఁగా ముని యిట్లనెను:- "నేఁడు వల్కలములను గొనిపోవలసిన పనిలేదు."

దేవహూతి యిట్లనెను:- "మీరట్లు మాటలాడుచున్నారేల? ఈ వల్కలములు కోమలము. కొంచెము బలముగ లాగితిమా చినిఁగిపోఁగలవు. ఆరిగివస్త్రములు లేకున్న నే నేమి ధరింపఁగలను? ఏమి కప్పుకొనఁగలను?"

ముని పట్టుదలగా నిట్లనెను:- "నీవు వెళ్లినఁ జాలును. భగవంతుఁ డన్ని యేర్పాటులను జేయఁగలఁడు. నీవు భగవంతుని యందు విశ్వాసముంచి సమస్తకార్యములను జేయుచుండుము."

దేవహూతి మిక్కిలి ఉల్లాసముతో వెళ్లెను. ఆమె కృశమలిన శరీరమునకు నూతనోత్సాహము వచ్చెను. జటాకారముగనున్న యామె వెంట్రుకలు సూర్యప్రభయందు మెఱయుచుండెను. వక్షఃస్థలమున నవయౌవన చిహ్నములన్నియు విలు

ప్తములైనవి మరల ప్రౌఢమరెను. ఆమె సరస్వతీనదీ తటవర్తి యగు నా సుందరసరోవర స్వచ్ఛజలములందు మునిఁగి లేచు నప్పటి కా సరోవరమందొక సుందరభవన ముండెను. దానిలో నత్యంతరమణీయకమగు స్నానగృహముండెను. అందు వేయి మంది నవయౌవనసంపన్నలగు యువతు లుండిరి. అందఱును బరమసుందరులు, మనోజ్ఞలు. అందఱనేత్రములు కమలముల వలె వికసితములయ్యెను. వారి శరీరములనుండి దివ్యగంధము వెలిగ్రక్కుచుండెను. వారు మానవులుకారు. దేవజాతి విద్యాధర, కిన్నెరకన్నెలు. దేవహూతినిగాంచి వారు మిక్కిలి సంభ్రమముతోడను, భక్తిశ్రద్ధలతోడను లేచి నిలుచుండిరి. ఇందఱ సుందర సుకుమార కన్యకలను గాంచి దేవహూతి కుతూహల స్వరమున నిట్లడిగెను:- "అక్కలారా! మీ రెవరు? ఇచ్చట నేల కూర్చుండి యున్నారు? ఎవరి కొఱకు కనిపెట్టుకొని యున్నారు? మీ చేతులలో వివిధములగు శృంగారసామగ్రు లేల యున్నవి?"

ఇది విని చేతులు జోడించుకొని, శిరస్సువంచి, శిష్టాచారస్వరముతో నందులో నొకర్తుక యిట్లనెను:- "అమ్మా! మేము మీ దాసీలము. మీకై యెదురుచూచు చున్నాము. స్నానముచేయించి మేము మీకు శృంగారము చేయఁదలంచు చున్నాము. కృపతో మీరు మమ్ములను అనురక్తసేవికలుగ భావించి, సేవాభాగ్యమును గలుఁగజేయుఁడు."

ఇంతటి సుందర సుకుమార కోమలాంగులగు సేవికలను గాంచఁగానే దేవహూతి యానందమునకు మేర లేకుండెను. ఆమె స్నానమునకుఁ గూర్చుండెను. ఒకర్తుక తలనంటెను. ఇం

కొకయామె వీపు నలిచెను. మఱియొకతె పాదములకు నలుగుఁ బెట్టెను. మఱియొకయామె దివ్యగంధయుక్తమగు నంగరాగ మును బూసెను. ఇంకొకయామె దివ్యౌషధీ రసములచేతను, మహౌషధీరసములచేతను స్నానముచేయించెను. మఱియొకతె పరమసుగంధయుక్తమగు సుఖకరతైలమును బూసెను. ఈ విధ ముగ నందఱును సుకుమారి యగు తమ యజమానురాలి సేవలో నిమగ్నులైరి. స్నానము చేయించి వారు వివిధశృంగార సామగ్రులచే శృంగారము గావించిరి. బంగారు పూలుకూర్చిన పట్టువస్త్రములను ఆమెకు ధరింపఁ జేసెను. లతలు, తీగెలు కుట్టిన రవికెను దొడిగిరి. పాదములకు పసుపును రాచి, పారా యణమును బెట్టిరి. కొందఱు గోళ్లకు రంగు వేసెను. ఉంగరము లనుగూడ వ్రేళ్లకుఁ బెట్టిరి. ఇంకొకరు సువర్ణనూపురములను గాళ్లకుఁ బెట్టిరి. ఆమె కాళ్లను గొంచెము కదిలించిన గలగల మ్రోగుచుండెను. ఇంకొకతె రత్నములు చెక్కిన బంగారు వడ్డాణమును, బంగారు మొలనూలును నడుమునకుఁ బెట్టినది. దానిమూలమున దేవహూతి సౌందర్య మినుమడించెను. మఱి యొకతె చేతికి బాజుబందులను, కరకంకణములను బెట్టెను. ఇం కను అనేకమణులు పొదిగిన గాజులను, గొలుసులను జేతులకుఁ బెట్టిరి. ఎడమచేతికి మణులు, రత్నములు గూర్చిన దండకడి యును, మెడలో వివిధములగు కంఠహారములను, కంఠమాలిక లను, గొలుసులను; సూర్యహారము, చంద్రహారము, మామిడి పిందెల గొలుసు, కట్టడపు దండలు, జిగినీ పతకములను ధరింపఁ జేసిరి. శిరస్సునఁ జంద్రవంక, చెవులకు రత్నముల బావిలీలు, బొగడలు, మణికర్ణికలు, జూకాలు ధరింపఁజేసిరి. వివిధసువాసిత

పుష్పముల హారములను మెడనిండ వేసిరి. ఒకతె దంతములకు రంగు వేసెను. ఇంకొకతె అనేక సువాసిత దినుసులు వేసిన తాంబూలమును దయారు చేసెను. ఒకతె గడ్డమునకును బుగ్గలమీఁదను జక్కని పత్త్రావళులను రచించెను. నేత్రములకు సుందరమగు చల్లని కాటుకను బెట్టిరి. కన్నుబొమ్మలను సరిదీసి, మధ్యభాగమందు కుంకుమ, కస్తురి, గోరోచనము మొదలగు సువాసితచందనముతో బొట్టును బెట్టిరి. ముక్కునకు బేసరులు, ముక్కుపుడకలు, మంచిరత్నములు చెక్కిన బులాకి, దానికి మంచిముత్యము వ్రేలాడుచుండ ధరింపఁజేసెను. ఒకతె అలి నీలాలకములను సువాసన నూనెతో బాగుగా దువ్వి, చక్కఁగ జడలల్లి మధ్య మధ్య అలంకారముగఁ బూలను దురిమెను. ఇం కొకతె శిరస్సునఁ జూడామణినిఁ బెట్టెను. ఈ విధముగ నఖశిఖ పర్యంతము దివ్యశృంగారమును గావించి స్వాయంభువ మను పుత్త్రియు, కర్దమప్రజాపతి భార్యయు నగు దేవహూతి నలంకరిం చిరి. వివిధములగు మంగళద్రవ్యములచే నామెను మూర్తీభవిం చిన లక్ష్మివలె నలంకరించిరి.

ఈవిధముగ వస్త్రాభూషణాదులచే షోడశశృంగారములు గావించి యొక మణిమయ దర్పణము నామె సమ్ముఖమున నుంచిరి. దర్పణమునఁ దన రూప సౌందర్యములను గాంచి దేవహూతి చకితయయ్యెను. తన స్వరూపమును జూచుకొని తాను గుర్తుపట్టలేక మలిన శరీరముగల యా తాపసస్త్రీ నేనా నేను? అనుకొనెను.

ఎప్పుడైనను శృంగారము చేసికొనుట యితరుల నానం దింపఁజేయుటకే. ఆమె శృంగారమైన తర్వాత తన దివ్య

సౌందర్యరూపమును దన నాథునకుఁ జూపెదననుకొనెను. అతా త్తుగ వెళ్లి తన పతి నాశ్చర్యచకితుని గావించి తన యనుపమ సౌందర్యముచే నాతనిని సంతోషింపఁజేయఁదలఁచెను. ఆమె పతికడకు వెళ్లఁగోరుచునే యింతలోఁ బతి సమక్షమున నిలిచెను.

ఇప్పుడు కర్దముఁడును దపస్వియగు కర్దముఁడు కాఁడు. ఆతఁడు ముంజత్రాటిని గోచిని దీసివేసి, మంచి పట్టుధోవతిని గట్టుకొని, పైన పట్టుజరీ ఉత్తరీయమును వేసికొనెను. భస్మము నలఁదిన వాఁడిప్పుడు సువాసితములగు సుగంధద్రవ్యములచే శరీరమలఁదెను. ఇట్లొక దివ్యసింహాసనమునఁ గూర్చుండెను. జడల స్థానమునఁ గుటిల కుంతలములు చంద్రునిలోని యమృత మును ద్రావుటకు మూఁగిన నల్లత్రాచులవలె నాతని ముఖ బింబమున వ్రేలాడుచుండెను. ఆతని కర్ణములకు మకర కుండలము లుండెను. శిరస్సున మనోహార మణిమయ కిరీట ముండెను. నవ్వుచు నాతఁడు బహుమూల్యములగు దిండ్లకాను కొని యుండెను. చాలమంది విద్యాధరులు ఛత్రచామరములను బట్టుకొని సేవలో నిమగ్నులై యుండిరి. తనపతి యిట్టి దివ్య రూపమున నుండుటను గాంచి దేవహూతి పడిన యానందము నకు మేఱలేకుండెను. కర్దమమహామునియుఁ దన భార్యను గాంచి సౌందర్యమునఁ ద్రిభువనసుందరీమణులను దిరస్కరించు చున్నట్లుగాంచెను. విద్యాధర సుందరీమణులచేఁ జుట్టుకొనఁబడిన దేవహూతి త్రిభువన లోకపాలకుల పత్నులచేఁ జుట్టుకొనఁబడిన లక్ష్మివలె నుండెను. అట్టి యీమెను గాంచి కర్దముఁడునవ్వెను. దేవహూతియుఁ దన హావభావ కటాక్షములచేఁ గామదేవుని దిరస్కరించు శృంగార సౌందర్యములను, పితామహబ్రహ్మను

మించు ప్రభావమును గలిగిన తన పతిని సంతోషపెట్టెను. ఆమె యాతని యోగప్రభావమున కాశ్చర్యపడుచుండెను. కర్దముఁ డామెను దన కరకమలములచేఁ బట్టుకొని, యా విమానమునఁ గూర్చుండఁబెట్టుకొని, అత్యంత స్నేహముతో నిట్లనెను:- "నేఁడు నీవు గుర్తుపట్టరాకున్నావు."

అత్యంత స్నేహాభరిత హృదయముతో మధుర వాక్కులచేఁ గృతజ్ఞతను బ్రకటించుచు మనుపుత్రి యిట్లనెను:- "ప్రభూ! మీతపశ్శక్తి అపూర్వము. భగవంతుఁడగు నచ్యుతుని బ్రసన్నము గావించినవారికి లోకమందు భోగమోక్షములు సులభములనుట సత్యము. ముక్తి యాతని సమ్ముఖమునఁ జేతులు కట్టుకొని నిలఁబడును. ఇఁక భక్తివిషయము చెప్పనేల?"

మైత్రేయమహాముని విదురునితో నిట్లనెను:- "విదురా! ఈవిధముగ వారిద్దరును నా విమానముమీఁదనుండి దివ్యాతిదివ్యభోగము లనుభవించిరి. సుఖముగ గార్హస్థ్య ధర్మమును బాలించిరి."

—:0:—

# కర్దముఁడు లోకపాలనగరములందు విహరించుట.

దివ్యసుఖము లగుఁగాక, పార్థివసుఖము లగుఁగాక, వీటిని సేవించుటవలన శాశ్వతశాంతి లభింపదు. అయినను మానవులు వీటిలో సుఖమున్నదనుకొని వీటిని బొందుటకు వ్యగ్రులై యుండుట పరంపరగా వచ్చుచున్నది. సాధారణ నిర్ధనులు లక్షాధికారులు సుఖంతు రనుకొనుచుందురు. వారివద్ద ప్రచుర మగు సుఖసామగ్రికలదు. లక్షాధికారులు కోటీశ్వరులు సుఖంతు రనుకొనుచుందురు. కోటీశ్వరుడు అర్బుదపతిని, అతఁడు పద్మ పతిని, చక్రవర్తిని, ఆచక్రవర్తి యింద్రుని, ఇంద్రుఁడు బ్రహ్మను, బ్రహ్మ సర్వత్యాగియగు విరాగిని సుఖియని తలఁచును. నిజమున కతఁడనుకొనినది సత్యమే. విషయము లెక్కువైనకొలఁది తృష్ణ యెక్కువ కాఁగలదు. తృష్ణకొలఁది దుఃఖము లభించును. కాని యిది జ్ఞానములేక కేవలము శ్రవణమువలననే అనుభవమునకు రాదు. క్రమముక్తిని బొందువా రీ దివ్యలోక సుఖముల ననుభ వించుచుఁ బైకిపోవుదురు. కొందఱు సమస్తవిషయములు తుచ్ఛములని దృఢముగ భావించి, ప్రకృతికిఁ బరుఁడైన పురు షోత్తమధామమున నిత్యసుఖము లనుభవింప నర్హుఁడగును.

మైత్రేయమహాముని యిట్లనెను :- "విదురా! దేవ హూతి తన కామద విమానముమీఁద గూర్చుండి, భూలోక సుఖముల నన్నిఁటి ననుభవించి, దశదిశలందు సమస్తదేశము లందుగల దర్శనీయస్థానములను దర్శించి, సర్వసమర్థుఁడగు తన పతినిగాంచి యిట్లనెను :- "ప్రాణనాథా! సుమేరు పర్వత

మందు అష్టలోకపాల పురములు కలవనియు, నచ్చటి వనోప వనములు మిక్కిలి మనోరమములనియు వినియుంటిని. వానిలో వాటిక్రిందఁ గూర్చుండిన సమస్త కోరికల నొసంగెడు అద్భుత కల్పవృక్షములు కలవని వినియున్నాను. పర్వతరాజగు సుమేరు పర్వత సుందర శిఖరములందు సదా సంగీత సుమధుర ధ్వని వినఁబడును. దాని కమనీయ కందరములందు కిన్నర,విద్యాధర, గంధర్వ కామినులు తమ పతులతో సదా క్రీడించుచుందురు. అచ్చట నెల్లప్పుడు సర్వఋతువుల కనురూపమగు సుందర మంద సుగంధవాయువు వీఁచుచుండును. అచ్చటనుండి సదా గలగలశబ్దము చేయుచు నలకనంద పడుచుండును. అచ్చట శోక గ్లానులుండవు. అచ్చట స్వేదముగాని, సోమరితనముగాని యుండదు. ముసలితన ముండనే యుండదు. అందఱు నవ యౌవనులుగానే యుందురు. అందఱును రూపవంతులై, దర్శ నీయులై, సుందరులై సమస్త దివ్యసుఖముల ననుభవించు చుందురు. విహారాపేక్షులై యుండుటయే వారి వ్యాపారము. శాస్త్రకారులు దానిని భోగభూమి యందురు. నేనా వనోప వనములను జూడవలయును. నేనును దేవాంగనలవలె మీతో విహార మొనర్పవలయును. నాకును మన యైశ్వర్యముచే స్వర్గీయస్త్రీలకు సిగ్గుకలిగింప వలయునని యున్నది. మీరు సర్వసమర్థులు. మీ సంకల్పముచేతనే అన్నియును జేయఁగలరు. కావున నాయీ కోరికను దీర్పుఁడు."

కర్దమమహాముని దేవహూతి సేవలకు సంతుష్టుఁడై ఆమె కోరినప్రకారము సమస్తసుఖములను లభింపఁజేయుటకు నుత్సహించెను. ఆమె కోరికలన్నిటిని దీర్పఁదలఁచెను. ఆమె

కానందము కలుగఁజేయుటకై సమస్త తపస్సును వినియోగింపఁ దలఁచెను. ఆతనికి వాహనము లక్కఱలేదు. ఆతఁడు సంకల్పింపఁగానే అలంకరింపఁబడిన భవనమొకటి పైకి యెగిరెను. దేవహూతి అత్యంతకుతూహలముతోఁ జూచుచుండెను. అంతరిక్షమునఁగల భువర్లోకమున వారు గాలియాధారమునసుండు భూత, ప్రేత, పిశాచ, సిద్ధాదులను గాంచిరి. వారి విమానము మేఘములను జించుకొనుచుఁ బైకి పోవుచుండెను. క్రిందనున్న మహావృక్షములు మొక్కలవలెను, పెద్దపెద్దరహదారులు సన్నని గీతలవలెను గనఁబడుచుండెను. వక్రగతిగాఁ బ్రవహించు నదులు సన్నని దీర్ఘములగు సర్పములవలె గోచరించు చుండెను. క్రింద నడుచు స్త్రీ పురుషులు ఈఁగలు, దోమలవలెఁ గనఁబడుచుండిరి. గజ, రథాది వాహనము లెగిరెడు పక్షులవలె నగబడు చుండెను. దేవహూతికి దీనివలన మిక్కిలికుతూహలము జనించు చుండెను. ఆమె యాశ్చర్యముతోడను, నుత్సాహముతోడను నిలిచి నిలిచి చూచుచుండెను. విమాన మెగురుటచే ధూళి లేచుటలేదు; ఏవిధమగు దుర్గంధమును వచ్చుటలేదు. దివ్యమణులచే నది వెలుఁగుచుండెను. దానిలో శబ్దముపుట్టుటలేదు. కదలుటలేదు. అది యెగురుటచే శరీరమునకు శ్రమ కలుగుట లేదు. ఈ విధముగ నెగురుచు నిమిషములో మందరాచల శిఖర సమీపమునకుఁ జేరుకొనిరి.

అచ్చటి శోభనుగాంచి దేవహూతి యాశ్చర్యమును జెందెను. ఆహా! ఆ దివ్యసువర్ణశైల మెంత యనుపమానమై యున్నది! అచ్చటి పెద్దపెద్ద విశాలమగు గుహలు, కందరము లెంతటి భవ్యములు! సర్వత్ర మనస్సు నాకర్షించు సుగంధ

యుక్త మందవాయువు వీఁచుచుండెను. పుష్పభరితమై యుం డెను. పక్షుల కలరవములో మాదకత కలదు. అచ్చట శోభ వ్యాపించినట్లును, సౌందర్య సామ్రాజ్యము విస్తరించినట్లును, సమస్త శరీరములలోఁ గామము వ్యాపించినట్లుండెను. అచ్చట వసంతము స్థాయిరూపముగ నుండెను. అచ్చట వాయుదేవు నకు స్వాతంత్ర్యము లేదు. అనుకూలమునుబట్టి వర్తింపవల యును. వృక్షములు శోభకు అనురూపముగ ఫల, పత్ర, పుష్ప ములను విసర్జింపవలెను. అచ్చటి ఫలములలోనుండి యొక విధ మగు మాదకగంధము వచ్చుచుండెను. పుష్పములపై షట్పద ములు మూఁగుచుండెను. అవి పుష్పములతో దాగిలమూఁత లాడుచుఁ గలితక్రీడ యొనర్చుచుండెను. అవి తమ గంజారవ గీతములచే సంతోషపెట్టుచుండెను. వలదన్నను నవి మధుపా నము చేయుచుండెను. పత్రములు చంచలము లగుచుండెను. పుష్పములు కదలుచు భ్రమరములను దోలుచుండెను. మకరంద పానముచేసి భ్రమరము లెగురుచుండెను. దేవాంగనలు ద్రుత వేగముతో మదమత్తలై యిటునటుఁ దిరుగుచుండెను. గంధ ర్వులు గానము చేయుచుండిరి. అప్సరస లాడుచుండిరి. దేవతలు విహరించుచుండిరి. వీణా, మృదంగ, పణవ, మురజ, గోముఖాది ధ్వనులచే మందరాచల కందరములు ప్రతిధ్వనించు చుండెను. విమానశ్రేణులు వరుసగ నిలిచియుండెను. కొన్ని విమానము లెగురుచుండెను, కొన్ని దిగుచుండెను. కొన్నిటిలో సుందరగాన ములు వినఁబడుచుండెను. కొన్నిటిలో పానీయములను ద్రాగు చుండిరి. కొన్నిటిలో నృత్యము, కొన్నిటిలో నాటకాభినయము జరుగుచుండెను. కొందఱు దేవతలు తమ తమ దేవాంగనలతో

విమానములనుండి దిగి, యుపవనముల వైపునకు వెళ్లుచుండిరి. ఉపవన రంగభూములందు మనోరంజకసామగ్రు లనేకము లుండెను. ఎచ్చట చూచినను రూపయౌవన గర్విష్ఠలగు దేవతా స్త్రీలు, మత్తమందులను సేవించుచు మదవతులై తిరుగుచుండిరి. వారికి లజ్జాభయములు లేవు. అందఱును వినోదములో మునిఁగియుండిరి. అందఱును నవ్వుచుండిరి, నవ్వించుచుండిరి. పాడుచుండిరి, పాడించుచుండిరి. ఆడుచుండిరి, ఆడించుచుండిరి. స్నానమాడుచుండిరి, స్నానము చేయించుచుండిరి. వెళ్లుచుఁ, దినుచుఁ, దినిపించుచుఁ ద్రాగుచుఁ ద్రావించుచు, నలంకరించుచు నలంకరించుకొనుచుండిరి. కొందఱు కొందఱతోఁ బ్రేమతోఁ గలిసికొనుచుండిరి. కొందఱు కొందఱవైపు కన్ను గీటుచుండిరి. కొందఱు పుణ్యప్రభావమున వచ్చుచుండిరి. కొందఱు క్షీణ పుణ్యులై తలవంచుకొని పడిపోవుచుండిరి. విచిత్రముగఁ గనఁబడుచుండెను. అచ్చట కథగాని, కీర్తనగాని, ఉత్సవముగాని, పర్వపూజనముగాని లేదు. తినుట, త్రాగుట, యిష్టమువచ్చినట్లు విహరించుట యచ్చట స్వాభావికమైనది. ముని విమానమునుగాంచి దేవ, సిద్ధ, చారణ, గంధర్వాదులు విస్మయావిష్టులైరి. వారందఱాతనిని గలియఁజూచిరి. ఇట్టి విమానము అష్టదిక్పాలుర నగరములలో నెచ్చటను లేదు. దేవాంగనలు వారి సతులతో నిట్లనిరి:- "ప్రాణనాథా! ఇట్టి దివ్యాతిదివ్య విమానములపైఁ బతితో విహరించు నీ లలనారత్న మెంతటి సౌభాగ్యశాలినియో గదా! ఆకృతి ప్రకృతిచే నీమె మానవ మహిళగఁ గనఁబడుచున్నది, కాని యైశ్వర్యమున నీమె మన లను మించినట్లున్నది."

దేవత లిట్లనిరి:— "ఈమె కర్దమమహాముని ధర్మపత్ని. కర్దముని ప్రభావమమితము. ఆతఁడు శ్రీహరినారాధించి సిద్ధులను బొందెను. అట్టి వింక యేకర్మచేతను లభింపవు."

ఈ విధముగ సిద్ధ, దేవ, గంధర్వ వందితుఁడై, వారిచేఁ దన్నుఁగూర్చిన స్తుతులను వినుచు, గర్దమమహాముని తనపత్నితో నొక వనమునుండి యింకొక వనమునకుఁబోయి విహరించు చుండెను. ఎచ్చటికి వెళ్లినను ఆతనికి స్వాగతమిచ్చుచుండిరి. ఆతని కందఱును బుష్పాంజలు లొసంగుచుండిరి. సిద్ధ, దేవ, గంధర్వకన్యకలు వారిపైఁ బుష్పవృష్టిని గురిపించిరి. వారి విమానము పుష్పవృష్టిచే నిండిపోగా వారు వాటినిఁ గ్రిందకుఁద్రోసెడు వారు. అవి యాకాశమునుండి తొలకరిలోఁ బెద్ద పెద్ద చినుకులు లేక వడగండ్లు రాలినట్లు రాలుచుండెను.

ఈవిధముగఁ గర్దముఁడు స్వర్గములోని సమస్త వైశ్రంభక, సురసన, నందన, పుష్పభద్ర, మానస, చైత్రరథము మొదలగు దివ్యకాననములలోఁ జాలకాలము తిరిగిరి. దేవతల విమానములు వారి యైశ్వర్యము, వారి ప్రభ, కాంతి ఇవియన్నియుఁ గర్దమ మహామునిముందు తీసికట్టుగ నుండెను. దేవతలు పుణ్యప్రభావముచే స్వర్గమునకు వచ్చిరి. ఈతఁడు భగవదుపాసనచే వచ్చెను. హృదయమందు భగవద్భక్తి కలవారికిని, పవిత్ర చరిత్రుఁడును, బుణ్యశ్లోకుఁడును, జగన్మంగళకారియు, భవభయ హారియునగు బురుషోత్తముని పావనపాదపద్మముల నాశ్రయించిన వారికీ లోకమందు దుర్లభమైన దేదికలదు! వాని ముందు స్వర్గసుఖములు తుచ్ఛములు. మునివరుఁ డేలోకమునకుఁబోయినను వారందఱు నీతని దర్శనమునకు మూగుచుండెడువారు.

లోకపాలుర భార్యలు దేవహూతి పాదపద్మములకుఁ బ్రణమిల్లెడువారు. మునిపత్ని వారినిఁ గౌఁగిలించుకొని యత్యంత స్నేహముతో నిట్లనెడిది :– " మేము మృత్యులోకవాసులము. మీరు స్వర్గీయరమణులు. త్రిలోకాధీశ్వరులగు లోకపాలుర పూజనీయ పత్నులు. మిమ్ముఁబోలినవారు లోకములో నెవరుందురు ?"

వారందఱు వినయావనతలై శ్రద్ధాంజలుల నర్పించుచు నిట్లనిరి:– " దేవీ ! మాటకు మే మధీశ్వరులమే. మీ శాపముచే మేము కీటక పతంగ యోనులలోఁగూడ జన్మింపవచ్చును. లోకములోని సమస్తైశ్వర్యము మీయధీనమే. మేము విషయ కీటకులము. మీరు మీ యలౌకికోపాసనచే నఖిలేశుని వశపఱచుకొంటిరి. మీ యైశ్వర్యసమ్ముఖమున సమస్తైశ్వర్యములు తుచ్ఛములే. " ఈ విధముగ సమస్త లోకపాలుర భార్యలచే సత్కరింపఁబడుచు దేవహూతి తన పతియొక్క యప్రతిమ మహిమ తెలిసెను.

చాలకాలము మహాయోగియగు కర్దముఁడు తన ప్రాణప్రియయగు దేవహూతికి త్రిలోకములలోని ఆశ్చర్యమయ చిత్రవిచిత్ర రచనలను జూపుచు ద్వీప, వర్ష, నద, నదీ, సముద్ర, కాననాంతరిక్షాది స్థానములందు తిరుగుచుఁ దిరుగుచు సరస్వతీ నదీతటమునఁగల బిందుసరోవర సమీపమునఁగల తన యాశ్రమమునకు వచ్చిరి. దేవహూతి కోరికలన్నియు నెఱవేరెను. భూగోళమును జూడవలయునను నామె కోరిక శాంతించెను. కిన్నర విద్యాధరులచే సేవింపఁబడువారు విశ్వములోఁగల అత్యుత్తమ విషయములను భోగించుచుండెను. తన భర్త తన యెడల ప్రీతిగానున్నాఁడని తెలిసికొని ప్రపంచములోఁ దాను

భాగ్యశాలి ననుకొనుచుండెను. ఏ స్త్రీ యెడలఁ దన ప్రాణేశ్వరుఁడు ప్రసన్నుఁడగునో ఆమెకు దుర్లభ మేమికలదు ? ఆమెకు మించిన సుఖులెవరుందురు ? ఇవన్నియుఁ జూచిన తర్వాత నామెకు సర్వశ్రేష్ఠమగు సంతానేచ్ఛ కలిగెను.

మైత్రేయుఁ డిట్లనెను :- " విదురా ! స్త్రీలకు సుందర సంతానప్రాప్తికి మించిన సుఖ మింకేమి యుండఁగలదు? దేవహూతి యీ కోరికను తన భర్తకుఁ దెలుపఁగా గర్దమప్రజాపతి ఆమెకోరికను దీర్చెను."



## కర్దముని విరాగము

దుఃఖకాలము కల్పములవలె దీర్ఘములుగ నుండును. సుఖసమయము వందల సంవత్సరములైనను క్షణముగ గడిచి పోవును. కాలగతి యొకేవిధముగనే యుండును. అది ప్రాణుల దుఃఖములను గాంచి మెల్లగా నడువదు. సుఖములను గాంచి గుప్పిట బిగపట్టి పరువిడదు. దాని నడక సుఖదుఃఖములలో నొక్కరీతిగనే యుండును. కాని మనము మన మనస్సుచే మన భావనానుసారముగ, వీలునుబట్టి నెమ్మది యనియు, దీర్ఘ మనియుఁ గల్పించుకొంటిమి, సుఖదుఃఖములనుగూడ మనము మనస్సుననుసరించి నిలువఁబెట్టఁగలము. మనస్సును వశపఱచు కొనినవాఁడు విశ్వమునంతను వశపఱచుకొనినవాఁడే కాఁగలఁడు. మనస్సునకు లోఁబడినవాఁడు విశ్వమునకు దాసుఁడే. సుఖ దుఃఖములకును, బంధమోక్షములకును గారణము మనస్సే.

మనోగతి రహస్యము నెఱిఁగినవాఁడు సాంసారిక విషయముల లోనే పడఁడు. ప్రారబ్ధముచే భగవదిచ్ఛచే నాతఁడేదో పరిస్థితిలో విషయస్వీకరణ మొనర్చినను, నాతఁడు శీఘ్రముగనే వాటినుండి దూరముకాఁగలఁడు. భగవద్ధ్యానములో మగ్నుఁడగును.

మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురా ! కర్దమ మహాముని యీవిధముగాఁ దనభార్యకు ఆశ్చర్యమయమగు భూగోళ, ఖగోళములను జూపుచు, స్వర్గీయ వనోపవనముల శోభను గాంచుచు, సందఱను దమ దివ్యాతి దివ్యైశ్వర్యముచేఁ జకితులను గావించుచుఁ దమ యాశ్రమమునకుఁ దిరిగి వచ్చిరి. ఆతఁడు తన ధర్మపత్నికి సాంసారిక సుఖముల నొసంగుటలో నేమియు లోటుచేయలేదు. అనేక సంవత్సరములు ఆమెతో రమించుచునేయుండెను. ఒకరి కొకరు పరస్పరము తమ హృదయముల నర్పించుకొనిరి. ఇద్దరును యౌవనమదముచే మదించియుండిరి. ఎప్పుడు తెల్లవారుచున్నదో, యెప్పుడు చీఁకటి పడుచున్నదో వారికి తెలియదు. ఈ విధముగ ననురాగమునం దాసక్తులై యా దంపతులు దినములను క్షణముగ గడుపుచుండిరి. క్రమముగ కర్దమమహాముని వీర్యముచే దేవహూతికి తొమ్మిదిమందికుమార్తె లుదయించిరి. వారందఱును సుందరులు, సుశీలురు, సుహాసినులు. వారి శరీరములనుండి దివ్య కమల సుగంధము నిరంతరము వెలువడుచుండెను. ఆ సువాసన వారు కూర్చుండిన విమానమునకుఁగూడ బట్టెను. వారు తమ చిలుక పలుకులచేతను, బాలసులభమగు చంచల చపలత్వముచేతను దల్లిదండ్రుల నాకర్షించుచుండెను. పుష్పములవలె నవ్వుచు, నలువైపులను గిలకిలలాడుచు, నెగురుచు నా పిల్లలు సముద్ర

ములో నీడు వివిధరంగుల చేఁపలవలె శోభిల్లుచుండిరి. మునికి గృహస్థాశ్రమను పెనుగఁజొచ్చెను. ఆతఁడొక్కఁడు బహుళ ముగ నయ్యెను. దేవహూతి యిప్పుడు జాయ యయ్యెను. ముని హృదయములో నా భగవానుని రూపసౌందర్య మట్లే నిలిచి యుండెను. ఆతఁడు బ్రహ్మాజ్ఞచే భగవత్సేవగా భావించి గృహ స్థాశ్రమమునఁ బ్రవేశించెను. ఆతఁడు నివృత్త ధర్మోపాసకుఁడు. ఆతఁడు ప్రవృత్తిని లోకసంగ్రహముకొఱకై స్వీకరించెను. తన కుమార్తె లింటిలో గలరవము చేయుచుండుటను, దేవ హూతి వారి పాలనపోషణలో వ్యగ్రురాలై యుండుటను గాంచి, తన మనస్సుగూడ దారాపుత్రికలందు లగ్నమై మోహాంకు రము బయలుదేరుచున్నట్లు తోఁచఁగనే మునికి తెలివికలిగి యిట్లనుకొనెను:- "నేను పతనమైతిని. భగవన్మాయ నన్నుఁ బతనము కావించినది. మాయామోహము నన్నుఁ దనకు దాసునిగఁ జేసినది. సంసారమను బురదలో నిరుకుకొంటిని. ఇఁక నీ లంపటులోఁ బడియుండుట మంచిదికాదు." అను నీ విచారము రాఁగానే ఆతఁడు దేవహూతితో నిట్లనెను :- "మానవీ ! నా కమండులు వెచ్చట నున్నది ?"

ఉపేక్షాస్వరమున దేవహూతి యిట్లనెను:- "మనకు కావలసినన్ని రత్నజటిత వెండి, బంగారు పాత్రలుండఁగా నీ సొరకాయబుఱ్ఱ యేల జ్ఞాపకమువచ్చినది ? పైన నెచ్చటనైనఁ గలదేమో ?"

గంభీరస్వరముతోఁ గర్దముఁ డిట్లనెను:- "అట్లుకాదు. దాని నిప్పుడే వెదకి తీసికొనిరా. నా ముంజత్రాటిని గూడ తీసికొనిరా."

దేవహూతి నవ్వుచు వెళ్ళిపోయెను. ఇద్దరు ముగ్గురు కూఁతురాండ్రను జుట్టుకొనిరి. ఆమె యొకరిని ముద్దులాడుచు, మఱియొక తెను బ్రేమించుచు, నింకొక తెను స్నేహముతో కస రుచు నామెపైకి యెక్కెను. పసిపిల్ల యామె వడిలో నుండెను. పైననున్న కమండులువును దీసికొనివచ్చి యిచ్చెను. ముంజ త్రాటిని రెండుచేతులతోఁ బట్టుకొని యొకపిల్ల నోటిలోఁ బెట్టు కొనెను. అందువలన నామె నవ్వుచుఁ దన పతి సమీపమునకు వచ్చి, కొంచెము వ్యంగ్యస్వరముతో నిట్లనెను:- ఇదిగో, మీ నిధి దొఱకినది. ఇవ్వేళ యివి యెట్లు జ్ఞాపకమునకు వచ్చినవి ?"

ముని యేమియును మాట్లాడలేదు. ఆతఁడు దివ్య పీతాంబరములను విడిచి పారవైచెను. ముంజత్రాటిని గట్టు కొనెను. అరఁటిపొత్తును గోఁచీ పెట్టుకొనెను. కమండులువును జేతితోఁ బట్టుకొని నిలుచుండి యిట్లనెను:- "మనుపుత్రీ ! జయ జయ సీతారామ్ ! నీ రాముఁడు వెళ్ళుచున్నాఁడు. ఇఁక నీ వీ సంసారమును జక్కఁబెట్టుకొనుము."

ఇంతవఱకు దేవహూతి యెగతాళి కనుచున్నా రనుకొను చుండెను. ఇప్పు డామెకు చైతన్యము కలిగెను. ఈ ముని మాట నిజమే. ఈతఁడు నాకు వశమైనాఁడనుకొంటిని. నా క్రీడా మృగమైనాఁ డనుకొంటిని. ఈతఁడు నా చేతిలో నాటబొమ్మై నాఁడు; ఎట్లాడించిన నట్లాడుననియు, నెచ్చట కూర్చుండుమనిన నచ్చట కూర్చుండుననియు ననుకొంటిని. కాని యిది యంతయు భ్రమయని తేలినది. ఈ విరాగి యెవ్వరికి లొంగఁడు. రా జెవ్వని కభ్యాగతుఁడు ? యోగి యెవ్వనికి మిత్రుఁడు ? ఆమె పిల్లను చంకలోనుండి దింపి, పీతాంబరమును మెడకుఁజుట్టుకొని మోఁక

రించి, చేతులు జోడించుకొని, హృదయములో భయమును జెంది, పైకి నవ్వుచు నిట్లనెను:- "ప్రభూ! ఇది మీ కనురూపముగనే యున్నది; కాని అబలనగు నన్నుఁగూడ చూడుఁడు."

విరక్తిస్వరముతో ముని యిట్లనెను:- "దేవహూతీ! ప్రపంచములో సబలులెవ్వరు? అందఱు నిర్బలులే. నిర్బలులకు బలము రాముఁడు. నీ వాతని నాశ్రయింపుము. సాంసారిక సంబంధము క్షణభంగురము. ఎవరెవరినిఁ గోపపడఁగలరు, ఎవరు కృపఁ జూడఁగలరు? చేయువాఁడును, జేయించువాడు నా శ్రీహరియే. ఆతని నాశ్రయింపుము. ఆతఁడు సమస్తచరాచర జీవులకును, అసంఖ్యబ్రహ్మాండములకును యోగక్షేమమును జూచువాఁడు."

దీనతాస్వరముతో దేవహూతి యిట్లనెను:- "స్వామీ! ఇదంతయును నిజమే; కాని నా సర్వస్వమును మీరే. స్త్రీలకు పతియే పరమేశ్వరుడు. నేను మీకు శరణాగతనైతిని. నాకు వే రావలంబనము లేదు. కావున ప్రభూ! నన్ను దిక్కు లేకుండఁ జేసి మీ రిప్పుడే వెళ్లవలదు."

ముని యిట్లనెను:- "నేను మీ తండ్రి సమ్ముఖమున మొదటనే చెప్పియుంటిని. వివాహమునకుఁ బూర్వము స్పష్ట శబ్దములతో సంతానము కలుగువఱకే నేను నీతో నుందునని చెప్పియుంటిని. ఇది నీకు జ్ఞాపకముండి యుండవచ్చును. సంతానము కలుగఁగానే నేను నా ముఖ్యకార్యములో నిమగ్నుఁడ నగుదునంటిని. వివాహమును నేను బ్రహ్మాజ్ఞచేఁ జేసికొంటిని. నేను మోక్షధర్మావలంబిని. వాసుదేవ పాదపద్మ మకరందపాన

మ_త్తమధుపములము. ఇప్పుడు నీ కొక్కరుగాదు, తొమ్మిది మంది పుట్టిరి. నీవు వీరినిఁ బోషించుకొనుము. నేను నా చిత్త మును భగవత్పరిచర్యయందు లగ్నము చేయుదును."

తల్లిదండ్రులయొక్క యీమాటలను విని పిల్లలందఱు నిటు నటునుండి యచ్చటికి చేరిరి. నేఁడు తమ తండ్రియొక్క యిట్టి విచిత్రవేషమును గాంచి పిల్లలాశ్చర్యమును జెందిరి. వారు మాటిమాటికి తండ్రిముఖమును ఆశ్చర్యముతోఁ జూచు చుండిరి. తమ తల్లి తండ్రిసమ్ముఖమున మోఁకరించి యేడ్చు చుండుటను గాంచఁగానే పిల్లలుకూడ కంట నీరు పెట్టసాగిరి. చిన్నపిల్ల లేడ్చుచుండిరి. అంతలోఁ బెద్దపిల్ల పెండ్లియీడుకు వచ్చెను. అమెకన్నియును దెలియును గావున నామెయుఁ గన్నుల నీరు కార్చుచుఁ దుడుచుకొను చుండెను. ఏడ్చుచు దేవహూతి యిట్లనెను :- " స్వామీ! నేను మిమ్ములను భగవ దారాధన చేయుట కడ్డగింపను. మీకు తపస్సే ధనము. మీ తపఃప్రభావముచే నేనీలోకములో సర్వశ్రేష్ఠమగు సౌభాగ్యశాలి ననుకొనుచున్నాను. నేను మీమీఁద దోషారోపణము చేయుట లేదు. నాతండ్రి సమ్ముఖమున మీరు చేసిన ప్రతిజ్ఞ నెఱవేర్చి తిరి. నాకు దివ్యసుఖముల నొసంగితిరి, సంతాన మిచ్చితిరి, ప్రేమించితిరి, సర్వస్వ మొసంగితిరి. కాని యిప్పుడు నాకింకొక కోరిక కలదు. దానిని గూడ ప్రసాదింపుఁడు. దాని నొసంగిన తర్వాత మీరు సంతోషముతో నిశ్చింతగా భగవదారాధన చేసికొనవచ్చును."

ముని యిట్లనెను :- " నీకేమి కావలయును ?" కన్ను లను దుడుచుకొని దీనతతో గద్గదస్వరమున దేవహూతి యిట్ల

నెను :- "ప్రభూ ! నేనబలను. ఒంటరిగా స్త్రీసగుటచే గృహ కార్యముల నెట్లు నెఱవేర్చుకొనఁగలను ? ఈ పిల్లలందఱు వివాహయోగ్యలైరి. వీరికి యోగ్యులగు వరులను వెదకుట కెచ్చటికి వెళ్లఁగలను? నే నీ విమానమునుండి క్రిందకు దిగ లేదు. దీనిమీఁదఁ గూర్చుండఁబెట్టి నన్నుఁ ద్రిలోకములు త్రిప్పితిరి. ఏముని నడుగుదును ? అబలనగు నామాట వినువా రెవరు ? బాలికలకు వివాహముకాకున్న మీకపకీర్తి కలుగును. కావున నీబాలికలను యోగ్యవరులకిచ్చి వివాహము చేయుఁడు. ఇంక ...... ఇంక ......" అనుచు దేవహూతి ఆగిపోయెను.

అప్పుడు ముని యిట్లనెను :- "ఇంక యేమిటి ? ఆ 'యింక'ను గూడ చెప్పుము. దాని నేల దాచెదవు?"

దేవహూతి కొంచెముగ సిగ్గుచెందుచు నిట్లనెను :- "స్వామీ ! 'ఇంక' విషయమును జెప్పుటకు నాకు సిగ్గగు చున్నది. శాస్త్రకారులు స్త్రీకి స్వాతంత్ర్యము లేదనిరి. బాల్యకాలమున స్త్రీ తల్లి, తండ్రి, గురువులయొక్క యధీన ములో నుండవలయును. వివాహము కాఁగానే భర్త యధీన ములోను, సంతానము కలుగఁగానే పుత్రుని యాశ్రమములో నుండవలెను. మీరు వెళ్లిపోయిన నా కాధార మెవ్వరైన నుండ వలెను. మీరు భగవదారాధనా ప్రభావముచే సంసారసాగర మును దరింపఁగలరు. మీకు సహధర్మచారిణియగు ధర్మపత్ని నయ్యు నే నెనుబది నాలుగులక్షల జీవయోనులలోఁ దిరుగు చుండిన నా యపయశస్సు మీకే. కావున నాయొక్క యుద్ధా రమున కేదైన నుపాయ మాలోచింపుఁడు. నాకాశ్రయమును జూపి వెళ్లుఁడు. ఈ యాడుపిల్ల లన్యగృహములకు వెళ్లువారే

కదా! ఎక్కలు రాఁగానే వీరంద ఱవరి త్రోవను వారు పోవు వారే. తల్లి దండ్రులను మఱచిపోవుదురు. స్త్రీల కాశ్రయము పుత్రుఁడే; ఆతఁడు జీవించియుండఁగాఁ బోషించును. మరణించిన తర్వాతఁ బున్నామనరకమునుండి యుద్ధరించును. చాల మంది యక్కఱలేదు కాని, ఒక్క పుత్రభిక్షను బెట్టుఁడు."

పుత్రశబ్దము వినఁగానే కర్దమమహామునికి భగవానుఁ డొసఁగిన వరము జ్ఞాపకమునకు వచ్చెను. అంత నాతఁడు మిక్కిలి ప్రేమతో నవ్వుచు నిట్లనెను:- "ఇంకను నీకు సంతానము చాలలేదేమి ?"

దేవహూతి సిగ్గుతో నిట్లనెను:- "స్వామీ ! తృష్ణ యెన్నటికిని శాంతింపదు. ధన సంతానముల కింతవఱకు తృప్తి చెందినవారు లేరు. కాని యిప్పుడు నేను లోభవశమునఁగాదు, ముక్తికొఱకై పుత్రునిఁ గోరుచున్నాను. భగవంతుని విచిత్ర మాయ యెట్టిదో తెలియునా? సమస్త సిద్ధులను, ఐశ్వర్యములను గలిగియుండియు, నేను విషయభోగములలో మునిఁగి యుంటిని. మిమ్ములను ముక్తిసంబంధమగు ప్రశ్నయైన నడుగ లేదు. ఎట్లులో సత్సంగము జరిగినది. తెలియక విషమును దినినఁ జచ్చునట్లు, ఎఱుఁగక అమృతమును సేవించిన నమరుఁ డగును. అదేవిధముగ మీ సత్సంగము వ్యర్థము కారాదు. కావున నాయీ జీవితము సార్థకము కావలయును. ఈశరీరముచే మహాపురుషులను యథాశక్తిగ సేవించి, యేపనినిఁ జేసినను భగవత్ప్రాప్తి నిమిత్తమే సత్సంగము చేయుటలోనే జీవితమునకు సార్థక్యము కలదని తెలిసికొనవలయును. మాయాచక్రములోఁ బడి నేనట్లు చేయలేదు. నా యీ లోటు యిప్పుడు

తీరవలెను. ఇప్పుడు నేను వివేక వైరాగ్యయుక్తురాలనై భక్తితో నా యంతర్యామియగు నఖిలేశు నారాధించి తల్లీన మగుదును.''

తన భార్య పలుకు యిట్టి వివేక వైరాగ్యపూర్ణమగు వాక్యములను విని కర్దమమహామునికి మిక్కిలి సంతోషము కలిగి, ఆమె నోదార్చుచు నిట్లనెను:– "మనుపుత్రీ! అనిందితా! అనఘా! స్వాయంభువ మనుపుత్రి కీ వచనము లనురూపముగనే యున్నవి. నీవు భయపడకుము. నీకు దుర్గతి కలుగదు. నా సత్సంగ మెన్నటికిని నిష్ఫలము కాఁజాలదు. నీవు యెనుబది నాలుగులక్షల జీవరాసుల సంసారభ్రమణముఁలోఁ బడవు. నేను నీకు పుత్రునొసంగెదను. అట్టి యిట్టి పుత్రుఁడు కాఁడు. స్వయముగ శ్రీమన్నారాయణుఁడు నీభక్తికి సంతోషించి పుత్రరూపమున నీగర్భమున నవతరింపఁగలఁడు. నీ వవతారమునకు జననివి, జగన్మాత వగుదువు. పంచభూతములు, సూర్యచంద్రు లున్నంతవఱకు లోకములో నీకీర్తిని గానము చేయుచుందురు."

అత్యంతహర్ష స్వరమున దేవహూతి యిట్లనెను:–"ప్రభూ! నేనిట్టి సౌభాగ్యమునకు యోగ్యురాల ననుకొనలేదు. నేనొక అబలను. అఖండబ్రహ్మాండములను ధరించిన సాక్షాత్తుగ విశ్వంభరుఁడగు భగవంతు నెట్లుదరములో ధరింపఁగలను? చీమ సుమేరువు నెట్లు తన శిరస్సున మోయఁగలదు?"

మిక్కిలి ప్రసన్నతతోఁ గర్దనుముని యిట్లనెను:– "దేవీ! నీవు నా మాటలను విశ్వసింపుము. నీవు నీ సామర్థ్యముచే నాతనిని ధరింపఁజాలవు. ఆతఁడు కృపతో నీ గర్భమునఁ బ్రవే

శించినపుడు, ధారణచేయుశక్తియు నాతఁడే ప్రసాదింపఁగలఁడు. వరదాన మొసంగు సమయమున స్వయముగ శ్రీమన్నారాయణుఁడు తన శ్రీముఖముద్వారా నీ వీర్యముద్వారా నా యంశమున దేవహూతి గర్భమున నవతరింపఁగలనని నాకు మాట యిచ్చియుండెను."

ఆనందముతోఁ బ్రకాశించు దేవహూతి తన్నుఁ దాను సంబాళించుకొని యాగియాగి యిట్లనెను:— "స్వామీ! ఇప్పుడు నేనేమి చేయవలయును? ఏ యే సంయమ, నియమ, వ్రతోపవాసము లొనర్పవలయును? నా కర్తవ్యమును బాగుగా నుపదేశింపుఁడు."

కర్దముఁ డిట్లనెను:— "దేవీ! పతిసేవ చేయనిదానికి, నానావ్రతములను బాలింపనిదానికి, సర్వాత్మభావనచే సర్వేశ్వరుఁడగు శ్రీహరి నారాధింపనిదానికి భగవంతుఁ డుద్భవింపఁడు. నీకు జన్మజన్మాంతరములందు గొప్ప పుణ్యము కలదు కావుననే యిట్టి దేవదుర్లభమగు సౌభాగ్య మబ్బినది. ఇప్పుడు నీవు జాగ్రత్తగ సమస్తేంద్రియములను దమించుము. అతిథి అభ్యాగతులకును, అంధులకును, గుంటివారికిని, ఆఁకలిగొన్న వారికిని, దరిద్రులకును, దుఃఖులకును నన్నదాన మొనర్పుము. సత్పాత్రులకు వివిధములగు మణిమాణిక్యము లిమ్ము. అందఱ కోర్కెలను నెఱవేర్చుము. నియమముతో నిండుము. తపస్సు చేయుము. ఇట్లు చేసిన శీఘ్రముగ భగవంతుఁడు నీ గర్భమునఁ బ్రవేశింపఁగలఁడు."

దేవహూతి యిట్లనెను:— "స్వామీ! నా సంసారబంధన మెట్లు పోఁగలదు?"

త్వరగా ముని యిట్లనెను:- "ఇంకను సంసార బంధన మున్నదా? సాక్షాత్తుగ శ్రీహరియే వచ్చుచుండ సంసార మెట్లుండఁగలదు? సూర్యుఁ డుదయించినను అంధకార ముం డునా? రాత్రి గడచినను తారలుండునా? గంగలోఁ మునిఁగిన మీఁదటకూడ పాపములుండునా? శ్రీహరి యవతరించి నీ సంశ యము లన్నిటిని ఛేదింపఁగలఁడు. లోకములోఁ దల్లిదండ్రులు పుత్రున కుపదేశించుచుందురు; కాని నీకు నీ పుత్రుఁడే యుప దేశింపఁగలఁడు. ఆతఁడు నిన్ను నిమిత్తముగఁ జేసికొని లోక మున కంతకు నుపదేశించును. వానివలన నీవు తరింపఁగలవు. వాటిని శ్రవణ మనన మొనర్చుటచే లోకములో నసంఖ్యాకు లగు ప్రాణులు తరింపఁగలరు. వారును తత్క్షణము భగవన్మాయను దాఁటుదురు."

మైత్రేయముని విదురునితోఁ నిట్లనెను:- "విదురా! తన భర్త వలుకు యీమాటలను విని దేవహూతి పరమప్రసన్నయై, పతి చెప్పిన నియమములను సావధానముగఁ బాలించుచుండెను."



# కపిలావతారము

రజో వీర్యములచే శరీర మేర్పడును. సంస్కారములవలన నంతఃకరణ మేర్పడును. గర్భాధానకాలమునఁ దల్లిదండ్రుల కే సంస్కారములుండునో సంతానమందును బీజరూపమున నట్టి సంస్కారములే యుండును. ఆ సంస్కారములచే జాతికరణము, నామకరణము మొదలగు సంస్కారముల ద్వారా పరిపుష్టము,

దృఢమగును. అందువలననే వర్ణాశ్రమధర్మమందు సంస్కార ములు, రజోవీర్యముల శుద్ధిమీఁద నత్యధిక బలమీయఁబడినది. ఇట్టి కన్యకతో వివాహము చేయవలెను. దాని కుల మట్టిదిగా నుండవలెను. ఆ కులమందు దురాచార ముండరాదు. శుద్ధ కులముగ నుండవలయును. తమ కులముకూడ శుద్ధముగ నుండవలయును. శుద్ధ సంస్కారముల ద్వారా వేదమంత్ర ములచే గర్భాధానములు చేయవలెను. ఆ యా తిథులలో నా యా కాలమందు చేయరాదు. ఇట్లు చేయుటకు ముఖ్యోద్దే శ్యము భావిసంతానమునకు శుద్ధసంస్కారము లేర్పడుటకే. పాపసంతానము కలవారియొక్కయు గర్భాధానము అవైధ రీతిగాఁ జేయువారియొక్క సంతానము సాధారణముగఁ బాప ప్రవృత్తికలవారుగ నుందురు. వారికి పరమార్థమందు రుచి కలు గదు. విషయసుఖములనే సర్వస్వముగ భావించి వారు ధర్మా ధర్మములను బొందుటకు జీవనపర్యంతము ప్రయత్నశీలు రగు దురు. అందువలననే కలియుగమందు వేదములు, సచ్ఛాస్త్ర ములు, పరమార్థపథము లుప్తప్రాయ మగును. ఏలననఁగా నందఱియొక్క ప్రవృత్తు లధర్మము లగుటవలన రజోవీర్యముల శుద్ధిమీఁద దృష్టియుండుటలేదు. గమ్యాగమన విచారము లేదు. సంస్కార పవిత్రతలేదు. విషయభోగప్రాబల్య ముండు టచే స్వేచ్ఛాచార మధికమగుచుండెను.

భగవానుఁడే దంపతులను నిమిత్తముగఁజేసికొని యవ తరించునో వారు సాధారణదంపతులు కారు. జన్మజన్మాంతర ముల అసంఖ్యపుణ్యములచే, శుభకర్మలచే, వివిధధర్మాచరణ ముచే నిట్టి సౌభాగ్యము ప్రాప్తించును. శ్రీహరి కర్మాధీనుఁడు

కాకున్నను, కర్మభోగములకై యవతరింపకున్నను, అతనిని పుణ్యకర్మలచే, వివిధధర్మములద్వారా ప్రాప్తింపలేకపోయినప్పటికి, ఆతని ప్రాప్తికి ఏకమాత్రకారణము ఆతని కృపయే. ఎవరినాతఁడు కృపచూచునో, ఎక్కడ అవతరించునో, ఎవనికి దర్శనమొసంగునో, ఈ విషయము లాతనికి తప్ప యింకెవరికిని దెలియదు. అయినను సింహక్షీరములు బంగారుపాత్రలోనే నిలువఁగలవు. భగవంతుఁడును, తపఃపూతులు, ధర్మాచరణనిరతులు, పరమపుణ్యాత్ములు, మహాసంస్కారులు, శ్రేష్ఠ సదాచారులగు దంపతులం దవతరించును. ఆతని కృపాభాజనులగువారు, తన జన్మకు నిమిత్తులైన దంపతులు మొదటినుండియు ధర్మప్రవృత్తులగుదురు. కాని యవతరణసమయమున వారి మనస్సు సదా శ్రీహరి చరణములం దుండును.

మైత్రేయమహాముని యిట్లనెను:- "విదురా! దేవహూతి తన పతివలన సాక్షాచ్ఛ్రీహరి యవతరించునను మాట వినఁగానే, ఆమె సంయమ, నియమములతో నుండెను. జన్మరహితుఁడు, నిరంజనుఁడు, నిర్వికారుఁడు, జగద్గురు పరాత్పరుఁడగు పురుషోత్తముఁడు తనకు దర్శన మొసంగుననియు, తన గర్భమునఁ బుత్రరూపమున నుత్పన్నమగు ననియు స్మరణకు రాఁగానే యాతని రోమరోమములు నిక్కబొడిచెను. ఆమె నిద్రించినను, మేల్కొన్నను, కూర్చుండినను, నిలుచుండినను, తినుచున్నను, త్రాగుచున్నను అచింత్యశక్తిగల సర్వేశ్వరుని ధ్యానముచేయుచుండెను. ఈ విధముగ శ్రద్ధా సంయమములతో నిరంతరము పురాణపురుషుని ధ్యానముచేయుచుఁ గాలమును గడుపుచుండెను."

ఇప్పుడు భగవదావిర్భావకాల మాసన్నమయ్యెను. ముందుగా భగవంతుఁడు కర్దమప్రజాపతి వీర్యమందు ప్రవేశించెను. అధరారణి, ఉత్తరారణుల సంఘర్షముచే నగ్నిదేవుఁడుత్పన్నమైనట్లు దేవహూతి గర్భమునుండి సాక్షాచ్ఛ్రీహరి కపిలరూపమున నవతరించెను. భగవదావిర్భావ సమయమున సర్వత్ర ఆనందము వ్యాపించెను. చరాచర జీవులు సుఖమును బొందిరి. ఈతఁడు జ్ఞానావతారమగుటచే విశేషించి ముముక్షువులకు, జ్ఞానులకుఁ బరమానందము లభించెను. లుప్తమైన సాంఖ్య జ్ఞాన ప్రచారము కొఱకై భగవంతుఁ డీకపిలరూపమును ధరించెను. ఆ సమయమున దేవత లాతనిపైఁ బుష్పవృష్టిని గురిపించిరి. ఆకాశమున గంధర్వులు పాడిరి. దేవతలు దేవదుందుభులను ప్రమోగించిరి. అప్సరసలు నృత్యములు చేసిరి. మేఘము లురుములద్వారా తమ యానందమును ప్రకటించెను. ముముక్షువుల మనస్సులలో స్వాభావిక ప్రసన్నత వ్యాపించెను. ప్రసన్నతాకారణమున సముద్రజలము లెగురుచుండెను. అగ్నిహోత్రములు స్వతః ప్రజ్వలించుచుండెను. దశదిశలను ఆనందము వ్యాపించెను. ప్రాణుల హృదయములు హర్షభరితములయ్యెను.

కొడుకుకంటె మనుమఁడు పుట్టిన యానందమెక్కువ. కర్దమునకు సాధారణ పుత్రుఁడు కాదు, కేవలము సాక్షాచ్ఛ్రీమన్నారాయణుఁడే యవతరించెనని బ్రహ్మ వినఁగానే త్వరత్వరగా బ్రహ్మలోకమునుండి కర్దముని యాశ్రమమునకుఁ బోయెను. ఆతఁడు తన నాల్గు శిరస్సులందు ప్రకాశించుచున్న దివ్యమకుటమును ధరించియుండెను. కమండులువు, పుస్తక

మును బట్టుకొని హంసను ద్వరగా నడువవలసినదని యదలించెను. ఆతఁడింత వ్యగ్రతతోఁ బోవుటను గాంచి యాతని మానసపుత్రులు తొమ్మిదిమంది మిక్కిలి యుత్సాహముతో నిట్లనిరి:– "ప్రభూ! మీ రింత శీఘ్రముగా నెచ్చటికి వెళ్లుచున్నారు?"

బ్రహ్మ విస్మయభావమును బ్రకటించుచు నిట్లనెను:– "మీకేమియుఁ దెలియదా యేమి? నా ఛాయవలనఁ బుట్టిన నా మానసపుత్రుఁడగు కర్దమునకు సాక్షాచ్ఛ్రీహరి యుద్భవించి నాఁడు. ఆతఁ డందఱ మనోవాంఛలను బూర్తి గావించును. నిర్మలురమై నిష్కపటభావముతో నాతని జేరితిమా యుష్మ డన్ని కోరికలు తక్షణము నెఱవేరఁగలవు."

ఈ మునులందఱ మనస్సు భగవత్ప్రేరణచేఁ బ్రవృత్తి ధర్మమును స్వీకరించుటయందును, వివాహమాడుటయందును లగ్నమైనది. తమకుఁగూడ వివాహమైనచోఁ దాముకూడ బ్రహ్మతోఁగూడి శ్రీహరి దర్శనమునకు వెళ్లవచ్చుననుకొనిరి.

ప్రతివాని హృదయములోని విషయములను దెలిసికొను బ్రహ్మ వారి భావములను గ్రహించి శీఘ్రముగ నిట్లనెను:– "మీరును నావెంట వచ్చిన మంగళమూర్తియగు మధుసూదనుఁడు మీ మనోవాంఛలను నెఱవేర్చఁగలఁడు. మీ రందఱు నితరుల మనోవాంఛలను నెఱవేర్పఁగల్గుదురు." ఇది వినఁగానే ఆ తొమ్మిదిమంది మహర్షులు బ్రహ్మవెంట వెడలిరి.

సరస్వతీనదిచేఁ జుట్టుకొనఁబడిన బిందుసరోవర సమీపమునఁ గర్దమమహాముని దివ్యాశ్రమము కలదు. భగవానుని ప్రేమాశ్రువులచే నిర్మింపఁబడిన యీ తీర్థము ప్రాణుల సమస్త

యశుభములను నాశము కావించును. కర్దమమహాముని భగవానుని జన్మోత్సవప్రయత్నములో నుండఁగా నాకాశమునుండి దిగుచున్న బ్రహ్మ కనఁబడెను. ఇది చూడఁగానే మిక్కిలి యానందముతో లేచి నిలువఁబడెను. బ్రహ్మ రాఁగానే నేల మీఁదఁ బడి సాష్టాంగనమస్కారమును గావించెను. తర్వాత నన్యమహర్షులకుఁ గూడ స్వాగతసత్కారములు కావించెను. కర్దముఁడు చేసిన పూజలను మునులతోఁగూడి బ్రహ్మ గ్రహించి నవ్వుచు నిట్లనెను:- "వత్సా! కర్దమా! నేను నీయెడలఁ బ్రసన్నుఁడ నైతిని. నీవే యథార్థముగ నా సేవ చేసితివి. ఈ బాహ్య పూజనముకంటె నాజ్ఞాపాలన రూపమగు నాంతరిక పూజయే సర్వశ్రేష్ఠ మనుకొనుచున్నాను."

చేతులు జోడించుచు వినయభావముతోఁ గర్దమమహాముని యిట్లనెను :- "స్వామీ! నేను మీకేమియు సేవచేయ లేదు. మీరు నన్ను మీసేవాశుశ్రూషలకుఁగూడ తీరనంతటి సంసారజంజాటములోఁ బడవైచితిరి. ఈ కన్నులు పిల్లలందఱకు చమురు మొదలైనవి చూచుటకే సరిపోవుచున్నవి."

ఇది విని బ్రహ్మ యిట్లనెను :- "శారీరకసేవ యేమంత పెద్దసేవ కాదు. తల్లిదండ్రులు,గురువులొసంగు ఆజ్ఞలను ఇదిగో అదిగోనని అడ్డుచెప్పక చేయుటయే నిజమగు సేవ. నీవు నా యాజ్ఞను నిష్కపటభావముతోఁ బాలించితివి. నాకు సృష్టి రచనమందు ఆశాతీతమగు సహకారమును బ్రసాదించితివి. ఇదియే నీవుచేసిన సర్వోత్తమ సేవ."

బ్రహ్మ యిట్లనుచుండఁగనే కర్దమ మహామునియొక్క తొమ్మిదిమంది కుమార్తెలువచ్చి లోకపితామహునకు నమస్కా

రించిరి. అత్యంత ప్రేమతో నా బాలికల శిరస్సునఁ జేతితో నిమురుచు బ్రహ్మ యిట్లనెను :- " ఈ నీపిల్లలు మంచి సుశీలురు. మంచి సరళస్వభావము కలవారు."

కర్దముఁ డిట్లనెను :- " ఏమి చేయుదును స్వామీ ! వీరందఱును వివాహయోగ్యులైరి. నాకు వీరి చింత యెక్కువైనది. వీరికి మంచిమగలు దొరకవలయుననియు, వీరి భవిష్యజ్జీవనము సుఖమయముగ నుండవలయుననియు నా కోరిక. వీరికి పెండ్లిళ్లయి, వారి వారి యిండ్లకు వారుపోయినచో నాకు గృహస్థజీవనము పూర్తియైనట్లే."

బ్రహ్మ నవ్వుచు నిట్లనెను:- "నీ విన్నాళ్లు భగవదారాధన చేసితివి. ఆతనిని సాక్షాత్కరింపఁ జేసికొంటివి. ఆయన వలన దుర్లభ వరములనుగూడ పొందియుంటివి. అట్లయ్యు నింకఁ జింతఁబొందుచున్నావు. విశ్వంభరుఁడు పిపీలికము మొదలు నావఱకు అందఱయోగక్షేమముల నరయుచుండును.అట్టివాఁడు నీపనులను మఱచిపోవునా ? భగవంతుఁడు తనభక్తుని కార్యములను స్వయముగఁ జేయును. వీరందఱు నీకుమార్తెలేనా ?"

కర్దముఁ డిట్లనెను :- " అందఱు మీముందఱనే యున్నారు. పూర్తి సేనయే. నవగ్రహములవలె నీతొమ్మిది మంది నన్నుఁ జుట్టుకొనియే యున్నారు."

వచ్చిన తొమ్మిమంది మహర్షులకు పద్మగంధము వెలువడుచున్న వారిశరీరకాంతులను జూడఁగనే ఆశకలిగెను.బ్రహ్మ యనుమతియు [illegible] వెంటఁ గొనివచ్చెను. అందువలన

నాతఁడిట్లనెను. "వీరు తొమ్మిదిమంది ఋషులు. వీరికి నీపుత్రికల నిచ్చి వివాహము కావింపుము."

కర్దముఁ డిట్లనెను:— "స్వామీ! ఇంట నుండఁగనే దొఱకిరి. ఇది నా యదృష్టము. ఒకరు ఇద్దరు కాదు. తొమ్మిదిమందికి తొమ్మిదిమంది దొఱకిరి. ఇప్పుడిఁక నే ఋషి కే కన్య నీయవలయునో తెలవీయుఁడు."

బ్రహ్మ శీఘ్రముగ నిట్లనెను:— "వీరిలో నే ముని యెవరిని వరించుచో వారికిమ్ము. ఇదంతయుఁ దరువాత జరుగఁగలదు. ముందుగా నీకుఁ బుత్రరూపమునఁ బుట్టిన మహాత్ముని జూడ నిమ్ము. నేను చాలకార్యములను వదలివచ్చినాను. నాకు తొందఱ పనియున్నది. చతుర్దశభువనములయొక్క — మొత్తము బ్రహ్మాండముయొక్క పని చూడవలయును."

బ్రహ్మ వాక్యములను విని కర్దమమహాముని మిక్కిలి యాదరముతో లోకపితామహుని తన భార్యాగృహమునకుఁ గొనిపోయెను. పితామహుఁడు రాఁగానే దేవహూతి ముసుఁగు సవరించుకొని, సిగ్గుచేఁ బ్రణామము కావించి యొకప్రక్క నిలుచుండెను. అప్పుడు బ్రహ్మ యిట్లనెను:— "అమ్మా! ముసుఁగు సవరించుకొనవలసిన పనియేమున్నది? నాకును సమస్తజగత్తునకును బితయగువాడు నీ గర్భమునఁ బుట్టినప్పుడు నీవు లోకమాత వైతివి. నీవు మాకు బూజనీయవు. ఈతఁడు సామాన్య పుత్రుఁడు కాఁడు. వైకుంఠాధిపతి శ్రీహరి. ఈతని కేశములను జూడు మెట్లు సువర్ణముగ నున్నవో. కమలములవంటి సుందర విశాలనేత్రములు, వజ్రాంకుశ ధ్వజాది చిహ్నములు గలిగి లేత రావియాకువలె నెఱ్ఱనై కోమల మృదుపాదములు ఇపన్నయు

భగవత్త్వమునకుఁ జిహ్నములు. ఈతఁడు శాస్త్రజ్ఞానముచేతను, ననుభవజ్ఞానముచేతను నందఱసంశయవిచ్ఛేదముచేయఁగలఁడు."

ముసుఁగు చాటుననుండి పెద్దపిల్లద్వారా దేవహూతి యిట్లనెను:- "స్వామీ! అందఱ సంశయ విచ్ఛేదమును గావించును. నిజమే. నామీఁదఁగూడ కృపచూపునా ?"

ఇది విని బ్రహ్మ నవ్వి యిట్లనెను:- "అమ్మా! మును ముందుగా నీతఁడు నీకే యుపదేశమొసంగి సంసారసాగరమును దాఁటెంపఁగలఁడు. ఈతఁడు సిద్ధగణముల కధీశ్వరుఁడును, సాంఖ్యాచార్యస్వామి కాఁగలఁడు. నీకీర్తి నమరము గావించును. మీరిద్దరును తపోవైరాగ్యములచే నీతనినిఁ బడసితిరి; కావున నీతఁడు త్యాగి, విరాగి రూపమున విచరించుచుండును."

సిగ్గుపడుచు దేవహూతి యిట్లనెను:- "అయితే స్వామీ! మంచిదే. సంతోషవిషయము. కాని పంచాంగమును గాంచి యీతనికి నామకరణమును జేయుఁడు."

ఇది విని బ్రహ్మ పకపక నవ్వి యిట్లనెను:- "అమ్మా! ఎంత తెలివితక్కువదానవమ్మా! ఈతని కొక్క నామమ్మెనఁ జెప్పవచ్చును. ఈతని కనంతనామములు. ఈతఁ డనంతనామము లతోఁ బిలువఁబడును. అయినను ఈతఁడు కపిలనామమునఁ బ్రసిద్ధుఁడు కాఁగలఁడు. నీ యశము నీ లోకమున విఖ్యాతము కావించును."

మైత్రేయమహాముని యిట్లనెను:- "విదురా! ఈ విధముగ నబ్జాసనుఁడు భార్యాభర్తల నిరువురను సమాధానపఱచి తన హంసవాహనము నెక్కి బ్రహ్మలోకమున కెగిరిపోయెను."

# కపిలస్తుతి

భోగములలో సుఖము వాటియందు దాసక్తి యున్నంత వఱకే యుండును. విషయములందలి యాసక్తి పోఁగానే యా విషయములే విషములుగఁ దోఁచును. ఆసక్తి నాధారముచేసి కొనియే యీ ప్రపంచము నడుచుచున్నది. సంసారముపై వైరాగ్యము కలిగిన కొలఁది సంసారము నాశముగలదిగ, క్షణ భంగురముగ, ననిత్యముగ, మిథ్యగఁ దోఁచును. ఆత్మసంబంధ ముచే మన మీ శరీరమందు నానావిధ సంబంధములను స్థాపించు కొందుము. ఇతఁడు నా తండ్రి, ఈమె నా తల్లి, ఈతఁడు భర్త, ఈమె భార్య, వీరు సోదరులు, వీరు సంబంధులు అని యిట్లు బ్రతికినన్నాళ్లనుకొనుచు, నీ శరీరమునుండి జీవాత్మ యెగిరిపోఁ గానే యీ సంబంధములన్నియు నెగిరిపోవును. ఇఁక నా శరీ రము చెడ్డగఁ దోచును. ఎంతత్వరగా వీరలె నంతత్వరగా బయట పారవేయుటకుఁ బ్రయత్నించుచుందురు. ఏ శరీరమునుగాంచి యిదివఱకు మమకారము చెందుచుండిరో అదియే యిప్పుడు భయానకముగఁ దోఁచుచుండెను. ఈ విషయము లనిత్యములను జ్ఞానము కలిగిన వారికి సాంసారిక లంపటలన్నియు భారముగఁ దోఁచును. కర్తవ్యవశముచేఁ గొన్నిదినములున్నను, ఆదినము లను లెక్కపెట్టుకొనుచుండును.

మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురా! కర్దమ మహామునికి కపిలమహాముని జన్మించినపుడు బ్రహ్మదేవుఁడు ఆదంపతుల నిరువుర నోదార్చి వెళ్ళిపోవునపు డీ తొమ్మిదిమంది కన్యకల నీ తొమ్మిదిమంది మహర్షులకిచ్చి పెండ్లిచేయుమని యాజ్ఞాపింపఁగా గర్దముఁ డట్లే యొనర్చెను. ఆతనికి కళా,

అనసూయా, శ్రద్ధ, హవిర్భూ, గతి, క్రియా, ఖ్యాతి, అరుంధతి, శాంతియను తొమ్మిదిమంది కన్యలుండిరి. అందువలన నీతొమ్మిది మందిని తొమ్మిదిమంది మహర్షుల కొసంగెను. మరీచిప్రజాపతికి కళను, అత్రికి అనసూయ నొసంగెను. వీరి కడుపుననే భగవంతుఁడు దత్తాత్రేయరూపమున నవతరించెను. ఆమె పాతివ్రత్యము లోకములో విఖ్యాతిచెందినది. అంగిరముని శ్రద్ధ నొసంగెను. శ్రద్ధారహిత కార్యములు సఫలములు, శ్రేష్ఠములు కాఁజాలవు. పులస్త్యుఁడు హవిర్భూదేవిని వివాహమాడెను. ఆమెవంశమునఁ గ్రూరకర్మలగు రాక్షసు లుదయించిరి. పులహుఁడు గతిని స్వీకరించెను. ఆమె మూలముననే విశ్వమంతయు నిట్లుండెను. గతిలేకున్న నందఱు కగతియే. క్రియాదేవిని గ్రతువున కొసంగెను. ఆ క్రియాసాహాయముననే సమస్త యజ్ఞాదిక కార్యములు జరుగుచున్నవి. భృగువునకు ఖ్యాతీదేవినిచ్చి వివాహమొనర్చెను. ఆఖ్యాతి కొఱకే లోకములో నందఱు నువ్విళ్లూరుచుందురు. ఈ వంశములోనే పరశురాముఁ డుదయించెను.కర్దముఁడు వశిష్ఠునకు అరుంధతి నొసంగెను. ఆమె పతివ్రతలలో శ్రేష్ఠురాలు. సప్తర్షి మండలములో నిప్పటికిని దన పతితో నరుంధతి వెలుగుచునే యున్నది. ఈ వశిష్ఠుఁడే సూర్యవంశమునకుఁ బురోహితుఁ డయ్యెను. అథర్వమునికి శాంతిదేవి నొసంగి వివాహమొనర్చెను. ఆమె ద్వారా యజ్ఞాదికర్మలన్నియు విస్తారమైనవి. శాంతిలేని కర్మలు వ్యర్థములు. అందువలననే సమస్త ఋషిసంవాదములకు చివర మూఁడుసార్లు శాంతి శ్శాంతి శ్శాంతిః అని యుచ్చరించెదరు.

తమ కనురూపులగు బతులను బడసి కన్యకలు చాల సంతసించిరి. ఋషిగణమును గృతకార్యులైరి. వారికి భగవద్దర్శనము వలనఁ బ్రత్యక్షఫలము లభించినది. వేలకొలఁది సంవత్సరములు సమాధిలోనుండి భగవద్దర్శనము కొఱకు తపించుటయేమి, యీ ప్రగాఢ సంబంధ మేర్పడుట యేమి ? భగవంతుని శరణువేడక అటునిటు శ్రద్ధావిహీనులై తిరుగువారు వ్యర్థముగఁ జింతచెందుచున్నారు. భగవంతుని ఆశ్రయించినవారి కన్నియు సఫలములగును. వారి కింకొకచోట యాచన చేయవలసిన పనిలేదు. కల్పతరువు నీడను గూర్చుండి భుక్తిని బొందవచ్చును; కాని కృష్ణకల్పతరు ఛాయయందు భుక్తి ముక్తులు రెండును జేతులు కట్టుకొని నిలువఁబడును. భగవద్భక్తులు భగవత్సేవను వదలి ముక్తిని గోరరు. భగవంతుఁ డెవనినిఁ గృపఁజూచునో ఆతఁడే భగవంతుని సమీపమునకుఁ బోఁగలఁడు. ఆ ప్రభువు కృపవలననే లభించును. కావున సదా సర్వదా ఆతని కృపకొఱకు ప్రతీక్షింపవలయును.

ఈ విధముగఁ గర్దమ మహాముని తన కూఁతుండ్రకు వివాహము కావించి,గృహస్థచింతనుండి విముక్తుఁడై నిశ్చింతుఁ డయ్యెను. ఇప్పు డాతఁడు చేయవలసిన దేమియును లేదు.

ప్రతి గృహస్థునకును ముఖ్యమైన అభిలాష తనకు పుత్రుఁడు జన్మింపవలయు ననియుఁ, జచ్చిన తర్వాత శ్రాద్ధ తర్పణములు, పారలౌకిక క్రియలు జరుపవలయుననియు, నరకమునఁబడిన పితరుల నుద్ధరింపవలయుననియు, వంశపరంపర నక్షుణ్ణము కావింపవలయునని యుండును. కర్దమున కొక పుత్ర రత్నముకూడ జన్మించెను. పుత్రుఁడు సాధారణపుత్రుఁడు

కాదు. స్వయముగ నిర్గుణ నిరాకారుఁడగు శ్రీహరి, సగుణ సాకారస్వరూపమును ధరించి యవతరించెను. ఇది స్మరణకు రాగానే ఆతని హృదయ మానందముతో నిండిపోవుచుండెను. ఆతఁడు ప్రేమభరితాంతఃకరణముచేఁ గపిల భగవానుని శరణము చెందెను.

కొంతకాలమునకుఁ గపిలుఁడు పెద్దవాఁ డయ్యెను. ఆతనిలో బాలసులభమగు చాంచల్యము లేదు. బాల్యకాలము నుండియు నాతఁడు శాంతుఁడు, గంభీరుఁడు, మననశీలుఁ డయ్యెను. జాములకొలఁది వనప్రదేశములం దేకాంతమునఁ గూర్చుండి తత్త్వవివేచనము చేయుచుండెడువాఁడు. ప్రకృతి పురుషసంబంధమగు గూఢతమ రహస్యములను గూర్చి విచారణ చేయుచుండెడువాఁడు.

ఒక దినమున నొక పెద్ద వటవృక్షఛాయయందు తన కుమారుఁడు ధ్యానమగ్నుఁడై యుండుటను గర్దముఁడు కాంచెను. ఆతని చిన్నచిన్న జడలు వాయువశమున విడిలిపోవు చుండెను. కమలములవంటి నేత్రములు తెఱవఁబడియే యుండెను. ముఖమండలమందు అద్భుత దైవీశాంతి విరాజిల్లు చుండెను. ఆతఁడు పద్మాసనమునఁ గూర్చుండి, యేదియో గంభీర విషయమును గూర్చిన విచారణలో నిమగ్నుఁడై యుండెను. కర్దమమహాముని తన కుమారుఁడగు కపిలుఁ డిట్లేకాంతమున నుండుటను గాంచి అంతులేని యానందమున మునిఁగెను. ఆతఁడిట్టి సమయమునకే కనిపెట్టుకొని యుండెను. ఆతని మనస్సు సంసారమందు లేదు. సంసారబంధమును గలిగించు వస్తువులు ఆతనికిప్పుడు లేనేలేవు. ఆతపిల్లలందఱు తమ

యిండ్లకు పోయిరి. దేవహూతి సదా భగవదారాధనయందే మునిఁగియుండెను. కపిలుఁడు బాల్యమునుండియే విరక్తికల వాఁడు. కాని లేశమాత్ర మహంకారము లేకపోలేదు. ఇది నా ఇల్లు, ఇది నా భార్య, దీనిని నేను పోషింపవలయును. ఈతఁడు నా పుత్రుఁడు, నే నీతనికి తండ్రిని అను నిట్టి సూక్ష్మాతిసూక్ష్మాహంకారమును గూడ నాశము చేయఁదలఁచెను. ఆతఁడు మానసికముగానే కాదు, శారీరకముగఁ గూడ నిట్టి సంబంధమును ద్రెంపఁదలఁచెను. కాని భగవదాజ్ఞ లేక యిది యెట్లు జరుగఁగలదు ? ప్రభువు తలఁచుకొనిన నన్నియు నెఱవేరును. లేకున్న గొంతులో గుటకలు మ్రింగుచుండవలసినదే. కావున భగవదాజ్ఞను బొందుటకు ధ్యానమగ్నుఁడగు కపిలుని సేవింపఁ బోయెను. ఆయన దగ్గఱకుఁబోయి భగవంతునకు సాష్టాంగ దండప్రణామము కావించెను.

తన తండ్రి తన పాదములకు సాష్టాంగ దండప్రణామమును గావించుటను గాంచి లజ్జాభావమును బ్రదర్శించుచుఁ గపిలుఁడు సంభ్రమముతో నిలువఁబడి, ఆతనిని లేవఁదీసి యిట్లనెను:- "తండ్రీ ! మీ రేమి చేయుచున్నారు ? చిన్నవారి నిట్లు లజ్జపాలు కావింపవచ్చునా ? నేను మీ పిల్లవాఁడను. మీరు నన్నాశీర్వదింపవలయును. ప్రణామముచేయ నధికారిని నేను. మీ రేటికి ఎదురీదుచున్నా రేల?"

కర్దముఁడు దీనతాస్వరమున నిట్లనెను:- ప్రభూ! మీరు నన్ను మోసగింపవలదు. మీ రెవరికి కుమారులు ? లోకమంతయు మీ బిడ్డలు. మీరు కృపాసాగరులు. మీ సేవాసాధనచే నైనను ప్రసన్నులు కారు. సాధనచే దేవగణములైనను, దీర్ఘ

కాల సాధనచే - అదియు విధ్యుక్తసాధనమైననే - ప్రసన్నులగు దురు. అయినను మీవిషయము వేరు. మీరు కేవలము కృపా వశమున ననుకంపచేతనే ప్రసన్నులగుదురు. కాకున్న ననేక యోగులు అనేక జన్మములు సుదృఢమగు సమాధిలోనుండి ధ్యానము చేయుచుండినను ఒక్కసారైనను ఆ సమాధిలోఁ దమ కాంతినైనను జూపరు. అదైనను నే భాగ్యశాలికో కలు గునుగాని అందఱకు కలుగఁజాలదు. అట్లయ్యు విషయలోలుపు లగు మాబోటి గృహస్థుల అపరాధముల యెడల దృష్టినుంచక నిట్లు పుత్రరూపమున నవతరించిరి. ఇది విడంబనము మాత్రమే. మీ కృపలేక యిట్టి దెచ్చటనైన సంభవింపఁగలదా?"

భగవంతుఁ డిట్లనెను :- "నాయనా! భగవంతుఁ డజన్ముఁడు. ఆతఁ డీ చర్మచక్షువులకుఁ గనఁబడఁడు. అందువలన నాతఁ డరూపుఁ డనఁబడుచున్నాఁడు. మీరు నా రూపమును జూచుచున్నారు. తల్లిగర్భమున మీయింటిలోఁ బుట్టితిని. అట్టి యెడ నన్ను మీరు భగవంతుఁడందు రేల ?"

కర్దముఁడిట్లనెను:-"కాదుస్వామీ! మీ రరూపులరయ్యు భక్తుల కోరికపై ననేకరూపములను ధరించుచుందురు. మీరు కర్మఫలము లనుభవించుటకు జన్మింపరు. భక్తులకోరికతీర్చుటకై జన్మించి పుత్ర, మిత్ర, సఖా, సేవక, దూత, కింకర భావము లతో వారి నానందపెట్టుచుందురు. మీరు మీ భక్తులకు గౌరవము నొసంగెదరు. వారి ఉచితానుచిత విషయములను మీరు పూర్తి కావించెదరు. దీనికి ప్రత్యక్షోదాహరణము నేనే. నేను పొరపాటున నజ్ఞానవశమున మీవంటి పుత్రుని యాచించి తిని. మీవంటివారు మీరే యగుటచే నా కోరికను నెఱవేర్చ

టకును, మీ ప్రతిజ్ఞను బూర్తిగావించుటకును నా యింటఁ బుత్రరూపమునఁ బుట్టితిరి."

భగవానుఁ డిట్లనెను:- "తండ్రీ! భగవంతునిలో సమగ్ర మగు నైశ్వర్యము, వైరాగ్య, యశ, జ్ఞాన, వీర్య, సంపత్తులను నీ షడ్గుణములు సర్వదా నిరంతర ముండును. నాలో నివి యన్నియు యేవి ?"

కర్దముఁడు వినయముతో నిట్లనెను:- "దేవా! మీయీ యవతారము తత్త్వజిజ్ఞాసువులగు విద్వజ్జనుల యుపయోగార్థము వచ్చినది. గొప్ప గొప్ప జ్ఞానులు, సాంఖ్యాచార్యులు, యోగులు మీ పావన పాదపద్మములకు నిరంతరము వందనము చేయుచుందురు. షడైశ్వర్యములం దెల్లప్పుడు నుండెదరు. మీరు ప్రకృతిపురుషులను నియమించు పురుషోత్తములరు. మహత్తత్త్వము, కాలము, బ్రహ్మ, త్రిగుణములు, అహంకారము, దేవతలు, లోకపాలురు, జడచేతనములు ఇవన్నియు మీ శక్తిలోనే యున్నవి. మీరు స్వచ్ఛందశక్తి కలవారు. సర్వజ్ఞులు, అనంతులు. నన్ను మఱపింపవలదు. నేను మీ చరణసరోజములకు పునః పునః ప్రణామములు కావించుచున్నాను."

ఇది వినఁగానే భగవంతుఁడు నవ్వి యిట్లనెను:- "మహాముని! నీ జ్ఞానము దృఢమైనది. మాయ నిన్ను స్పర్శింపలేదు."

కర్దమమహాముని సిగ్గుతో నిట్లనెను:- "స్వామీ! ఎవరిపై మీ కృపయుండునో, ఎవరి నుద్ధరించు భారము మీపైని బెట్టుకొనిరో, మిమ్ముతప్ప నింకొకటి యెవరికి తెలియదో వారిని మాయ యెట్లు స్పర్శింపఁగలదు? ఒక్కసారి మీరు నా వాఁడని యనుకొంటిరా, కారణవశమున వాఁడు విషయాసక్తినిఁ జెంది

నను వానిని శీఘ్రముగ నుద్ధరించెదవు. బలపూర్వకముగ వానిని సంసారసాగరమునుండి చేయిపట్టుకొని లేవఁదీసెదవు. సంసారమగ్నుఁడనగు నన్నుద్ధరించుటకు నా యింటఁ బుత్రరూపమునఁ బుట్టితివి."

మైత్రేయుఁడిట్లనెను:— "విదురా! ఈ విధముగఁ గర్దమమహాముని కపిలస్తుతి చేయఁగానే, కపిలుఁ డాతని యెడలఁ బ్రసన్నుఁడై తత్త్వజ్ఞానము నుపదేశింప నుద్యుక్తుఁడయ్యెను."



## కర్దముఁడు సన్న్యాసి యగుట.

అమృతత్వప్రాప్తి కేకైక యుపాయము త్యాగము. త్యాగములేక సుఖములేదు. శాశ్వతశాంతిలేదు. శాశ్వతముగ సాంసారిక విముక్తి లేదు. నిఃశ్రేయసమునకు మూలకారణము త్యాగము. ప్రవృత్తిమార్గనిష్ఠులైనను సంసారపతనముకొఱకా మార్గమును బట్టుకొనలేదు. గ్రహించుట, విషయాసక్తుఁడగుట ఇది కర్మయోగము, లేక వర్ణాశ్రమధర్మముయొక్క అభిప్రాయముకాదు. అదియును త్యాగముకొఱకే. యుద్ధములో శత్రువును మోసముగఁ గొట్టుటకుఁ గొంచెము వెనుకకు తగ్గుట కలదు. శత్రువు చిక్కినా ఒక్కసారిగా మీఁదఁబడి ప్రహారము కావించెదరు. సింహము వేటాడునపుడు కొంచెము వెనుకకు తగ్గి తర్వాత మీఁదఁబడును. అచ్చట వెనుకకుతగ్గుట ఆక్రమణ భీషణమొనర్చుటకే. ముందుకుదూకుటకై కొంచెము వెనుకకు వచ్చి బలమును గూర్చుకొనవలయును. గతిని ధృతమొనర్చుట

కిది యొక యుపాయము. అనేకజన్మ సంస్కారములచేత జీవు
లకు విషయములం దాకర్షణ కలుగును. ప్రారబ్ధకర్మ బలాతి
రేకము జీవుని అచ్చటకుఁ గొనిపోవును. కావున మనీషులు
క్రమత్యాగమార్గమగు వర్ణాశ్రమ ధర్మమును శ్రేష్ఠముగఁ
జెప్పిరి. బ్రహ్మచర్యాశ్రమమునఁ ద్యాగశిక్షణమును బొంద
వలయును. గృహస్థాశ్రమమందు ప్రారబ్ధకర్మల ననుభవించుచు
ధర్మపూర్వకముగఁ గామమును, విషయముల ననుభవింప
వలయును. వానప్రస్థాశ్రమమందు జ్ఞానాజ్ఞానములచేఁ జేసిన
పాపములకుఁ బ్రాయశ్చిత్తమును జేసికొనుచుఁ బూర్ణత్యాగము
కొఱకుఁ సిద్ధపడవలయును. సన్న్యాసాశ్రమమందు సమస్తమును
ద్యాగము కావించి, సమస్తప్రాణుల కభయదాన మొసంగి
పరివ్రాజకుఁడు కావలయును. ఇదియే వర్ణాశ్రమ ధర్మము
యొక్క రహస్యము. దారాగ్రహణము త్యాగము కొఱకే.
త్యాగమే చరమలక్ష్యము.

మైత్రేయ మహాముని యిట్లనెను :– "విదురా ! ఋషి
ప్రవరుఁడగు కర్దముఁడు భగవదాజ్ఞచేఁ ద్యాగమును లక్ష్యమం
దుంచుకొనియే గృహస్థాశ్రమమునఁ బ్రవేశించెను. ఆతఁడు
తన మామయగు స్వాయంభువ మనువుతోఁ దన వివాహము
నకుఁ బూర్వమే స్పష్టముగ నిట్లు చెప్పెను :– "నేను గృహ
స్థాశ్రమమును స్వీకరించెదను. అయితే మరణించువఱకు నేను
గృహస్థాశ్రమమునే అంటిపెట్టుకొని యుందునని భావింపరాదు.
నాకు మృత్యువు ఖోఁ ఖోఁ మని దగ్గుచు, నాపరివారమంతయుఁ
జుట్టుకొనియుండి, కుక్కి-మంచములో రారాదు. నీపుత్రికకు
సంతానముకలుగఁగానే జయ పరమేశ్వరాయని లేచిపోవుదును.

నేనన్నిటిని వదలి వనమునకుఁ బోయెదను. మహాత్యాగమను సర్వోత్తమ దీక్షను గ్రహించెదను. ఏలననఁగా నా యనంత భగవానుఁడే నాకు పరమప్రమాణము.'' ఇది విని హర్షముతో మనుమహారాజిట్లనెను:– "ప్రభూ! మనకు త్యాగమే భూషణము. దీనికి నాకభ్యంతరము లేదు.'' దేవహూతియు నీసంభాషణము వినుచుండెను. కావున నది స్థిరమయ్యెను. మరల నింకెవరికిని మాటలాడుటకు వీలులేకుండెను.

తన తొమ్మిదిమంది కూతుండ్రకు వివాహమై సాక్షాచ్ఛ్రీహరి తనయింట నవతరింపఁగానే కర్దమమహాముని సన్న్యసమును గ్రహింప నిశ్చయించెను. ఏకాంతమున వెళ్లి యాతఁడు భగవంతుని ప్రార్థించెను."

తన తండ్రి యిట్లు ప్రార్థించుటనుగాంచి జగత్పితయగు కపిలుఁ డిట్లనెను :– "మునివరా! నీవు తపస్సుచే నన్ను సంతుష్టుని గావించితివి. అందువలననే నేను నీకుఁ బుత్రుఁడనై యవతరించితిని."

కర్దముఁ డిట్లనెను :– "ప్రభూ! మిమ్ములను దపస్సుచే నెవఁడు సంతోషపఱుపఁగలఁడు? మీ రెవనియం దనుకంప కలదో వాఁడే మీదర్శనమున కధికారి కాఁగలఁడు.''

కపిలుఁ డిట్లనెను:– "మునివరా! ఇది నిజమేయైనను లౌకిక వైదికకర్మలందు నా వచనమే ప్రమాణము. నా వాక్కులకే వేదశాస్త్రములందును. నేను నీ యింటఁబుట్టుదునని మాట యిచ్చియుంటిని.అందువలన నే నవతరించితిని. ఈ నా యవతారమొక విశేష కార్యసిద్ధికొఱకై యున్నది."

కర్దముఁ డిట్లనెను:– "స్వామీ! అది యేమికార్యము?"
కపిలుఁ డిట్లనెను:– "ప్రాచీన సాంఖ్యశాస్త్రము లుప్తప్రాయమై పోయినది. లింగశరీరమునుండి ముక్తులు కాఁగోరువారికి సాంఖ్య శాస్త్రమే సర్వశ్రేష్ఠ సాధనము. మూలప్రకృతి, మహత్తత్త్వము, అహంకారము, భూతములు, ఇంద్రియములు మొదలగు తత్త్వములను విభాగించి వీటినుండి పురుషోత్తముని వేఱు చేసి తెలిసికొను శాస్త్రమునకే సాంఖ్యమనిపేరు. ఆ శాస్త్రమును ప్రచార, ప్రసారములు చేయుటయే నా యవతారమునకుఁ ప్రధానమగు హేతువు. మీ రిద్దరు వైరాగ్యభావముతో సన్న్యసించితిరి. కావున నేను గృహస్థాశ్రమమును స్వీకరింపను. త్యాగిని, విరాగినై ప్రపంచమునకు సన్న్యాస ధర్మము యొక్క మహాదర్శమును జూపెదను."

కర్దముఁ డిట్లనెను:– "ఇది నే నెఱుఁగుదును. స్వామీ! మీరు గృహస్థాశ్రమమును స్వీకరింపకు. నా కా కోరికయును లేదు. మాబోటి యధమ్ములకడ నవతరించితిరి. యిది మా యదృష్టము. కాని తమ రిచ్చట యెంతకాలముండెదరో నే నెఱుఁగఁ గోరుచున్నాను."

భగవానుఁ డిట్లనెను:– "మునివరా! నే నిచ్చటనుండిన ప్రయోజనములేదు. నేను నా తల్లికి ఆత్మజ్ఞానోపదేశము చేయ దలఁచినాను. ఆమె నా భక్తురాలు, అనురక్తురాలు, అధికారిణి యును. ఆమెకు సాంసారిక విషయములయం దాసక్తి లేదు. బాల్యకాలమునుండియు నామె నా స్మరణ భజనములు చేయు చుండినది. నిజమునకు నే నామెకు ఉపదేశ మొసంగుటకే

యిచ్చుటనుంటిని. ఆమెకు బాగుగాఁ దత్త్వజ్ఞానము కలుగఁ గానే నేనీ యిల్లువదలి వెడలిపోయెదను."

కర్దమమహాముని యిట్లనెను:– "స్వామీ! నా కేమి యాజ్ఞ?"

భగవానుఁడిట్లనెను:– "తండ్రీ! మీరు సంతోషముతో వెడలిపొండు. నాకు మీ కార్యమందు హార్దికమగు సహాను భూతి కలదు. నేను సంతోషముతో మీ కాజ్ఞ యిచ్చు చున్నాను. మీరు సమస్త కార్యములను నా ప్రసన్నతకొఱకు చేయుచు, నా ఫలములను నా కర్పించుచు న న్నారాధించుఁడు. నాయందు మనస్సుంచుఁడు. మీరు తప్పక యితరులచే జయింపఁ బడని దుర్జయ మృత్యువును జయించి, మాయాముక్తుఁడవై మోక్షమును బొందఁగలవు."

కర్దముఁడు వినయముతో నిట్లనెను:– "స్వామీ! నేను వనమునకుఁబోయి యేమి సాధనచేయుదును?"

నవ్వుచు భగవానుఁ డిట్లనెను:– "సాధన యేమి చేయ వలయునా? సూక్ష్మాతిసూక్ష్మ బుద్ధిద్వారా ఆత్మను నీలోనే చూచుకొనుము. ఏకాగ్రమనస్కుఁడవై స్వస్థచిత్తముతో నా యంతఃకరణములో నే యాత్మ ప్రకాశించుచున్నదో ఆ యాత్మయే చరాచరవిశ్వమందు బ్రకాశించుచున్నదని భావింపుము. నిన్ను సమస్తభూతములలో సమానముగఁ జూచుకొనుము. సమస్తభూతములను నీలోఁ జూచుకొనుము. ఈ విధముగ సర్వాత్మభావముతో నా భజనము చేయుము. నన్నుఁ జింతించుము. నన్నే కీర్తించుము, నా కొఱకే కర్మల నాచరింపుము. ఇట్లు చేసినఁ జివరకు నీవు పరమపదమును బొందఁగలవు."

మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురా! భగవదాజ్ఞ యిట్లు రాఁగానే కర్దమమహాముని యానందమునకు మేరలేకపోయెను. ఆతఁడు భూమిమీఁదఁబడి ప్రభు పాదములకుఁ బ్రణమిల్లెను. భగవంతుఁ డాతనిని లేవఁదీసి కౌఁగిలించుకొనెను. ఇద్దరి కన్నులవెంట నానందబాష్పములు రాలెను. పితాపుత్రులు, భక్త భగవానులు ఒకరొకరు తమవైపునకు లాగుకొనుచుండిరి. జ్ఞానము, వస్తువు. స్వాభావికప్రేమకే యింకొక పేరు వస్తువు. ప్రేమభరితహృదయముతోఁ గర్దమ మహాముని పుత్రరూపముననున్న ప్రభువునకుఁ బ్రేమపూర్వకముగఁ బ్రదక్షిణ మొనర్చెను. పునఃపునః ప్రణామములు కావించుచు నాతఁడు వనమునకుఁ బోయెను. సర్వకర్మఫల త్యాగపూర్వకముగు నిజమగు సన్న్యాసి యయ్యెను."

ఇది విని మైత్రేయుఁ డిట్లనెను:- "విదురా! ఇఁకఁ గర్దముఁడు చేయవలసిన దేమున్నది? ఆతని కిదివఱకే భగవత్కృప కలదు. స్వయముగ శ్రీహరి ఆతనియింటఁ బుత్రరూపమున నవతరించెను. అయినను ఆతఁడు లోకసంగ్రహముకొఱకై పరమహంస యతిధర్మముల నాచరించెను. ముందుగా నాతఁడు వాక్కును నియమించుకొనెను. వాఙ్నియమముచే నాతఁడు మౌని యయ్యెను. అహింసా, సత్యాది నియమములను బాలించుచుండెను. గృహస్థాశ్రమమున నాతఁడు చేయు నగ్నిహోత్రమును నాతఁడు ప్రాణములందు ధరించెను. అనఁగా నిరగ్నుఁడయ్యెను. ఏ యింటిమీఁదను నాతఁ డహంభావము నుంచలేదు. ఎచ్చట ఆశ్రమము కనఁబడిన నచ్చట పడియుండెడువాఁడు. శూన్యగృహములందును, దేవాలయములందును, నదీతటను

లందును, వృక్షచ్ఛాయలయందును పడియుండెడువాఁడు. సర్వ విధముల సంగమును ద్యజించి, భగవత్పరాయణుఁడై ద్వంద్వము లన సహించుచు, సంకల్పములేక స్వేచ్ఛతోఁ దిరుగుచుండెను. భక్తితోఁగాక యన్యసాధనములచేఁ దెలియఁబడని మనో వ్యాపార నియామకుఁడును, కార్య కారణాతీతుఁడును, నిర్గుణుఁ డును, నిరాకారుఁడు నగు శ్రీహరియందుఁ దన మనస్సును లగ్నము కావించెను. ఈ విధముగ ధ్యానము చేయుటచే నాతని చిత్తవృత్తి గంభీరము, శాంతము, అంతర్ముఖము నయ్యెను. వాసుదేవునందు గల భక్తి కారణమునఁ దన శరీరమును గూడ మఱచెను. ఆతని హృదయగ్రంథి యూడెను. ఆతని సంశయము లన్నియుఁ దీరెను. ఆతఁడు సమస్తబంధనములనుండి విముక్తుఁడై సర్వత్ర శ్రీహరిని దర్శించుచుండెను.

ఈ విధముగ కర్దమమహాముని యిచ్ఛా, ద్వేష, సుఖ, దుఃఖాది ద్వంద్వములనుండి విముక్తుఁడై భక్తిభావ భావిత హృదయుఁడయ్యెను. చివర కాతనికి దుర్లభ భాగవతగతి ప్రాప్తిం చెను. అది యే సాధనచేతను లభించునది కాదు, కేవలము భగవత్కృపచేతనే లభింపఁగలదు.”

మైత్రేయుఁ డిట్లనెను:- “విదురా ! నేను నీకు కర్దముని చరిత్ర సంక్షేపముగఁ జెప్పితిని. ఇఁక నేను నీకు దేవహూతి తర్వాతచరిత్రను జెప్పెదను, సావధానుఁడవై వినుము.”



# కపిలునితోఁ దత్త్వజ్ఞాన జిజ్ఞాస.

బ్రహ్మ యీ చక్షుగోళములను బయటకుఁ బెట్టినాఁడు; అందువలన స్వభావముగ జీవు లీ బాహ్యప్రపంచమునే చూచుచున్నవి; వానిలోనే రమించుచున్నాఁడు; వానిలోనే సుఖమున్న దనుకొనుచున్నాఁడు. విషయముల వైపునకుఁ బోవుటకు విద్యాలయములేదు, శిక్షణాలయములేదు. అనేక జన్మములనుండి విషయములను భోగించుటచే నది అలవాటై పోయినది. అందువలననే పుట్టఁగానే, యెవ్వరును నేర్పకయే తల్లి స్తనములందు పాలను ద్రావుచున్నాఁడు. పూర్వజన్మాభ్యాసమే లేకుండిన వానిలోఁ బాలున్నవని యేమితెలియును? అట్లు చీకిన పాలు వచ్చునని యెట్లు తెలియును? ప్రపంచములోని పదార్థము లన్నియు మనలను దమవైపున కాకర్షించుచున్నవి. మనమును నీ చిత్రవిచిత్ర విషయములను గాంచి, విని, యాఘ్రాణించి, స్పర్శాదులొనర్చి తమవైపున కాకర్షింపఁబడుచున్నాము. ఈ యాకర్షణము జీవులకే కలదు. మనస్సునకు, ఇంద్రియములకు విషయ సంసర్గము కలిగెనా కోరిక యుత్పన్నమగును. ఏది యెచ్చట పుట్టినదో అది యాతావునకే స్వభావముగ నడచును. దానిలో నైసర్గికానురాగ ముండును. వాస్తవముగ జీవుఁడు సచ్చిదానంద ఘనానందస్వరూపుడగు పరమాత్మవలననే యుత్పన్నమైనాఁడు. ఈతని కనురాగ మాతనియందే యుండవలయును; కాని ముఖ్యకారణమును మఱచి గౌణకారణమును నాతఁడు తన జనకునిగా భావించినాఁడు. పూలకు రంగులేదు. రంగు సూర్యప్రకాశమందుఁ గలదు. ప్రకాశమే లేకపోయినఁ బువ్వము లన్నియు నొక్కటిగానే యుండును. ప్రకాశమునఁ గనఁబడు

వివిధ వర్ణములు పుష్పములవికావు, ప్రకాశ కిరణములవి. మన మజ్ఞానవశమున వాటినిఁ బూలరంగనుచున్నాము. ఇదే విధముగ జీవులకు బీజము శ్రీహరియే. మనకుఁ గారణ మాతనిఁగా నెంచక జననీజనకులు రజోవీర్యములు కారణమని యెంచుచున్నాము. మరల వాటియందే రమించుచు నానందాన్వేషణ మొనర్చుచున్నాము. మన మే యానందము కొఱకు నిరంతర మన్వేషించుచున్నామో ఆ ఆనందము బ్రహ్మమే. దానినే భగవంతుఁ డనుము, పరమాత్మ యనుము, బ్రహ్మయనుము. ఏదైన నొక్కటియే. వెదకుచున్నది మన యుత్పత్తిస్థానమును. కాని మన యన్వేషణము మిథ్యయే. దీనిలో మంచి యానంద మున్నదని గోలపెట్టుచున్నామే, ఆయానంద మానందముకాదు. అది ఆనందాభాసము. వాస్తవికానందము దానికి చాలదూరమునఁ గలదు. అది మన భ్రమపోయిన నిమిషమున లభించును. ఈవిషయమును నీదృష్టాంతమునఁ దెలిసికొనవచ్చును.ఒకానొక పిల్లవాఁడు తల్లిదండ్రులకడ యేడ్వగా వారొక మట్టిగుఱ్ఱము నొసంగి దీనితో నాడుకొనుమనును. బాలుఁడానందము చెందును. "ఇదిగో నాగుల్లము,ఇదిగో నాగుల్ల"మని ముద్దుమాటలతో నటించును.ఇంకొకపిల్లవాఁడు కొయ్యగుఱ్ఱమునుదెచ్చి "నీగుల్లంకంటె నాగుల్లమే మంచి"దనును. ఇద్దరు నానందము చెందుచుందురు. నాది మంచిదనిన నాది మంచిదని కలహించు కొందురు. తల్లిదండ్రులుకూడ నవ్వుచు నిట్లందురు:- "వహ్వా! బాబూ! నీ గుఱ్ఱము మంచిదేకాని మాకుఁగూడ యిమ్ము." అతఁ డిట్లనును:- "నేను నా గుల్లము నీయను" కొంచెము విచారించెదు పిల్లవాఁ డేల యానందమును జెందినాఁడో గుఱ్ఱమును బొంది? తనకు

గుఱ్ఱము లభించిన దనుకొనుచున్నాఁడు. నిజముగ నది గుఱ్ఱము కాదు. గుఱ్ఱము పేరట నొక మిథ్యాభ్యాసము కావింపఁజేయు నొక యాటవస్తువు. పిల్లవాఁడది గుఱ్ఱమని యానందము చెందు చున్నాఁడు. కొంతకాలమునకు వాని కా మిథ్యాభ్రమ దూర మగును. ఆతఁడు పెద్దవాఁడైన తర్వాత నిజమగు గుఱ్ఱము లభించును; అప్పుడు ఆటబొమ్మయగు గుఱ్ఱముపై కోరిక యుండదు. ఆతఁడు దానిని మిథ్యగఁ దలంచును. నేఁడు మనము సుందర రూపములను, స్వాదిష్టరసమును, మనోరంజకమగు గంధము, సుఖదస్పర్శము, హృదయాహ్లాదకరమగు శబ్దముల ననుభవించి తాను సుఖిననుకొనును. నిజమునకందు సుఖము లేదు.అజ్ఞానవశమున దానిలో సుఖమున్న దనుకొనుచున్నాఁడు. సమస్త ప్రకృతిని, దానివలన నేర్పడిన వికృతిపదార్థములను బురుషునినుండి వేఱుచేసి వీనిభేదమును దెలిసికొనినఁగాని యీ యజ్ఞానము తొలఁగదు. ప్రకృతి, పురుష, పురుషోత్తముల యథార్థజ్ఞానము లభింపఁగానే యీ సాంసారిక విషయము లన్నియుఁ దుచ్ఛములుగఁ దోఁచును. అప్పుడు వీనిలో సుఖము కనఁబడదు. అట్లు కాకుండిన గొప్పగొప్ప చక్రవర్తులు సమస్త సుఖములను ద్యజించి వనములం దేలఁ దిరుగుదురు ? కాని యిట్టి జ్ఞానము అదృష్టవంతునకు కలుగును. ఇట్టి జిజ్ఞాసయు పూర్వ జన్మసుకృత విశేషముచేతనే లభింపఁగలదు. వేయికొక జిజ్ఞాసు వుండును. పరమభాగ్యశాలినియు, నవతారజననియునగు దేవ హూతి యట్టి భాగ్యశాలియగు లలనారత్నములలో నొకర్తుక. ఆమె ఒక్కజన్మములోనే యీ సంసారసాగరమును దాఁటి పోయినది. కర్దమ దేవహూతి చరిత్రప్రసంగమందు కపిలావ

తారమునుగూర్చి వినఁగానే మునులకుఁ గుతూహలము కలుగఁగా దానిని గ్రహించి శౌనకుఁడు సూతు నిట్లడిగెను :- "సూతా! నీ కపిలావతారప్రశ్నము బాగుగాఁ గావించితివి. ఈ పావన చరిత్రమును వినఁగా వినఁగా నాకర్ణములు తృప్తిచెందుట లేదు. ఇంకను నిరంతరము వినఁగోరిక కలుగుచున్నది. అజన్ముఁడయ్యు జన్మించుటయు, నిర్గుణుఁడయ్యు గుణముల నాశ్రయించుట, ఇవి విపరీతముగఁ దోఁచుచున్నవి. భగవానుఁడు కపిలరూపమున జిజ్ఞాసువుల కేమి యుపదేశించినాఁడు? ఆతఁడేమి కమనీయలీల లొనర్చెను? ఏయే నరనాట్య మొనర్చెను? తన తల్లి కెట్లుపదేశించెను? మాకివి యన్నియును వినవలయు నని చాల యుత్కంఠతగా నున్నది. కావున నీవు మాకు సమస్త విషయములను విస్తారముగ వివరించుము."

ఇది విని సూతుఁడు నవ్వి యిట్లనెను:- "మహాభాగా! మీరిట్లు ప్రశ్నించి నన్ను ఉత్సాహితునిగా నొనర్చుచున్నారు. ప్రభువు మీఁద మీకుఁగల ప్రేమను ప్రదర్శించుచున్నారు. మీ యలౌకిక భక్తి ధన్యమైనది. భగవద్భక్తులైనవారికి భగవత్కథలందిట్టి రసమే వచ్చుచుండును. కామాసక్తుఁడగు కాముకుఁడు కామినులచే నెట్లు తృప్తిచెందఁడో అట్లే భక్తుఁడును భగవత్కథలకుఁ దృప్తినిఁ జెందఁడు. స్వామీ! మీరెట్టి భగవద్రసికులో అట్లే పరమభాగవతుఁడగు విదురుఁడును గొప్ప రసికుఁడు. మీరేవిషయమును గూర్చి నన్నడిగినారో, ఆ విషయమును గూర్చియే యాతఁడు మైత్రేయునడిగెను. మైత్రేయుఁడాతని కేమి ప్రత్యుత్తరము నొసంగెనో మీకు నట్టి ప్రత్యుత్తరమునే మాగురువగు శుకమహర్షి నోట విన్న విధముగ నిచ్చెదను.

మైత్రేయుఁ డిట్లనెను:— "విదురా! కర్దమమహాముని కపిలదేవుని యాజ్ఞను బొంది వనమునకుఁబోయెను. ఇప్పు డా పెద్దవిమానమున దాసీపరివృతయై దేవహూతి యొక్కతయే యుండెను. కూఁతుండ్రు వివాహముకాఁగానే తమ తమ గృహములకు వెళ్ళిరి. పరమేశ్వరారాధనము కొఱకు పతి పరివ్రాజకుఁడయ్యెను. ఇప్పుడు మోహద్వారములన్నియు మూయఁబడినవి. పెద్దమోహము పుత్రునిపై నుండును. అదియునుగాక పుత్రుఁడు సాక్షాత్పరమాత్మ యవతారము. మాధుర్యావతారమైయుండినఁ గొన్ని లీలలు జరిగెడివి. ఇది జ్ఞానావతారము. ఈతనిదృష్టి యెల్లప్పుడు నాసికాగ్రమందే యుండును. నాసాగ్రభాగమం దెవఁడు కూర్చున్నాఁడో యెవనికిని దెలియదు. చాల మంది వైష్ణవులును నచ్చటనుండియే తిలకస్వరూపము నారంభము చేయుదురు. ఈతఁడు నామమాత్రమునకుఁ బుత్రుఁడు కాని భగవంతుఁడే. నాకు గతి ఈతఁడే. ఇప్పుడీతనిని శరణు వేఁడినచో సంసారమును దాటవచ్చును. అని యిట్లాలోచించుకొని యొకదినమున దేవహూతి యొంటరిగా విమానమునుండి దిగి వనమువైపుగాఁ బోయెను."

నేఁడామె కీప్రపంచమంతయు విచిత్రముగఁ దోఁచుచుండెను. నిజమునకుఁ బ్రపంచమేమియో భగవంతునకుఁ దెలియవలెను; కాని అందఱును దీనిని తమతమ భావనానుసారముగఁ జూచుచుందురు. క్షుధార్తుఁడగువానికి ప్రపంచము శూన్యముగఁ దోఁచును. సర్వస్వమును గోల్పోయిన వానికీ ప్రపంచ మన్లే తోఁచును. సుఖికి యితరుల దుఃఖములు కనఁబడవు. దుఃఖికి సర్వత్ర దుఃఖమే కనఁబడును. ప్రపంచ వైరా

గ్యము కలిగినవానికి లతాపత్రములందును వైరాగ్యమే గోచరించుచుండును.

దేవహూతికి నేఁడీ ప్రపంచమంతయు నొక నాటకముగఁ దోఁచుచుండెను. వృక్ష, లతా, వనోపవన, నదీసరోవరాదులను జూడఁగా నామె వైరాగ్య మధికమయ్యెను. ఈ విధముగ నామె వనశోభను దిలకించుచు ఘోరారణ్యమునఁ బ్రవేశించెను. అచ్చట నొక విశాల వటవృక్షచ్ఛాయయందు తన కుమారుఁడగు కపిలుఁడు ధ్యానమగ్నుఁడై కూర్చుండియుండెను. తల్లి వెంట్రుకలు విరియఁబడియుండెను. శరీరము ముడుతలు పడెను. సాధారణ స్త్రీవలె నామె యొక చీరె ధరించియుండెను. ధ్యానమగ్నుఁడును, తేజఃపుంజము నగు దన పరమాత్మపుత్రుని గాంచఁగానే యామె మోహమంతయు మాయమయ్యెను. ఆమె భూమిమీఁదఁబడి భగవత్పాదపద్మములకు భక్తితోఁ బ్రణామము కావించెను. తన తల్లి ప్రణామము చేయుటను గాంచఁగానే కపిలుఁడు మిక్కిలి స్నేహముతో నిట్లనెను:— "అమ్మా! నేఁడు మీ రిచ్చటికి ఒంటరిగా నెట్లు వచ్చితిరి? ఏదైన నాజ్ఞయుండిన నేదాసిచేనైనఁ బిలువనంపిన వెంటనే వచ్చెడివాఁడనే. నేను నీ కుమారుఁడనే కదా!"

దేవహూతి దీనతతో నిట్లనెను:— "ప్రభూ! ఇప్పుడిఁక నన్ను 'మీరు' అని అనవలదు. మీ యవతారసమయముననే వేదగర్భుఁడగు బ్రహ్మ మీ యవతార రహస్యమును గూర్చి చెప్పెను. ఇంతవఱకు నేను మూఢురాలనై యుంటిని. నేఁడు నాకు జ్ఞాపకమువచ్చుటచే మీ సమీపమునకు వచ్చితిని. నేను మిమ్ముల నొక్క విషయ మడుగఁదలఁచితిని, ఆజ్ఞయైన నడిగెదను."

కపిలుఁడిట్లనెను:– "అమ్మా! నేఁడిట్లు మాట్లాడుచున్నావేమి? నీ వేమి యడిగిన దానికి జవాబొసంగెదను."

దేవహూతి యిట్లనెను:– "దేవా! నే నొక్క విషయ మడుగఁదలఁచినాను. భగవంతునికడఁగూడ స్త్రీపురుష భేదము కలదా?"

కపిలుఁ డిది విని నవ్వి యిట్లనెను:– "అమ్మా! నీ అభిప్రాయ మేమి?"

దేవహూతి యిట్లనెను:– "ప్రభూ! మీకు గూడ అభిప్రాయమును జెప్పవలసియుండునా? మీరు ప్రతి జీవి హృదయములోని విషయములను దెలిసికొనఁగలరు. మీరు మీ తండ్రికి జ్ఞానోపదేశ మొనర్చి సంసారసముద్రమును దాఁటించితిరి. నావైపే చూడలేదు. మీకు తల్లినని చెప్పఁబడుచు నేను గూడ యీ జననమరణరూపమగు సంసారచక్రములోఁ బడి యుండవలసిన దేనా?"

కపిలదేవుఁ డిట్లనెను:– "లేదమ్మా! నీవు సంసారచక్రమున నేలపడెదవు? భగవత్ప్రాప్తికి అందఱు నధికారులే. స్త్రీ గానిండు, పురుషుఁడు గానిండు, పెద్దవాఁడుకానిండు, వృద్ధుఁడు కానిండు, బాలుఁడుకానిండు, యువకుఁడుకానిండు, ఎవఁడైన గానిండు జిజ్ఞాస హృదయములోనుండిన జ్ఞానమున కధికారులే."

దేవహూతి యిట్లనెను:– "ప్రభూ! ఈ యింద్రియములు నన్నుఁ దమ వశము కావించుకొని విషయాసక్తములై వీనికి లాలసత్వము పెరుగుచున్నది. తృష్ణ శాంతింపలేదు. భోగేచ్ఛ తృప్తి చెందుటలేదు. మండుటగ్నిలో నెంతగా నేయిఁ బోసిన

నంతగా జ్వాల వృద్ధియగును. ఇంద్రియముల స్థితియు నింతే. భోగములను భోగించుచున్న కొలఁది వాసనాతరంగము లింకను నెగుచుచుండును. వీటినుండి తప్పించుకొనుటెట్లు ? నీవు భక్త వత్సలుఁడవు. అశరణశరణుఁడవు. శరణాగత ప్రతిపాలకుఁడవు. అన్నిటిని వదలుకొని నేను నిన్ను శరణువేఁడితిని; నీవు నన్ను రక్షింపవలెను. నాకు పరమార్థపదమును జూపించుము. నేను నీకు భక్తురాలను, అనురక్తను, ప్రసన్నను.”

మైత్రేయమహాముని యిట్లనెను:– “విదురా! కపిలుఁడు తన తల్లి పలుకు సుందర, సరళమును, మోక్షరతిని గలిగించు వచనములను విని, యామెకుఁ దత్త్వజ్ఞాన మొనర్ప నుద్యుక్తుఁ డయ్యెను.”



# కపిలోపదేశసారము.

సంబంధము రెండు విధములుగ నుండును. శరీరసంబంధ ముచే వచ్చిన సంబంధమొకటి. రెండవది శిక్షా, దీక్షాసంబంధ ముచే నేర్పడిన సంబంధము. శరీరసంబంధమును లౌకికసంబంధ మందురు. ఈతఁడు మన శరీరమునకు జనకుఁడు, వీరు మా సోద రులు, ఈఁతడు పెత్తండ్రి, ఈమె సోదరి, ఈతఁడు మేనల్లుఁడు, ఈమె తల్లి, ఈతఁడు తాత, ఈతఁడు మామ అని యిట్లనుకొను చుందుము. శరీరసంబంధము శరీరమున్నంతవఱకే యుండును; జీవాత్మ యీ శరీరమును వదలి యింకొక శరీరమునఁ జేరఁగానే పూర్వజన్మపు తండ్రి యిప్పుడు పుత్రుఁడు కావచ్చును. తల్లి

పెండ్లాము కావచ్చును. మిత్రుఁడు మరుజన్మమున శత్రువు కావచ్చును.

శిక్షా దీక్షా సంబంధము సూక్ష్మశరీరముతో నుండును. అది యీ లోకమున కేమంత పనికిరాదు. ఆ సంబంధము పార లౌకికమునకుఁ బనికివచ్చును. పారమార్థిక శిక్షా దీక్షలద్వారా మనము దివ్యలోకములకుఁ, జివరకు పరమపదమువఱకు బోవ చ్చును. పారమార్థిక సంబంధమునకు లౌకికసంబంధ మవస రము లేదు. ఏ స్థానములోనైనను, నే జాతిలోఁ బుట్టినవాఁడై నను కావచ్చును, శరీరసంబంధమైన నుండవచ్చును. పారమా ర్థిక సంబంధమున్నప్పుడు లౌకికసంబంధము గౌణమగును. ఉప నిషత్తులలో నొక కథగలదు. ఒకానొక ఋషిబాలుఁడు తన తండ్రిని, తాత మొదలగువారిని వత్సయని సంబోధించినాఁడు. అప్పు డాతఁ డల్పవయస్కుఁ డైనను జ్ఞానాధిక్యమున వృద్ధుఁ డయ్యెను; వారు శరీరసంబంధముచే వృద్ధులైనను జ్ఞానములో న్యూనత కనఁబడుటచే బాలకులైరి.

మైత్రేయమహాముని యిట్లనెను:— "విదురా! తన తల్లి చేతులు జోడించుకొని పరమార్థమునుగూర్చి ప్రశ్నింపఁగాఁ గపిలదేవుఁడు జగద్గురువగుటచేఁ దన తల్లికి పారమార్థికమగు సాంఖ్యశాస్త్రము నుపదేశించెను."

కపిలుఁ డిట్లనెను:— "అమ్మా! భగవత్ప్రాప్తికి, నిర్వాణ మునకు అనేక సాధనములు కలవు; కాని అన్నిటిలో భక్తిమా ర్గమే శ్రేష్ఠమైనదని నేను తలఁచుచున్నాను."

దేవహూతి యిట్లనెను:— "ప్రభూ! భక్తిప్రాప్తి యే సాధనచేఁ గలుగఁగలదు?"

కపిలుఁ డిట్లనెను:- "అమ్మా! భక్తి ప్రాప్తించుటకు సర్వశ్రేష్ఠ సాధనము సత్పురుష సాంగత్యము. సాధు సజ్జన పురుషులకడ సర్వదా శ్రీకృష్ణకథలు జరుగుచుండును. సుమధుర భగవన్నామ కీర్తనము జరుగుచుండును. భగవత్కథా కీర్తన శ్రవణ మననములచే భగవద్గుణములందును, నామములందును ననురాగ ముత్పన్నమగును. శ్రవణమందు శ్రద్ధ కలుగును. నిత్యము శ్రద్ధచే వినఁగా వినఁగాఁ గథాసక్తి కలుగును. మిక్కిలిగానున్న భగవత్సంబంధాసక్తియే భక్తి. కావున భక్తి కావలసినవారు సత్సంగము నాశ్రయింపవలయును."

ఇది విని తల్లి యిట్లనెను:- "ప్రభూ! మీరు భక్తిని బ్రశంసించితిరి. ఆ భక్తి యెట్టిది? అది యెట్లు లభించును? మీరు యోగమును గూర్చి పలికితిరి. దానినిగూడ మందమతి నగు నాకు విశదము చేయవలెను. నేను స్త్రీని. అదియు నా బుద్ధియు మిక్కిలి విశాలమైనది కాదు. కావున సరళముగఁ జెప్పవలయును."

తన శరీరమును బోషించిన జననియే, తనకుఁ బూజనీయయే నేఁడువచ్చి దీనతతో జిజ్ఞాసచేసినది. ఇది తలఁచుకొనఁగానే ఆతనికిఁ గంటనీరు వచ్చెను. ఆతఁ డత్యంత స్నేహభరిత స్వరముతో నిట్లనెను:- "అమ్మా! నీవు భక్తి లక్షణము నడిగితివి. భగవంతునియందు సర్వాత్మభావముతోఁ జిత్తవృత్తి నుంచుటకే భక్తి యందురు. అది అహైతుక భక్తి అనఁగాఁ గోరికలేనిదిగా నుండవలెను. ఈభక్తిముందు ముక్తి తుచ్ఛము. ముక్తి వైరభావమున నున్న రాక్షసులకును బ్రాప్తించును. దానిలో నేమియు రసములేదు. భక్తి రసగుల్లావలె, గులాబ్

జామున్‌వలె, గింజలులేని తియ్య దానిమ్మపండువలెఁ గమ్మగా నుండును. పంటికి తాఁకగానే నోట నీరూరినట్లు, హృదయమున భక్తి స్థిరపడి, చిత్తమును ప్రసన్నము కావించును. ఇదియే భక్తి విశేషత.''

దేవహూతి యిట్లడిగెను:— ''శరణాగతవత్సలా! భక్తి రసాస్వాదన మెట్లు చేయవలెను?''

కపిలుఁడిట్లనెను:— ''అమ్మా! ఎప్పుడైన రసాస్వాదనము రెంటితోగాని, రెంటి కెక్కుడగువానితోగాని చేయవలయును. భక్తులంద ఱొక్కచోఁగూర్చుండి, అందులో నొక్కఁడు భగవద్గుణములను గానము చేయుచుండ మిగిలినవారు వినుచు వినుచుఁ బ్రేమలో మునిఁగి యేడ్చుచుందురు. ఒకఁడు భగవంతుని దివ్యలీలలను, అనుపమ యశమును గూర్చిన కథలను జెప్పుచుండును. మిగిలినవారు తదేకదృష్టితో వినుచుందురు. ఒక్కొక్కప్పుడందఱును గలిసి భగవంతుని మధురాతి మధుర, దివ్య, రసమయ, ఆనందమయ, ప్రేమవర్ధక, జగన్మంగళ, పరమపావన నామములను గీర్తించుచుందురు, నవ్వుదురు, యేడ్చుచుందురు, పాడుచుందురు, వాయించుచుందురు, ఆడుచుందురు, దుముకుచుందురు, దొరలుచుందురు, గంతిడుచుందురు, క్రిందఁబడి పోవుచుందురు, కంపించుచుందురు, ఱొప్పుచుందురు, కేకలు వేయుచుందురు, ఏడ్చుచుఁ గ్రిందపడుచుందురు. వారు లోకబాహ్యులై పిచ్చివారివలె వట్టి వెఱ్ఱివాండ్రవలె నున్మత్తులగుచుందురు. ముక్తి వారి యెదుటకు వచ్చి నిలుచుండును. అప్పుడు దానివైపు కన్నెత్తియైనఁ జూడక అట్లే కీర్తించుచుందురు. అప్పుడా మెంతు మిక్కిలి

క్లేశము కలుగును. ఈ నీరసాదేవి యెక్కడనుండి వచ్చినదో కాని పాడదు, కీర్తింపదు, పాషాణమువలె నిలుచుండును. వారామె వైపు కన్నెత్తియైనఁ జూడరు. ఈ వెట్టినుండి కొంచెము బయట పడఁగానే తన్ను స్వీకరింపుమని ప్రార్థన చేయుదమని ఆమె అట్లే ముఖము వ్రేలాడవేసికొని నిలుచుండి యుండును. అమ్మా! వారి మత్తు తగ్గినగదా! వారెల్లప్పు డేదియో చేయుచునే యుందురు. ఊరక కూర్చుండరు. ఎప్పుడును భగవత్సేవను జేయుచుందురు. భగవద్విగ్రహముల నర్చించెదరు. ఆతనితో మాట్లాడుచుందురు."

తల్లి యిట్లడిగెను:- "ప్రభూ! అయితే ముక్తిదేవి నిరాశతోఁ దిరిగి వెడలిపోవునా యేమి?"

కపిలుఁడిట్లనెను:- "అమ్మా! భక్తుల కడనుండి నిరాశతో నెవ్వరును దిరిగి పోరు. వారమానులై ప్రతిజీవికి గౌరవ మొసంగుచుందురు. అయితే, కథాకీర్తనములకు విరోధులగు వారితో బుద్ధిపూర్వకముగ సాంగత్యము చేయరు. అయితే వారు వెళ్లిరా, వారిని గూడ ఆదరించెదరు. ముక్తిదేవి వారి కడకు వెళ్లి ప్రార్థించెనా వారు భగవంతు నిట్లడిగెదరు. "భక్తవత్సలా! ఈ దేవికి కూడ నిలువ నీడయిమ్ము" అప్పుడు భగవంతుఁడు కృపతో ముక్తిని భక్తికి దాసిగాఁ జేయును. తల్లి దాసి తల్లితో సమానమైనదే. అందువలన నామె వైకుంఠమునకుఁబోయి భక్తిదేవి యాశ్రయమున నుండును. భక్తులకు సిద్ధులుగాని, నవనిధులుగాని అవసరము లేదు. స్వర్గీయైశ్వర్యము మాటయేమి, వారికి వైకుంఠములోని పరమోత్కృష్టైశ్వర్య వాంఛకూడ యుండదు. వారికి భక్తికావలెను.

ముక్తి భక్తి కధీనమైయుండును. అది వారి కనాయాసముగఁ బ్రాప్తించును."

దేవహూతి యిట్లనెను:- "ప్రభూ! నాకు సర్వశాస్త్ర సారమును సర్వోత్కృష్టము నగు నుపదేశము నొసంగుము."

కపిలభగవానుఁ డిట్లనెను:- "భక్తియోగము ద్వారా యీ చంచల చిత్తవృత్తినిఁ దీవ్రముగా శ్రీశ్యామసుందర చరణారవిందములం దుంచుటయే సర్వోత్కృష్టమగు శ్రేయము. సర్వాత్మభావముతో సర్వకర్మలను నాయందర్పించి, మనస్సును నాయందు స్థిరముగ నుంచవలయును. ఇదియే సారాతిసారమగు నుపదేశము."

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఈ విధముగ గపిల భగవానుఁడు తన జననికి భక్తియోగముయొక్క ఉత్కృష్టతను గూర్చి చెప్పి మహత్తత్త్వాది భిన్న భిన్న తత్త్వముల యుత్పత్తినిగూర్చి వర్ణించెను. ప్రకృతి యెట్టిది? పురుషుఁడెట్టివాఁడు? ప్రకృతియొక్క వికృతివలన నీ చరాచర విశ్వమెట్లు యుత్పన్నమైనది? పంచభూతోత్పత్తి; వాటి తన్మాత్రలయొక్క గుణాదులను గూర్చి విస్తారముగ వివేచించెను. తదనంతరము ప్రకృతి పురుష వివేకముద్వారా మోక్షప్రాప్తి యెట్లు కలుగునదియుఁ జెప్పెను. ఈ విధముగ సాంఖ్యజ్ఞానము నుపదేశించి, అష్టాంగ యోగమునుగూడ విస్తారముగ వర్ణించెను. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధుల లక్షణములనుగూర్చి చెప్పెను. ధ్యానవిధినిగూర్చి చెప్పెను. తర్వాత మిక్కిలి ప్రభావోత్పాదక శబ్దములలో భగవంతుని సగుణ సాకార స్వరూపముయొక్క ప్రత్యేక అంగ ప్రత్యంగ

ముల ధ్యానమునుగూర్చి చెప్పెను. ఈ విధముగ యోగము యొక్క అంతిమస్థితిని మిక్కిలి యుల్లాసోత్సాహములతో భగవానుఁడు వర్ణించెను. భక్తిమర్మమును కాలమహిమనుగూర్చి వివేచించెను. భక్తి భేదములను దెల్పి, భక్తులలో సర్వోత్కృష్టులగువారి లక్షణములనుగూర్చి చెప్పుచు భక్తియోగముద్వారా కాని, యోగముద్వారా కాని తనయందు చిత్తముంచిన సాధకుఁడు తననే పొందుననియుఁ జెప్పెను. దేహ గేహములందాసక్తి కలవారు సంసారములో నెట్లధోగతికిఁ బోవునదియు, నారంభమునుండి చివరవఱకు స్పష్టశబ్దములతోఁ జెప్పెను. ఈ జీవి ప్రారబ్ధవశమున భిన్న భిన్న యోనులలో నెట్లుత్పన్నమగునదియు; నెట్లు క్లేశములను బొందునదియు, నెట్లు మోసములు, కపటము లొనర్చి ధనము సంపాదించునదియు, గృహములు సంపాదించుట, తనకు భార్యల నెట్లు సంపాదించునదియుఁ, దనకు కొడుకు లెట్లేర్పడునదియు, వారి కొఱకు క్రూరకర్మ లెట్లు చేయునదియు, వృద్ధుఁడైన తర్వాత నీతనిని వారందఱెట్లవగించునదియు, నెట్టి కష్టములు కలుగునదియుఁ, జచ్చిన తర్వాత నేయే నరకములకుఁ బోవునదియు, మరలవచ్చి తల్లి ఉదరములో నెట్లు పుట్టునదియును, రజోవీర్యముల సంసర్గముచే నెట్లు బుద్బుదము, పిండము, శరీరము, చేతులు కాళ్లేర్పడునదియుఁ, గడుపులో నాతనికి పూర్వజన్మస్మృతి యెట్లు కలుగునదియుఁ, దల్లి కడుపులో నెట్టి భయంకర క్లేశములు కలుగునదియు, నెట్లు కొన్ని పురుగులచేఁ బట్టుకొనఁబడి తలక్రిందుగఁ బడియుండునదియు, నచ్చటనుండి బయట పడుటకు భగవంతు నెట్లు ప్రార్థించునదియు, నెట్లు జన్మవచ్చు

నదియు, నెట్లు బాలకుఁడు యౌవనుఁడగునదియు, యువావస్థలో నెట్లు మదము పుట్టునదియు, యౌవనోన్మాదమున నెట్లు పాపములు చేయునదియు, యువతీయువకులు పరస్పరము ఏవిధముగ నాకర్షింపఁబడి పరమార్థమునుండి చ్యుతులై విషయాసక్తు లగుదురో, కామమెట్టి భీభత్సక్రీడయో, స్త్రీ పురుష సంగమముచేతను, పురుషుఁడు స్త్రీ సంగమముచేతను నేవిధముగా వివేకభ్రష్టు లగుదురో, ఈ సమస్త విషయములను గూర్చి కపిలుఁడు మార్మిక శబ్దములతో నుపదేశించెను.

తదనంతరము కపిలభగవానుఁడు దేవహూతికి ధూమమార్గమును గూర్చియు, అర్చిరాది మార్గమును గూర్చియు వర్ణించెను. కామ్యకర్మ లొనర్చువారు నానాకామనానుసారముగ నాయా లోకములకుఁ బోయి, యచ్చట పాపపుణ్యముల ననుభవించి, కొంత మిగులగాఁ గర్మానుసారముగ మరల భూమిపై జన్మించును. సకామ కర్మలవలన జననమరణ రూపమగు సంసార చక్రము తెగదు. కావున మాతా! సర్వశ్రేష్ఠమగు సాధనము భక్తిమార్గమే. ఏ పరమపురుషుఁడగు పరమాత్మ పాదపద్మములు పరమపూజనీయములు, భజనీయములో అట్టి పరమేశ్వరుని తద్గుణాశ్రయమగు భక్తిద్వారా భజింపవలెను. ఇదియే శ్రేష్ఠమగు మార్గము. ఇదియే సరళ సాధనము, ఇదియే సర్వోపయోగమగు పథము, ఇదియే ప్రభు ప్రాప్తికి ఉత్తమోపాయము. వాస్తవముగ ముఖ్యతత్త్వమొక్కటియే. ఉపనిషత్తులలో దానిని బ్రహ్మయనిరి. యోగశాస్త్రజ్ఞులు దానిని పరమాత్మయనియు, నీశ్వరుఁ డనియు ననిరి. సాంఖ్యవాదులు దానిని బురుషుఁడందురు. భక్తిశాస్త్రమందు దానిని

భగవంతుఁడనిరి. జ్ఞానులాతనిని నిర్గుణుఁడందురు. పరమరసికులగు భక్తులాతనిని భగవంతుఁడని నమస్కరించి, పూజించి, యారాధించుచుందురు. ఆతనిని బొందుటకు నానావిధములగు శుభకర్మలొనర్చుచుందురు. కొందఱు పెద్దపెద్ద యజ్ఞయాగాదులొనర్చుచుందురు. తపో, దాన, వేదాధ్యయన, వేదాంతవిచార, మనోనిగ్రహ, కర్మ, సన్న్యాస, యోగ, భక్తి, నివృత్తి ప్రవృత్తి మొదలగు మార్గములను గ్రహించుట ఆతని ప్రాప్తికొఱకే చేయఁబడుచుండును. కావున నే సాధనచేతనైనను జిత్తమును సదా భగవంతునిపైనుంచి, సమస్తకర్మఫలముల నాతనికర్పించి, నిరంతరము భగవచ్చింతనము చేయుచుండవలయును. ఇదియే జీవితమునకు పరమసారము. దీనిలోనే మనుష్యజన్మకు సార్థకత కలదు. ఇదియే జీవికి చరమలక్ష్యము."

మైత్రేయమహాముని యిట్లనెను:— "విదురా! ఈ విధముగ భగవానుఁడు తన తల్లికి తత్త్వజ్ఞానోపదేశమును జేసి యూరకుండెను."

అంత శౌనకుఁడిట్లనెను:— "సూతా! భగవంతుని చరిత్రము చాల అద్భుతమైనది. కపిలుఁడిట్లు తన తల్లికీ విధముగ నత్యంత సంక్షేపముగ సూత్రరూపమున నుపదేశించినాఁడా? లేక నీవే దాని నింత సంక్షేపము కావించితివా? దీనివలన సూతా! మాకు మాత్రము తృప్తి కలుగలేదు."

ఇదివిని సూతుఁ డానందమును బ్రకటించుచు నిట్లనెను:— "మహాభాగా! మీకు తృప్తియగు టెట్లు? మీరు పరమరసిక శిరోమణులగు శ్రోతలు. కపిలుని చరిత్రయే యిట్టిది. ఆతఁడు జ్ఞానావతారము. కృతయుగములోని ప్రథమఋషి అవతారము.

ఈ భాగవతకథా ప్రసంగమందు నే నాతని యుపదేశసారమును నత్యంత సంక్షేపముగ వర్ణించితిని. భగవానుఁడు తన తల్లికి విస్తారముగ సమస్త విషయముల నుపదేశించెను. మనీషులు సేశ్వరసాంఖ్య మనియు, నిరీశ్వరసాంఖ్య మనియు రెండు రకము లుగఁ జెప్పుదురు. వర్తమానకాలమున 'సాంఖ్యదర్శన' మను పేరటనున్న గ్రంథమును దర్శనప్రధానుఁడగు కపిలుఁడను ముని రచించియుండును. అందాతఁడు ఈశ్వరసిద్ధిని సందేహించెను. కపిలభగవానుని సాంఖ్యశాస్త్రవర్ణనము శ్రీమద్భాగవతమందు విస్తారముగ లభించుచున్నది. ఈ విధముగ సుందరప్రక్రియతోఁ గూడిన సాంఖ్యవర్ణనము ఇంత విస్తారముగ నెచ్చటను లభిం పదు. ఈ వర్ణనమును నేను ప్రసంగానుసారముగ వేఱొకచో విస్తారముగఁ జెప్పెదను. ఇచ్చట విస్తారముగ వర్ణించుచోఁ గథాప్రవాహ మాగిపోఁగలదు. మీ యాజ్ఞయగుచో వర్ణించె దను, చెప్పుఁడు."

అంత శౌనకుఁ డిట్లనెను:– "కాదు సూతా! ఊరక మేము నీకు జ్ఞాపకపర్చితిమి. నీవు చెప్పుచున్న విధము బాగు న్నది. ముందుగా నీవు కథాభాగమును బూర్తి కావింపుము. కథలైన తర్వాత నీవు మాకు విస్తారముగ సాంఖ్యాది సమస్త శాస్త్ర రహస్యములను జెప్పవచ్చును. తల్లి కుపదేశించి కపిలుఁ డేమిచేసెను. తత్త్వజ్ఞానానంతరము పూజనీయ యగు తల్లి స్థితి యెట్లైనది చెప్పవలయును."

శౌనకుని యీ ప్రశ్నములను విని సూతుఁడు ప్రత్యుత్తర మీయ నుద్యుక్తుఁడయ్యెను.

—:—

# కపిలదేవుని గృహత్యాగము.

బుద్ధిద్వారా విచారించి విషయ నిశ్చయమును గావించుట వేఱు, చిత్త స్వాభావికవృత్తి వేఱు. తమ ఆత్మీయ జన వియోగముచే గొప్ప త్యాగులకును, విరాగులకునైనను సాధారణముగ క్షోభము కలుగును. స్వజనుల స్నేహానుబంధము మునులకుఁ గూడ దుస్త్యజమే. ఎవరి పిల్లవాఁడైనఁ ద్యాగి, విరాగి, మహాత్ముఁ డయ్యెనేని 'ఆహా! ఈతని తల్లిదండ్రులు ధన్యులు. ఈతఁ డుభయ వంశములవారినిఁ దరింపఁజేసినాఁడు. పుత్రుఁడనిన నిట్టివాఁ డుండవలయును.' అని అనుచుందుము. కాని మన పుత్రుఁడు గృహత్యాగమునుగావించి విరాగి యగునెడల మన హృదయము బ్రద్దలగును. అది యట్లు, ఇది యిట్లని వానినెట్లైన నాపఁ బ్రయత్నించెదము. ఆతఁడు త్యాగి, విరాగి యగుచో మన యిరువదొక్క తరములు తరించునను జ్ఞానము ఆ సమయమున లుప్తమగును. దీనినే సహజస్నేహమందురు. సహజస్నేహము సాధారణముగఁ జాల కష్టమున భంగమగును.

కపిలదేవుఁడు తన జననికి యోగ, భక్తి, జ్ఞానములను గూర్చి యుపదేశించెను. జీవులగతినిగూర్చియు, నానా యోనులందు భ్రమించు జీవుల జనన మరణ విషయములను జెప్పెను. ఆతఁ డుపదేశించుటయే గాక శక్తిపాతము కావించి తల్లిని పూర్ణమగు నాత్మజ్ఞాన సంపన్నను గావించెను. ఇప్పు డాతఁడు తల్లితో నిట్లనెను:- "అమ్మా! నీవు పరమార్థరహస్యము నెఱిఁగితివిగదా?"

దీనతాస్వరమున దేవహూతి యిట్లనెను:- "ప్రభూ! మీ యసీమ యనుకంపచే నా సంశయములన్నియు నివారణమైనవి. ప్రకృతిపురుషులకు గల భేదము తెలిసినది. మీ దయచే నాత్మతత్త్వముయొక్క గూఢరహస్యము నెఱిఁగితిని. ఇప్పుడు నే నేమి చేయవలయును?"

కపిలదేవుఁడిట్లనెను:- "అమ్మా! జ్ఞానముకలిగిన తర్వాత జీవునకిఁకఁ జేయవలసిన దేమియును లేదు. చతుర్థ భూమికకుఁ జేరఁగానే జీవుఁడు సంసారమునుండి ముక్తుఁడు కాఁగలఁడు. సప్తమ భూమికను జేరక పూర్వమే యాతని శరీరము పడిపోయెనా, కొంచెము జ్ఞానము కొఱవయగుటచేఁ దత్కాలముక్తి కలుగదు. పైన దివ్యలోకములలో వాని నభ్యసింపవలసి యుండును. వాని జ్ఞానమును బ్రహ్మలోకములో బ్రహ్మ పూర్తి కావించును. కల్పాంతమందు బ్రహ్మతోఁగూడ ముక్తి పొందును. క్రమముగ నైదవ, ఆఱవ, యేడవ భూమికల నిచ్చటనే చేరుకొనినవాఁడు వెంటనే ముక్తిని బొందును. అట్టివాఁడు ప్రకృతి మండలములోని సమస్తావరణములను భేదించుకొని సత్యస్వరూపమందు లీనమగును. సప్తమ భూమికను జేరిన తర్వాత ఆత్మజ్ఞాని యొక్క శరీరము రెండు మూఁడు వారములకంటె నెక్కువగ నిలువఁజాలదు. ఏలననఁగా నాతఁడు శరీరధర్మముల కతీతుఁడగును. కావున నతఁడు తనంతటఁ దా నేపనియుఁ జేయఁజాలఁడు. ఆఱవభూమిక నందినవాఁడు తన చేతితో నేమియుఁ జేయఁజాలఁడు. మానవున కేస్థితి యిచ్చట కలుగునో పరలోకములో నదియే కలుగును. ఇచ్చట ముక్తిపొందినవాఁడే అచ్చట

ముక్తి పొందును. కావునఁ బంచమభూమిక కావల తితిక్ష నభ్యసింపవలయును.''

దేవహూతి యిట్లనెను:- "స్వామీ! తితిక్షయన నేమి?"

కపిలుఁ డిట్లనెను:- "వచ్చిన సుఖదుఃఖముల నివృత్తిని గూర్చి యాలోచింపక సహించుటకుఁ దితిక్షయందురు. మనకు చలివేసిన గుడ్డలు కప్పుకొందుము, చలిమంటను వేసికొందుము, ఇంటిలోనికి దూరుదుము. చలిపోఁగొట్టుకొనుటకై ప్రయత్నించెదము. ఈవిధముగఁ బ్రయత్నింపకపోవుటకే తితిక్ష యని పేరు. ఆఁకలి కాఁగానే మనము దానినిఁబోగొట్టుకొనుట కుపాయ మాలోచించుచున్నాము. అట్లాలోచింపరాదు. శరీరము మీఁద నల్లులు, దోమలు, తేళ్లు, సర్పములు ప్రాకెనా వెంటనే స్వతః వాటిని దోలుటకుఁ జేతులు పోవును. శరీరము మీఁద నవి యెక్కినను వాటిని దోలుటకుఁ బ్రయత్నింపరాదు. ఇదియే తితిక్ష.''

తల్లి యిట్లనెను:- "అయితే స్వామీ! శరీరరక్షణ మెట్లు కలుగును?''

కపిలభగవానుఁడిట్లనెను:- "అమ్మా! శరీరభానమున్నంత వఱకు శరీర రక్షణోపాయమును జూచుకొనవలయును. ఈ భావముతోడనే సాధన చేయవలయును. దీనితోడనే తరించ వలసి యున్నది. మనము సత్రములో ఒకరాత్రి యుంటి మనుకొనుఁడు. అప్పుడు మనము దానిని చిమ్మి శుభ్రము చేసికొందుము. దానిని వదలివెళ్ళిన తర్వాత నిఁక దాని స్పృహయే మన కుండదు. కావునఁ జతుర్థ, పంచమ భూమికలవఱకు శరీర రక్షా ప్రయత్నమును జేయుచుండవలెను. ఇఁక నాపై భూమిక

లకు అనఁగా శరీరభానము లేకుండఁబోయిన, నప్పుడు శరీర మున్నను సరియే లేకున్నను సరియే. జ్ఞాని కా చింత లేదు. భానము నుండదు. పాము కాటువేసినను, సింహము తినివేసి నను జ్ఞానికి దానియందు మమత్వ ముండదు. నీవిఁకఁ దితిక్ష నభ్యసింపుము.''

తల్లి యిట్లనెను:- ''మంచిది. నేను శక్తియున్నంతవఱ కీ దేహమును మఱచు నభ్యాసము చేసెదను. మీరిక్కడ నా దగ్గఱలోనే యున్నారుకదా!''

భగవంతుఁడు నవ్వి యిట్లనెను:- ''అమ్మా! ఎవరెవరి వద్ద నుందురు? అందఱు స్వయముగ సాధనద్వారా స్థితిని బొందవలయును. నాకిప్పుడు మీరాజ్ఞ యీయవలయును.''

అత్యంతాశ్చర్యముతో దేవహూతి యిట్లడిగెను:- ''ఎక్కడికి? మీరు కూడ మీతండ్రివలెనే నన్ను వదలిపెట్టి వెళ్లెదరా యేమి?''

కపిలుఁ డిట్లనెను:- "అమ్మా! అందఱు నేదోదినమున సమస్తమును వదలిపెట్టి వెళ్లవలసియుండును. మనలను వివశులఁ గావించి కాలము మనవారినుండి విడదీసిపోవుచుండఁగా, మనమే మన మమత్వమునువీడి వీటినన్నిటిని వదలి యేల పోఁగూడదు?"

తల్లి యన్యమనస్కభావముతో నిట్లనెను:- "ప్రభూ! ఇది నిజమే, కాని మీరు వదలున దేమి కలదు? గ్రహించున దేమి కలదు? మీ రెల్లప్పు డన్నిటికి వేఱుగనే యున్నారు."

భగవంతుఁ డిట్లనెను:- "అమ్మా! ఇది నిజమే కాని, త్యాగాదర్శమును జూపవలసియున్నది. ముముక్షువులకు వైరా

గ్యోపదేశము చేయవలయును. నీకును జ్ఞానము కలిగినను నాపై మమత్వము కలదు. నేను వేత్తనైననే అది తొలఁగఁ గలదు; కావున నా కాజ్ఞయిమ్ము." ఇట్లు పలికి కపిలుఁడు తన కమండలువును దీసికొని వెళ్లుట కుద్యమించెను.

మైత్రేయుఁడిట్లనెను:- "విదురా! దేవహూతికి జ్ఞానము కలిగినను, జగన్మిథ్యాత్వమును దెలిసికొన్నను మాతృహృదయము మాతృహృదయమే కదా! తన హృదయ శకలము, తన బాహ్య ఆత్మ, తన ప్రాణముల కంటెఁ బ్రియమైన పరమాత్మ స్వరూపుఁడగు పుత్రుఁడు వెళ్లుటను గాంచి ఆమె కంట నీరు పెట్టెను. ఆమె కన్నులనుండి ప్రేమాశ్రుధారలు రెండు ప్రవహించెను. కంఠము రుద్ధమయ్యెను. తన వత్సమును గోల్పోయిన గోవు యెట్లు దుఃఖించునో అట్లే దేవహూతియు దుఃఖించెను. పుత్రవియోగ ప్రవాహ మామె తత్త్వ జ్ఞానమును గొట్టివేసెను. మాయామోహ రహితుఁడును, వివేక వైరాగ్యములకు సాక్షాత్సజీవమూర్తియు నగుఁ గపిలుఁడు బ్రహ్మవాదిని యైన తల్లికి బ్రణమిల్లెను. తల్లియు గురుభావముతో నాతకిని పూజా ప్రదక్షిణములు కావించెను. ఈ విధముగఁ బరస్పరము వందితులై సత్కృతులై యిద్దరును విడిపోయిరి. కపిలదేవుఁడు తన తల్లిని సరస్వతీతటమునఁగల సిద్ధాశ్రమమున వదలి యీశాన్యదిక్కుగాఁ బోయెను.

అచ్చటనుండి భగవానుఁడు గంగాతటమునకు వచ్చి, గంగాశోభను దిలకించుచు, దాని యొడ్డుననే వెళ్లెను. త్రిపథగామినియగు భగవతీ భాగీరథీతట శోభను దిలకించుచు గంగాసాగర సంగమ స్థలమును జేరెను. కపిలుఁ డచ్చటకు రాఁగానే

సముద్రుఁడు సశరీరుఁడై వచ్చి స్వాగత సత్కారములు కావించెను. అచ్చటకు రాఁగానే ఆకాశచారులగు సిద్ధ, చారణ, గంధర్వాప్సరస, విద్యాధర, ఋషి, ముని, దేవతలందఱును స్తుతించిరి. ఆతనిపైఁ పుష్పవృష్టిని గురిపించిరి.

సముద్రునితోఁ గపిలుఁ డిట్లనెను:– "నేనిచ్చట నుండఁ దలఁచినాను. నీవు నాకు స్థానమిమ్ము."

సముద్రుఁడు వినయముతో నిట్లనెను :– "ప్రభూ! మీరు నన్నుఁ గృతార్థునిఁ జేయఁదలఁచుచున్నారు. నాకు దేవ దుర్లభసౌభాగ్యమును బ్రసాదించుచున్నారు. ఇది నాభాగ్యము. నేనిచ్చటనుండి తొలఁగి మీకొక సొరంగమును వదలెదను. మీరెల్లప్పుడు దానిలో నివసింపవచ్చును."

భగవానుఁ డిట్లనెను:– "కాదు. నేను జలములలో నుండియే యోగాభ్యాస మొనర్చెదను. అచ్చటనే త్రిలోకములకు శాంతిప్రదానము కావించుటకు ఘోరతపస్సును జేయుదును. సాంఖ్యాచార్యులకును, సిద్ధులకు నుపదేశించెదను."

సముద్రుఁ డిట్లనెను:– "స్వామీ! ఈ మర్త్యలోకవాసులకుఁగూడ మీ దర్శనము కావలెను. వారును మీస్థానమును జూచుటకు రావలసియుండును."

భగవానుఁడు ప్రసన్నుఁడై యిట్లనెను:– "మంచిది. సంవత్సరమున కొకదినమున మకరసంక్రాంతి దినములలో నీ విచ్చటనుండి తొలఁగి పోవలయును. ఆ దినమున నిచ్చటి కెవరు వచ్చి నా దర్శనము చేయుదురో వారక్షయపుణ్యమున కధికారులగుదురు."

మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురా! సముద్రుఁడు భగవదాజ్ఞను స్వీకరించెను. అందువలన నేఁటికిని మకరసంక్రాంతి దినమున సముద్ర మచ్చటనుండి తొలఁగి పోవును. దూర దూర ప్రదేశములనుండి యాత్రికులు వచ్చి సంగమ స్థానమున స్నానమాడి కపిలుని యర్చావిగ్రహమును దర్శించు చుందురు. భాగ్యశాలురకు ప్రత్యక్షముగఁ గపిలాచార్యుని దర్శనముకూడ లభించుచుండును. ఈవిధముగ భగవానుఁడు కల్పపర్యంత మచ్చటనుండి తపస్సు చేయుచుండును. నేనత్యంత సంక్షేపముగఁ గపిలచరిత్రను నీకు వినిపించితిని. ఇఁక దేవహూతి యొక్క సమాచారమును వినుఁడు."



## దేవహూతి బ్రహ్మప్రాప్తి

మనీషులు నిత్య, ముక్త, బద్ధ, ముముక్షువులని నాలుగు రకముల జీవులున్నారని చెప్పిరి. నిత్యజీవులు కల్ప పర్యంతముండి సృష్టి కార్యమందు సహాయముచేయువారు. మను ప్రజాపతి, ఇంద్రాదు లిట్టివారు. ముక్తులు, అనిత్య పదార్థములందు అహంకార మమకారము లుంచక, స్వకర్తృత్వమును భావింప కుండువారు, నారద, శుక, సనకాదులట్టివారు. బద్ధులగు నజ్ఞాన జీవులు అసత్తును సత్తుగ భావించి, దానియందాసక్తినిఁ జెంది కర్మలు చేయువారు; సాంసారిక మానవులు, పశు, పక్షి, కీట, పతంగ, వృక్షలతాదులు. ఇఁక ముముక్షువులు ఈ దృశ్య జగత్తున కావల యేమి యున్నది? యను జిజ్ఞాస కలవారు.

ఇతర యుగములలో నిత్య ముక్తపురుషుల దర్శనమగు చుండె డిది, కాని కలి కాలమందు అదృష్టవంతున కెవనికో తప్ప వీరి దర్శనము కాదు. ఇప్పుడు బద్ధులు, ముముక్షువులని రెండు రకముల వారు కనఁబడు చున్నారు. పరమాత్మునియందు, పరలోక విషయములం దనురాగము లేక, స్వాభావికముగఁ గర్మల యందాసక్తి కలిగి, సాంసారిక వైషయిక పదార్థములను బొందుటకై ప్రయత్న శీలురగుటయే పరమార్థ మనుకొనుచు, దినుట, సంతానమును గనుట, శరీరమును, పరివారమును బోషించుటయే వ్యాపారముగఁ గలిగి, ఈ ప్రపంచమునకు స్వామియగు భగవంతుని జిజ్ఞాసయే లేక, సంసార బంధనము నుండి ముక్తి పొందవలయునను కోరిక లేక, విషయములందే సుఖమును బొందుచుండువారు మానవులు కానిండు, వృక్ష పశుపక్ష్యాదులు కానిండు వీరు బద్ధులు.

ఈ సంసారము అనిత్యముగను, బంధనముగను దోఁచి, సంసార బంధనము నుండి ముక్తి పొందవలయునను యిచ్ఛాంకు రము కలవారు ముముక్షువులు. సమస్త శాస్త్రముల యుప దేశమీ ముముక్షువుల కొఱకే. ముక్తులు ముక్తులేకదా! నిత్యులును సామర్థ్యవంతులే. బద్ధుల కుపదేశము చేయుట వ్యర్థము. గొంతువఱకు మురికి నీటి చెఱువులో నుండి యా మురికి జలములనే త్రాగువారికి గంగాజల మొసంగుట వ్యర్థము. ఆతఁడు త్రాగనే త్రాగఁడు, జ్ఞాన పిపాస కలవానికే పరమా ర్థోపదేశము.

జిజ్ఞాసువున కెంతగా జ్ఞానము కలుగుచుండునో, యీఁ యనిత్య, నశ్వర సంసారమునుండి వాని దృష్టి యెంతదూరముగా

బోవునో, వాని స్థితి అంత యున్నతి స్థాయిలోనికిఁ బోవును. అతఁడొకటి తర్వాత నొకటిగా జ్ఞాన భూమికలను దాఁటి యీ సంసారమందే జీవన్ముక్తుఁడగును. జీవత్వమునకు బీజము అహంకారము, మమతాభాసము, శరీరాహంకారము, మనస్సులో నానా విధములగు నూహాపోహాలు రేగుట, మనస్సు వివిధ విధ సంకల్ప వికల్పము లొనర్చుట, స్వప్నమందు సాంసారిక పదార్థ చింతనము, శరీరమే సర్వస్వమని భావించుట, వృక్షమువలెఁ జేష్టావిహీనుఁడగుట ఇవియే అజ్ఞాన లక్షణములు. దైవ వశాత్తుగ భగవత్కృపచే జీవుఁడీ యజ్ఞానమునుండి విముక్తుఁడై, ఆత్మ జిజ్ఞాస చేయునెడల, నా జిజ్ఞాసువు శాస్త్ర శ్రవణమున కధికారియై ముముక్షువనఁబడును. జ్ఞానమున కనంత భూమికలు కలవు. కాని తత్త్వవేత్తలు ఏడు భూమికలనే ముఖ్యముగ నెన్నిరి. భూమిక యనఁగాఁ జిత్తముయొక్క అవస్థకు పేరు. ఈ యేడవస్థలలో సాధన రూపమని సిద్ధ రూపమని రెండు రకములుగఁ గలవు. సాధన రూపములు మూఁడు. సిద్ధ రూపములు నాలుగు. ప్రథమ భూమిక 'శుభేచ్ఛా'. సాంసారిక విషయములనుండి చిత్తమును దొలఁగించి 'అయ్యో! నా జీవితము వ్యర్థమగుచున్నదే, నేనును బశు పక్షాలతా వృక్షాదుల వలెనే విషయములలోఁబడి మూఢుఁడనై యున్నాను శాస్త్ర చింతనము, సత్సంగము చేయవలయును." అను నిట్టి శుభేచ్ఛ యే జీవుని హృదయమందు ప్రబలముగ నుండునో అట్టి జ్ఞాని ప్రథమ భూమికలో నున్నాఁడని గ్రహింప వలయును. ఇట్టి యిచ్ఛయున్నచో మానవుఁడున్నత పథములో నగ్రేసరుఁ డగును.

ద్వితీయ భూమిక పేరు 'విచారణ'. శుభేచ్ఛ కలిగిన తర్వాత సాధు సజ్జన సత్సంగ మొనర్చుట, శాస్త్ర శ్రవణాభ్యాసము, విషయ విరాగము ఇది విచారణయొక్క స్థితి, ఈవిధముగ సత్సంగము, సద సద్విచారము చేయఁగా చేయఁగా మనస్సత్యంత సూక్ష్మమగును. వాస్తవమున నిది సత్యము, ఇది మిథ్యాయని, తెలిసి కొనఁగల సూక్ష్మ స్థితికి 'తను మానస' యని పేరు. ఇది జ్ఞానమునకు మూఁడవ స్థితి, ఈ మూఁడును అభ్యాసకాల మందుండుటచే సాధన రూపములు. నాల్గవ భూమిక పేరు 'సత్వాపత్తి', మూఁడవస్థలు దృఢమై, ప్రపంచ వైరాగ్యము కలిగి, శ్రవణ, మనన, నిధి ధ్యాసనములద్వారా ఆత్మస్వరూప మందుండిన మన సాధనావస్థ సమాప్త మైనదని గ్రహింపవలయును. అప్పటికి మనకు యథార్థమగు బ్రహ్మ జ్ఞానము కలిగి నట్లగును. అప్పుడింకఁ జేయవలసిన దేమియు నుండదు.

ఇట్టి స్థితి కలిగినపుడు సాంసారిక మాయ యేమియు బాధింపదు. కాని అణిమా, మహిమాది దివ్యవిభూతులు వశపడును. వాటియందాసక్తి నుంచక బ్రహ్మపధార్థమందే తన లక్ష్యమును లగ్నముచేసి యుంచుటకు 'అసంసక్తి' యందురు. ఇట్టి జ్ఞానము 'పంచమభూమిక'. ఈ స్థితిలోఁ జిత్తమెల్లప్పుడు నాత్మానందములో మగ్నమై యుండును; కాని సంసార భాసముండును. యోగ్యమగు నధికారి లభించిన నాత్మ జ్ఞానోపదేశమునుగూడ యీయవచ్చును. ఆఱవ భూమికకుఁ జేరఁగానే వానికీ ప్రపంచము కనఁబడదు. నిరంతర మాత్మానందములో మగ్నుఁడై యుండును. శరీర స్పృహ యుండదు.

ఎవరైనను నోటఁబెట్టిన నభ్యాస వశమున మ్రింగును. ఎక్కడి కైన వెళ్ళిన నదే వెళ్ళుట, కూర్చుండిన నదే కూర్చుండుట. ఎవ్వరితో మాటలాడుట యుండదు. శరీరము నుండి వస్త్రము తొలఁగిన వానికి గుర్తు యుండదు. ఎవ్వరైన శరీరమును గోసిన దాని బాధ యుండదు. సుగంధిత పదార్థములను రాచిన దానికి సుఖమును బొందఁడు. దీని పేరు 'పదార్థాభావినీ" భూమిక. ఈ యాఱు భూమికలు పరాకాష్టను బొందిన దానిని 'తురీయ భూమిక' యందురు. ఇది యేడవది. వీనిలో మొదటి మూఁడవ స్థలు జాగ్రజ్జగత్తునకు సంబంధించినవి, నాల్గవది. బ్రహ్మ జ్ఞానికి సంబంధించినది. పంచమ షష్ఠమ, సప్తమ భూమికలు జీవన్ముక్త పురుషలవి. ఈ యేడిటికి పైన నెనిమిదవ భూమిక యొకటి కలదు. అది 'తురీయాతీతావస్థ' దానిలో విదేహ ముక్త పురుషుఁడుడుండును. వాఁడు కనఁబడఁడు.

జ్ఞానములో శుభేచ్ఛ యుత్పన్నమగుట చాల యదృష్ట కరమగు విషయము. తర్వాత సాధనచేసి బ్రహ్మజ్ఞానమును బొందుట సమస్త ద్వంద్వములకు జలాంజలి యిచ్చినట్లే నాల్గవ భూమికలో బ్రహ్మజ్ఞాన జలను బొంది జ్ఞాని జలములో పద్మపత్ర నుట్లుండి సర్వకార్యములు చేయవచ్చును. బ్రహ్మ జ్ఞాని యాచార్యుఁడై యుపదేశించును, రాజై శాసించును. త్యాగియై విచరించును, సైనికుఁడై యుద్ధము చేయును. అనేక వ్యాపారములు చేయుచున్నను ఆతఁడు వాని ఫలములందాసక్తిని జూపఁడు. నిరహంకారముతోఁ జేసిన కర్మలు బంధన హేతువు కావు. రాజర్షియగు జనకుఁడు వేదవ్యాసుఁడు, నారదాదులీ భూమిక యందుండి లోకోపకార మొనర్చిరి. అదియును గాక

వ్యాస నారదాదులు ఈశ్వరావతారములే. వీరికి భూమిక లేమిటి, వీరు భూమికల కతీతులు. అయినను స్థితిని దెల్పుటకిట్లు చెప్పఁబడినది.

పంచమ భూమికయగు నసంసక్తిలో నుండి జీవన్ముక్తుఁడు లోకబాహ్యుఁడగును. ఆతనికిఁ దనవారని పరాయి వారని యుండదు. ఈ దృశ్యజగత్తు ఆతని కప్పుడప్పుడు స్ఫురించు చుండును. చతుర్థ భూమికలో బ్రహ్మజ్ఞాని నిరంతర ముపదేశించు చుండును; అందఱితో నవ్వుచు మాటలాడు చుండును. ఎట్లు వ్యవహరింపవలయునో అట్లు వ్యవహరించును. కాని యీ పంచమ భూమికలో నీ వ్యవహార ముండదు. ఎవఁడైన జ్ఞాని వచ్చుచో వానికి జ్ఞానోపదేశముకూడ చేయును, లేకున్నఁ దా నితరులకుఁ దెలియకుండునట్లు పిచ్చివానివలెఁ దిరుగును. జడభరతుఁడు, దత్తాత్రేయుఁ డీ భూమికలో నుండి తిరిగిరి. జడభరతుఁడు పిచ్చివానివలెఁ దిరుగుచు నెవఁ డేది చెప్పిన దానినిఁ జేసెడు వాఁడు. పాలకిని మోసెను. బలికిఁ గొని పోయిరి. ఆతఁ డచ్చటనే పడియుండెను. కాని రహూగణము అధికారులని గ్రహించి వారికి మహత్తరమగు బ్రహ్మజ్ఞానోపదేశము కావించెను. స్పష్ట శబ్దములతో నాతఁడిట్లు చెప్పెను:—"అబ్బాయీ! మేమును ఒకానొక దినమున రాజులమే. నీవొక దేశమునకు రాజవు. నేను సమస్త భూమండలమునకు రాజును." ఇదేవిధముగ దత్తాత్రేయుఁడును బిచ్చివానివలెఁ గుక్కలను దీసికొని తిరుగు చుండును; కాని యొకప్పుడు యదువునకును, మఱియొకప్పుడు కార్త వీర్యార్జునునకు నుపదేశించెను.

సప్తమ భూమికలో నుపదేశాదు లుండవు. బాహ్యజ్ఞానముకూడ యుండదు. శరీరముమీఁద వస్త్రాదులు కూడ యుండవు. మల మూత్రముల జ్ఞానముకూడ యుండదు. ఎవఁడైన నన్నమును బెట్టిన దానినిఁ దినును, గోమయమును బెట్టిన దానినిఁ దినును. ఋషభదేవాది యవధూత లీ భూమికను బ్రదర్శించిరి.

ఈ నాట చతుర్థ, పంచమ, షష్ఠమ భూమికలందు శరీరము ప్రారబ్ధమువశమున యంత్రమువలెఁ దిరుగుచుండును. కాని సప్తమ భూమికలో శరీర వ్యాపారమే యుండదు. ఎవఁడైన లేవఁదీసిన లేచును, పరుండఁబెట్టినఁ బరుండును, ఏదైన వస్తువును నోటఁ బెట్టిన నది నోటిలోనే యుంచుకొనునుగాని మ్రింగనుగూడ మ్రింగఁడు. ఇది సర్వోత్కృష్టావస్థ. పూర్తిగా సంసార నాశనమగును. వృత్తి యత్యంతోన్నతికిఁ బోవును. ఈ స్థితిలో శరీరము ఇరువదొక్కటి, ఇరువదిరెండు దినముల కంటె నధికముగ నిలువదు. ఈ భూమిక లన్నియు జ్ఞానమునకు సంబంధించినవి; కాని భగవద్భక్తునకుఁ గేవలము విశుద్ధ భక్తి ద్వారా స్వతః ప్రాప్తించును. దేవహూతికి తీవ్రభక్తియోగము ద్వారానే యీ సప్తమభూమిక ప్రాప్తించినది.

మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురా! కపిలుఁడు వనమునకు వెళ్లిన తర్వాత దేవహూతి సరస్వతీనదీ తటమందు బిందుసరోవర సమీపమున సర్వసుఖ సంపన్నమును, సర్వైశ్వర్య పరిపూర్ణమగు విమానమందు నివసించు చుండెను. ఏ యనుపమ సుఖము కావలయునని స్వర్గీయ లలనలు కూడ మిక్కిలి ప్రీతితోఁ గోరుచుందురో, ఆ దివ్య గార్హస్థ్య సుఖమునఁ

గూడ దేవహూతి సర్వథా త్యజించెను. ఆమె సుఖద, సుందర; స్వచ్ఛ, శీతల సలిలములందు త్రికాలముల స్నానముచేయుచుండెడిది. స్నానముచేసి వెంట్రుకల నారఁబెట్టుకొనెడిది కాదు. దువ్వుకొనెడిది కాదు. అందువలన నా వృద్ధావస్థలో నామె వెంట్రుకలు పెద్ద జడలు కట్టెను. ఒక మలిన వస్త్రముఁను గట్టుకొని యామె ధ్యాన మగ్నయయ్యెను.

కర్దముని తపోబలమునఁ బ్రాప్తించిన యాదివ్య విమానమందామె నివసించుచున్నను నామెకే వస్తువు ననుభవించుటకైన నిష్టము లేదు. పాలనురుగువంటి శయ్యలు శూన్యములై యుండెను. ఏనుఁగు దంతములతో సువర్ణ మండితములైన విశాలములగు మంచములు మెత్తని నునుపైన దిండ్లతోడను, అప్పుడప్పు డేకిన మెత్తని దూది పరుపులతోడను శోభిల్లుచున్నను నవి యట్లే పడియుండెను. అసంఖ్యాకములగు మణులు కూర్చిన సువర్ణ, రజత పాత్రలుండెను. వైడూర్య, ముక్తా మణులచే నిర్మింపఁబడిన వేదికలు తళతళ మెఱయుచుండెను. అమూల్యములై, బంగారు పని చేయఁబడిన పట్టు వస్త్రములసంఖ్యాకములుగ నుండెను. నలువైపుల మణి ప్రకాశము వ్యాపించెను. వేల కొలఁది విద్యాధరయువతులు తమ తళుకు బెళుకుల చేతను, జాకచక్యము చేతను మెఱపు తీఁగల వలె నిటు నటు శోభన వెదఁజల్లుచుఁ దిరుగుచుండిరి, కాని దేవహూతి కటువైపు మనస్సు పోనే పోవుట లేదు.

ఎప్పటివలె నీయేడుకూడ వసంతము వచ్చెను. వచ్చుటయేమిటి? అచ్చట పండ్రెండు నెలలు వసంతమే యుండును. అచ్చటి యుద్యానవనములో నెన్నడు నాకురాలని కల్పవృక్ష

ములు కొల్లలుగ నున్నవి. అవి యెప్పుడును బూచుచుండును. మధులోలుపులగు భ్రమరములెల్లప్పుడు వానిపై గుంజారవము చేయుచుండును. సదా తమ పుష్పగంధముచే యోజనముల దూరము వఱకు ఆయాశ్రమ ప్రదేశమును సువాసిత మొనర్చు చుండెను. అచ్చటి యుద్యానవనము స్వర్గీయ యుద్యానవనము నకు మించి యుండెను. దేవహూతికివి యేవియు నిప్పు డక్కఱ లేదు. ఆమె కిప్పుడు సదా తన పరమేశ్వరపుత్రుఁడగు కపిలుని యుపదేశము జ్ఞాపకమునకు వచ్చుచుండెను. ఐశ్వర్య భోగముల యెడలను, సమస్త సాంసారిక పదార్థముల యెడలను నామె యుపరతినిఁ జెందెను.

కపిల భగవానుఁడు చెప్పిన ధ్యానమార్గమున నామె యభ్యసించుచుండెను. కపిలుఁడు సగుణసాకారమూర్తి ధ్యాన మును గూర్చి చెప్పిన ప్రకారముగఁ గ్రమముగ నొక్కొక యంగమును జూచుచు నామె తీవ్ర భక్తియోగ ప్రవాహము చేతను, విధ్యుక్తముగ షోడశోపచారపూజ లొనర్చుటచేతను నామె దృష్టినుండి సంసారము మాయమయ్యెను. నిరంతరము ధ్యానయోగమున నుండుటచే నామెకు జీవభావము పోయెను. దీనివలన నామె సమస్త మాయిక క్లేశములనుండి బయటపడి పరమానంద నిమగ్నయయ్యెను.

ఇప్పుడామెకు శరీర భావమే లేదు. శరీరమునుండి వస్త్రము జారిపోయెను. ఇప్పుడు దిగంబరిగ నుండెను. కూర్చుం డఁబెట్టినఁ గూర్చుండును. దాసీలు పరుండఁబెట్టినఁ బరుండును. నిలుచుండఁ బెట్టిన నిలుచుండును. నోటఁబెట్టిన ముద్ద యట్లే యుండును. ఆమె యేమియును దినుటయును లేదు, త్రాగుట

యును లేదు. ఇట్లున్నరు నామె శరీరము శరత్కాలీన చంద్రుని వలె మెఱయుచుండెను. ధూళిధూసరితమగు నామె శరీరము గనినుండి వెలువడి యింకను సానబెట్టని మణివలె మెఱయుచుండెను. తిండి తినకున్నను పరమానందానుభవముచే నామె దివ్యశరీరము దుర్బలము కాలేదు. ఏలననఁగా మనస్సు సదా దివ్యరసాస్వాదనము చేయుచుండినది.

మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురా! ఈ విధముగ దేవహూతి తన పుత్రుఁడగు కపిలుని యుపదేశానుసారముగ నభ్యాసము చేయఁగా నల్పకాలమందే ఆమె సిద్ధి కలిగెను. ఆమె యాత్మ స్వరూపము నిత్య, ముక్త, పరబ్రహ్మ పరమాత్మను బొందెను. ఆమెకు సిద్ధి కలిగిన చోటు 'సిద్ధిపద' మను పేర లోకములోఁ బ్రసిద్ధినిఁ జెందెను. దీనివే 'మాతృగయ' యందురు, శరీరములో దైహికమలము లేకపోవుటచే బ్రహ్మ ప్రాప్తి యనంతరము దేవహూతి శరీరమొక స్వచ్ఛ సలిలమగు సరిత్తుగఁ బరిణమించెను. విదురా! ఇప్పుడు నీకు కపిలుని యొక్కయు, నాతని తల్లియగు దేవహూతి యొక్కయు చరిత్రమును నీకతి సంక్షేపముగఁ జెప్పితిని. ఇంకేమి యుడుగఁ దలఁచినావు?"

విదురుఁడిట్లనెను:- "స్వామీ! నీవు నాకత్యంత పావన చరిత్రమును జెప్పితివి. దీనిని వినిన నాకు తృప్తి కలుగుటలేదు. మాటి మాటికి దీనినే వినవలె ననిపించుచున్నది."

దీనికి ప్రసన్నుఁడై మైత్రేయుఁ డిట్లనెను:- "విదురా! ఈ చరిత్ర యట్టిది. దీనిని భక్తి భావముతోఁ బ్రేమ పూర్వకముగ వినువారలకును భగవచ్చరణారవింద ప్రాప్తి కలుగును.

నీవు దీనిని శ్రవణము చేసి, మాటి మాటికి విచారించుకొని, యవకాశము చిక్కినపుడు 'సిద్ధపద' మను పేరు గల మాతృ గయకు తప్పక పొమ్ము, ఆ క్షేత్రమునకు వెళ్లుటచేతనే మానవుఁడు గొప్ప పుణ్యమును బొందును. ఇఁక నేను తర్వాత కథను జెప్పెదను. కర్దమ వంశవర్ణనము చేయుదును. దానిని శ్రద్ధతో వినుము."



## దత్తాత్రేయావతారోపక్రమము

శ్రీహరియే అనేక రూపములను ధరించి యీ జగత్తులో విహరించుచున్నాఁడు. కర్తయు నాయనయే, భోక్తయు నాయనయే. కార్యకారణము లాయనయే. ఆతఁడే పుట్టించి, ఆత్మాంశ భూతములగు జీవులను బాలించి, చివరకు తనలోనికి లీనము చేసికొనును. ఒకే అగ్ని నానారూపములుగ భాసించునట్లును, ఒకే వాయువు దేశకాల భేదముచే సుగంధ దుర్గంధ యుక్తమైనట్లును నొకే ప్రభువు నామ, రూపాకృతి మొదలగు వానిచే భిన్నుఁడైనట్టులుగ భాసించుచుండును. అంతయు నాతడే యగుటచే బంధమోక్షముల ప్రశ్నయే లేదు. ఇది యంతయు నాతని క్రీడ. ఆనందము కొఱకు, విహారము కొఱకు లీలలు చేయుచుండును. ఈ సృష్టిలో నంతయు భగవదిచ్ఛ తప్ప యింకేమియును గోచరింపదు జీవుల కర్మభోగమునకు నియంత ఆయనయే. ఆతఁడు తన నాభికమలము నుండి చతురాననుఁడగు బ్రహ్మను బుట్టించి, యాతని హృదయములో సృష్టిరచన చేయవలయునను నుత్కటేచ్ఛను గలిగించు నదియు

నాయనయే. సృష్టిరచనలో నాతని కనేక విధముల సహాయము కావించును. బ్రహ్మ స్వయముగఁ జేయలేని దానిని శ్రీహరి స్వయముగ నవతరించి చేయుచుండును, కావున సృష్టిలో నెచ్చట చూచినను ఆతని పరాక్రమ విజయములే కనఁబడు చుండును. బ్రహ్మ రూపమున దీనిని రచించి, అనేకావ తారముల ద్వారా దీనిని బాలించు చుండును. కాల, యమ, రుద్ర రూపమున దానిని సంహరించును. ఈ సమయమున సృష్టి ప్రసంగము జరుగు చున్నది. విదురుఁడు మైత్రేయుని సృష్టి సంబంధమగు ప్రశ్న మడుగు చుండెను."

విదురుఁ డిట్లనెను:- "స్వామీ! ఇదివఱలో మీనోట బ్రహ్మయొక్క విభిన్న యంగములనుండి మరీ చాదు లుద్భవించి రని విని యుంటిని. మరల బ్రహ్మ రెండుగ కాఁగా కుడి భాగమునుండి స్వాయంభువ మనువు, ఎడమ భాగమునుండి శతరూప ఆది దంపతులుగ నుద్భవించిరిగదా! వారికి ప్రియవ్రత, ఉత్తాన పాదులను నిద్దరు కొడుకులును, ఆకూతి, దేవహూతి, ప్రసూతి యను ముగ్గురు కన్యకలు పుట్టిరి. మీరు ముందుగా ఆకూతి చరిత్ర చెప్పక దేవహూతి చరిత్రమును జెప్పినారు. కపిల దేవుని చరిత్ర ప్రధానము కావున నట్లు చెప్పితిరని నేను భావించితిని. ఇఁక నిప్పుడు నాకీ ముగ్గురు ప్రజాపతి పుత్రికల యొక్క పుత్ర పౌత్రుల కథలను జెప్పుడు, ఏలననఁగా నీ ముగ్గురే ప్రజాపతుల పత్నులైరి. ఈ ముగ్గుర వలననే సృష్టి వృద్ధియైనది. ఈ ముగ్గుర వంశములలో గొప్ప గొప్ప బ్రహ్మర్షులు, రాజర్షులు, అవతారములు కలిగెను. వారివలనఁ దమ తమ భగవద్భక్తి, కీర్తిద్వారా త్రైలోక్య పావనము గావించిరి."

విదురుని ప్రశ్నమును విని మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురా! నీ వత్యుత్తమ ప్రశ్న మొనర్చితివి. స్వాయంభువ మను వంశజులే పృథ్వి యంతటను ధర్మప్రసార ప్రచారము లొనర్చిరి. వీరి వంశపరం పరలో భగవంతుఁ డనేకావతారము లెత్తెను. అయితే యిఁక వినుము. మను వంశములో ప్రియవ్రత, ఉత్తాన పాదుల చరిత్రమును నేను ముందు చెప్పెదను. ఇప్పుడు వారి కన్యకల వంశమును వినుము.

స్వాయంభువ మనువు తన పెద్ద కూఁతురగు ఆకూతిని పుత్రికా ధర్మము ననుసరించి రుచి యను ప్రజాపతికిచ్చి వివాహ మొనర్చెను.

అంత విదురుఁ డిట్లనెను:- "స్వామీ! పుత్రికా ధర్మ మేమి? దానిలో నియమ మేమి కలదు."

మైత్రేయుఁ డిట్లనెను:- "విదురా! ఈ కన్యకు పుట్టిన పుత్రుఁడు తన పుత్రుఁడు కావలయు ననియు, వానిని దాను దీసికొనవలయు ననియుఁ గన్యక నిచ్చినప్పుడు ప్రతిజ్ఞ చేయించు కొనుటకు పుత్రికా ధర్మమని పేరు."

అప్పుడు విదురుఁ డిట్లనెను:- "మనువునకు ప్రియవ్రత, ఉత్తాన పాదులను నిద్దరు పుత్రులుండిరి కదా! తన కూఁతురు కొడుకును పుత్రికా ధర్మమున రుచి నడిగి తన పుత్రిక నెందుల కొసంగెను?"

ఇది విని మైత్రేయుఁ డిట్లనె:- "విదురా! ఆసమయమున సృష్టి యెక్కువగా లేదు. అప్పుడు ప్రతి వారికి బహు పుత్రులు కలుగ వలయునని కోరిక యుండెడిది. ఆరోజులలో ఎంతమంది బిడ్డలుండిన నంత శ్రేష్ఠుఁడుగ నెన్నబడెడు వాఁడు. అందువలన

చాల సంతానమునకు తండ్రి యనిపించుటకై మనువట్లు చేసి యుండవచ్చును. ఈమె గర్భమున భగవదంశావతారము కలుగునని ఆతని ధ్యానములోఁ దెలిసి యుండవచ్చును. ఆ కూతి వలన పరమ సమాధి ద్వారా రుచి దివ్య తేజస్సంపన్నుండగు నొక పుత్ర రత్నమును గనెను. ఆతఁడు యజ్ఞరూపుఁడగు సాక్షాచ్ఛ్రీహరి యంశావతారము.

విష్ణువే యజ్ఞ రూపమున నవతరించెను. విష్ణు వెచ్చట నుండునో ఆతనికి ఛాయా స్వరూపిణి యగు లక్ష్మి అచ్చటనే యుండును. అందువలన దక్షిణ యను పేర లక్ష్మియు నచ్చటనే యుద్భవించెను."

అంత విదురుఁ డిట్లనెను:- "ఈ యజ్ఞ భగవానుఁడే యే విశిష్ట కార్యము లొనర్చెను?"

మైత్రేయుఁ డిట్లనెను:- "ఈతఁడొక మన్వంతరము వఱకు త్రిలోకములను బాలించి, పాలించు పద్ధతి నేర్పఱచెను. త్రైలోక్యపాలన మెట్లు చేయవలయునో ఈతఁడాదర్శముగఁ జూపించెను."

విదురుఁ డిట్లడిగెను:- "త్రైలోక్యపాలన మెట్లు జరుగునో నాకు స్పష్టముగఁ జెప్పవలయును?."

మైత్రేయుఁ డిట్లనెను:- "బ్రహ్మకు ఒక్క దినములో పదునలుగురు మనువులు మారుదురు. ఈ మన్వంతరములలో భగవంతుఁడు తన రూపముల నాఱింటినుంచి ప్రజాపాలనము కావించును. మనువు, మను పుత్రులు, దేవతాగణము, ఇంద్రుఁడు, సప్తర్షులు, భగవంతుని ఒక్క అంశావతారము. ఇవియే భగవంతుని యాఱు రూపములు. ప్రతి మన్వంతరములో

నివి మారుచుండును. వీరి స్థానములో నింకొకరు వచ్చుచుందురు. యజ్ఞుఁ డంశావతారమే కదా! ఆతఁడింద్రుడయ్యెను, దక్షిణవలన నాతఁడు తోష, ప్రతోష, సంతోష, భద్ర, శాంతి, ఇడస్పతి, ఇధ్మ, కవి, విభు, స్వర్ణ, సుదేవ, రోచన యను పండ్రెండుగురు సుతులను గనెను. మొదటిదగు స్వాయంభువ మన్వంతరములో భగవానుఁడు వీరిని దేవతాగణములుగ నొనర్చెను. మరీచి, అత్రి, అంగిర, పులస్త్య, పులహ, క్రతు, భృగువు అను నీ యేడుగురు బ్రహ్మలను సప్తర్షులుగ నొనర్చెను, స్వాయంభువ మనువు మనువే కదా! ఆతనికి ప్రియవ్రత, ఉత్తానపాదు లుదయించిరి. ఈ విధముగ నాలు రూపములై భగవానుఁడు మన్వంతర మంతయు త్రైలోక్య శాసనము కావించెను, ఇది మొదటి మన్వంతరము.''

విదురుఁ డిట్లడిగెను:- '' యజ్ఞుఁ డింద్రుఁడు కాఁగా నా మన్వంతరమున నింకొక యంశావతారము కలిగెనా ?''

అంత మైత్రేయుఁడిట్లనెను:- ''లేదు. ఆతఁడే యింద్రుఁడయ్యెను. ఆతఁడే అవతారమయ్యెను. ఇద్దరుగా నుండవలసిన పనిలేదు. ఇంద్రపదవిని బ్రహ్మజ్ఞానులు కూడ పొందుదురు. ఒక్కొక్కప్పుడు నిత్యపురుషులు, ముముక్షువులు, పుణ్యప్రభావాతిశయముచే బద్ధజీవులు కూడ ఇంద్రుఁడు కావచ్చును. భగవంతుఁ డవతారమెత్తి మనువుగనో, మనుపుత్రుఁడుగనో, ఇంద్రుఁడుగనో, ఉపేంద్రుఁడుగనో, పశు, పక్షి, కచ్ఛప, మత్స్యరూపములను ధరించి లీలలొనర్చును.

ఈ విధముగ స్వాయంభువ మన్వంతరమందు మనుపుత్రిక పుత్రికా ధర్మమువలనఁ బుత్రుఁడైన యజ్ఞుఁడు ఇంద్రపద

విని స్వీకరించెను. ఇప్పటికి ఆకూతిదేవి వంశమును వర్ణించెను. దేవహూతి చరిత్రమును వినిపించితిని గదా! అందఱికంటెఁ జిన్నదగు ప్రసూతిని దక్షప్రజాపతి వివాహమాడెను. ఆమె వలనఁ జాల సంతానము కలిగెను. ఆ వర్ణనమును నేను ముందు విస్తారముగఁ జేసెదను.''

ఇది విని విదురుఁ డిట్లడిగెను:- "స్వామీ! కర్దమమహా మునికి తొమ్మిదిమంది కుమార్తెలనియు, వారిని మరీచ్యాది తొమ్మిదిమంది మహర్షులకిచ్చి వివాహము చేసెననియుఁ జెప్పి తిరి. వారి సంతానము చరిత్ర వినవలయునని యున్నది. వారిలో గొప్ప భక్తుఁడును, భగవదవతారము నగు వాని చరిత్రమును నాకు విపులముగా వర్ణించి చెప్పవలయును.''

అంత మైత్రేయమహాముని యిట్లనెను:- "మహాభాగా! కర్దముని జ్యేష్ఠపుత్రిక యగు కళను మరీచి కిచ్చి వివాహమొన ర్చిరని చెప్పితిని. ఈ మరీచి కుమారుఁడే కశ్యపుఁడు. ఈతనికి దితి, అదితులను భార్యలుండిరి. వారిద్దరివలన గల్గిన సంతానమే ప్రపంచమంతయు నిండిపోయెను. రెండవకుమారుఁడు పూర్ణిమ. ఆతనికి విరజ, విశ్వజులను నిద్దరు పుత్రులును, దేవకుల్య యను నొక పుత్రికయుఁ గలిగిరి. ఈ దేవకుల్యయే గంగ యయ్యెను. మరీచి మహర్షి వంశవర్ణనము నేను ముందు ముందు చేసెదను.

కర్దముని రెండవ కుమార్తె పేరు అనసూయ. ఈమెను అత్రిమహర్షి కిచ్చి వివాహము చేసిరి. ఈ యనసూయయే పతివ్రతాశిరోమణి యయ్యెను. ఈమె తన పతివ్రతాప్రభావ ముచే త్రిమూర్తులను పుత్రులుగ నొనర్చెను. ఈ పాతి వ్రత్యమునకు సంతోషించి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఆమెకు

పుత్రులగునట్లు వర మొసంగిరి. వారు ముగ్గురును దుర్వాస, దత్తాత్రేయ, చంద్రరూపముల నుద్భవించి ప్రసిద్ధిని జెందిరి. అనసూయ వరమును బొందుటయే గాక, అత్రి మహర్షియు త్రిమూర్తులను సంతోషపెట్టి పుత్రులగునట్లు వరమును బొందెను. ఈ తపః పూత దంపతుల భక్తిచేఁ ద్రిమూర్తు లిచ్చట యవతరించిరి.

అంత శౌనకుఁ డిట్లనెను:- "సూతా! అనసూయాదేవి యేవిధముగఁ ద్రిమూర్తులను బుత్రులగునట్లు వరమడిగినది? అత్రి మహర్షి యెట్టి తపంబొనర్చెను? వారు పుత్రులెట్లైరి? ఈ కథనంతను విస్తారముగ నాకుఁ జెప్పవలయును."

అంత సూతుఁ డిట్లనెను:- "మునులారా! ఈ విషయము భాగవత కథలో సంక్షేపముగనే యున్నది. కాని నేను ఇతర పురాణముల యాధారమున అనసూయ త్రిమూర్తుల నెట్లు తన పాతివ్రత్యపు ప్రభావముచేఁ బుత్రులుగఁ జేసికొనెనో చెప్పెదను. మీరు సమాహిత చిత్తులరై అంతయు విన వలయును."



# అనసూయకు త్రిమూర్తులు పుత్రులగుట.

భగవంతుఁడు భక్తుల యశమును వృద్ధి చేయఁదలఁచిన దానికిఁదగిన పరిస్థితిని గల్పించును. ఈ క్రీడలు భగవంతుఁడెందులకు జేసెనా యని యాశ్చర్యచకితుల గావించు నద్భుత క్రీడల నొనర్చును. మనబోటి సాధారణ అజ్ఞమానవులు తమ తర్కముద్వారా యీ యచింత్యలీలలను దులదూఁచుచో మన ప్రయాసము అసఫలమగుటయే గాక అది మన అనధికార చేష్టగా నెంచవలసి యుండును.

ప్రపంచములో సర్వశ్రేష్ఠులిద్దరే. వారు సతులు, సాధువులు. వీరిద్దరే దివ్య ధామమున కధికారులు. భగవద్భక్తుఁడగు సాధువుని పదవికంటె పతిప్రాణయగు పత్నిపదవి యెక్కువది. సాధువునితో భగవంతుఁడు చిరకాలానంతరము మాటలాడును. మాటలాడినను అత్యంత స్నేహభావముతోఁ, ప్రేమపూర్వకమగు వాక్కులతో మాటలాడును. కాని సతియగు స్త్రీ ప్రతిక్షణము తనపతి యభిప్రాయము ననుసరించి వెళ్లవలసియుండును. ఆతనిచేఁ జీవాట్లు తినవలసి యుండును. ఆతని మనస్సుతోఁ దన మనస్సును గలుపవలసి యుండును. ప్రాణములలోఁ బ్రాణములను గలిపి యాతని యిచ్ఛానుసారముగ నాచరణము చేయవలసియుండును. పతియే పరమేశ్వరుఁడు. ఆహా! ఇదెంతటి ఉచ్ఛ భావము? ఎంతటి కఠిన సాధనము! ఈ సాధనను ఈ పుణ్య భూమిలోని పుణ్యాంగనలు చేయు చుందురు. అందు కనియే సతుల యాజ్ఞలకు దేవతలు కూడ తలలు వంచవలసి వచ్చును. సూర్య, చంద్రులు వారిని జూచుకొని నడుచు చుందురు. దేవతలేమి ? బ్రహ్మ విష్ణు మహేశ్వరులు కూడ

వారిచేఁ బరాజితులగుచుందురు. పతివ్రతయొక్క యీ ప్రభావము లోకమునకుఁ దెల్పుటకే భగవంతుఁ డొక విచిత్రమగు నభినయమును గావించెను."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! శారద, రమా, పార్వతులకు తామే పతివ్రతలమను గర్వముకలదు. భగవంతుఁ డింకెవరి గర్వమునైన సహించునుగాని తన భక్తుల హృదయములో గర్వముండెనా దాని నంకురముతో గూడ నాశము కావించును. ఇదియే తన భక్తులయందు గల భక్తవత్సలత. చరాచర జగత్తున కధీశ్వరులగు ఆదిదేవులకే అభిమానము కలుగుటకుఁ జింతించి వారి గర్వమును నాశము కావించుటకై నారదుని హృదయములోఁ బ్రేరణము కావించెను. నారదునకు భగవదేచ్ఛ తెలియును; కావున భగవదేచ్ఛ ననుసరించియే యాతఁడు వెళ్లెను. ఆతనికి నిత్యమేదియో నూతన కౌతుకమును జేయుచుండును. ఊరక కూర్చుండిన నాతనికి తోఁచదు. ఇటు విషయ మటు, అటువిషయ మిటు మెల్లగా నంటించుచుండును. దానిలోనే యీతనికి ఆనందము కలదు. అందువలననే ఆతఁడు మునుముందుగా లక్ష్మికడకు వెళ్లెను.

తన దగ్గఱకు వీణ వాయించుకొనుచు, భగవన్నామము చేసికొనుచు వచ్చిన నారదుని గాంచి లక్ష్మియొక్క ముఖము వికసించెను. మిక్కిలి సంతోషముతో నామె యిట్లనెను:- "నారదా! రమ్ము! నీవు వచ్చి చాలదినములైనది. ఎచ్చట తిరుగుచుంటివి?"

కొంచెమాగి నారదుఁ డిట్లనెను:- "తల్లీ! మాకొక చోటని యేమున్నది? భగవన్నామము చేసికొనువారము,

ఎక్కడికి పోవలయుననిన నచ్చటికి పోవుదుము. వైష్ణవుఁడు, ఒంటె వీరెటు ముఖము త్రిప్పిన నటు వెళ్లుదురు."

ఇది విని లక్ష్మి బిగ్గఱగ నవ్వి యిట్లనెను:– "నారదా ! నీవు వైష్ణవుని ఒంటెకు బాగుగాఁ బోల్చితివి. ఒంటె వేప చెట్టున కాకు లేకుండఁ జేయును; వైష్ణవుఁడు తులసిచెట్టున కాకు లేకుండఁ జేయును. వేలకొలది దళములను సాలగ్రామము మీఁదఁ బడవేయును. కానిమ్ము, నీ వెచ్చటనుండి వచ్చుచుంటివో చెప్పుము."

నారదుఁ డిట్లనెను:– "తల్లీ ! ఏమి చెప్పుదును ? చెప్పుట కేమియును లేదు. ఇప్పుడు నేను తిరిగి తిరిగి చిత్రకూటము వైపునకుఁ బోయితిని. అచ్చటి నుండి పయస్విని నదీతీరముననే అత్రిమహర్షి ఆశ్రమమునకు వెళ్లితిని. అచ్చట పతివ్రతయగు నాతనిభార్యయగు ననసూయను దర్శించి కృతార్థుఁడ నైతిని. నేఁడీ విశ్వమందు ఆమెకు సమానమగు పతివ్రత లేదు. ఆమె తన తపః ప్రభావముచే గంగా ప్రవాహమును బ్రవహింపఁ జేసినది. అదియే సకల పాపసంహారిణియై మందాకిని యని ప్రసిద్ధి చెందినది. నేఁడు లోకములోని సమస్త సాధ్వీపతివ్రతల కామె శిరోమణి. నేను చతుర్దశ భువనములను దిరిగితిని; కాని నాకిట్టి పతివ్రత లభింపలేదు."

ఇది వినఁగానే లక్ష్మికి చాల కష్టము వేసెను. వీఁడు నాయింటిలోని పిల్లవాఁడు, నాముందఱనే యిట్టి మాటలు పలుకుచున్నాఁడు. ఇది నన్నుఁ బ్రత్యక్షముగ నవమానించుటే. మరల నిట్లనుకొనెను:– ఈతఁడు నన్ను వదలి చెప్పియుండును. అందువలన స్పష్టముగఁ దెల్సుకొనుట కిట్లనెను:– "నారదా !

నీవు అనసూయ పాతివ్రత్యమును గూర్చి ప్రశంసించితివి. నే నామె పేరును వినియుంటిని; కాని ఆమె నాకు మించినదేనా?"

నారదుండామె మనస్సును మార్చం దలంచెను. కావున నిట్లనెను:- "అమ్మా! నీవన్యథా తలంపకుండిన నేను దీనికి జవాబొసంగెదను."

లక్ష్మి యిట్లనెను:- "అన్యథా తలంచుట కేమికలదు? నీవు నిర్భయుండవై ప్రత్యుత్తరమిమ్ము."

నారదుం డిట్లనెను:- "సత్యము చెప్పుదునా? అబద్ధము చెప్పుదునా?"

లక్ష్మీదేవి యిట్లనెను:- "అబద్ధ మెందులకు? నీవు నిజమే చెప్పుము."

అప్పుడు నారదుండు దృఢతాస్వరముతో నిట్లనెను:- "అమ్మా! సత్యమేమి యనంగా నీవు అనసూయతో సమానవు కావు."

ఇది వినంగానే లక్ష్మీదేవి ముఖము వెలవెలం బోయెను. నారదుండిట్టి ప్రత్యుత్తర మొసంగునని కలనైన ననుకొనలేదు. ఆమె మనస్సులో సతి యెడల నసూయ కలదు; అందువలన ననసూయను హీనపఱచుటకు నిశ్చయించుకొనెను. అంత పైకి యిట్లనెను:- "మంచిది నారదా! నే ననసూయకుం బోలనా?" నారదుండు కలహబీజమును నాటవలసి యుండెను. ఆతని కానందమయ్యెను. కలహబీజము మంచి సమయమున పదును చేసిన భూమియందు నాటంబడెను. ఇప్పుడు అతిశీఘ్రమున బీజమునుండి అంకురముత్పన్నమై, అది పుష్పిత పల్లవితమై

ఫలవంతమగును. ఇట్లు పలికి నారదుఁడు శీఘ్రముగఁ గైలాస మునకుఁ బోయెను.

ఇచ్చట లక్ష్మి ముఖమింత చేసికొని కూర్చుండెను. భగవానుఁ డిట్లనెను:— "ప్రియా! నేఁడేల మంచముపట్టితివి? కారణమేమి?"

లక్ష్మి యిట్లనెను:— "నామాట వినుఁడు. చాలదినములు నేను మీపాదసేవ చేసితిని. మీరును గృపతో మీ కంఠహార ముగఁ జేసికొంటిరి. నేను మీరు నేఁటివఱకు కలిసి మెలిసి యుంటిమి. నేనెప్పుడును మిమ్ముల నేమియు నడుగలేదు. నేఁడు మీరొక మాట నంగీకరింపవలయును."

భగవానుఁ డిట్లనెను:— "విషయ మేమియో చెప్పకున్న నెట్లు చెప్పుదును?"

వికాసముఖములో లక్ష్మి యిట్లనెను:— "ఏమంత పెద్ద పనికాదు. నేను శశవిషాణము నడిగిన నొకకొమ్ముగల శశమును జేసి కొమ్మును దేవలసియుండును. నేను వంధ్యాపుత్రు నడిగిన నొక వంధ్యాముఖమునుండి పుత్రుని బుట్టింపవలసి యుండును. మీరు 'సరే' యనిన నేను జెప్పుదును. ఇదివఱకు కాదు నేఁడు మీ ప్రేమను జూడవలయును. మీరు నన్ను వంచించుచుంటిరి."

భగవానుఁడిట్లనెను:— "బాగుగానేయున్నది. చెప్పుము."

లక్ష్మి యిట్లనెను:— "సరే, చెప్పుఁడు."

భగవానుఁడు నవ్వి యిట్లనెను:— "చెప్పుమని యెన్ని సార్లు చెప్పుదును? పట్టా వ్రాయుదునా? పోనిమ్ము గంగలో

నిలుచుండి చెప్పుదుననిన నా అంగుష్టములోనుండి గంగ పుట్టిన దాయెను.''

లక్ష్మి ఆనందముతో నిట్లనెను:- "లేదు, సరియేనాథా! నాకు విశ్వాసము చిక్కినది. మీ రేవిధముగ నైనను అనసూయా దేవికి పాతివ్రత్య భంగమును గావింపవలయును.''

భగవానుఁ డిది విని నవ్వి లోలోన నిట్లనుకొనెను:- "దేవీ! ఆమె పాతివ్రత్యమును భంగపఱుచు సామర్థ్యము మాలోనెక్కడిది?'' ఇదంతయు నారదుఁడు నాఁటిన బీజమహిమ మని నారాయణునకుఁ దెలియును. పెద్దగా నిట్లనెను:- "ఇంత మాత్రమునకే ముఖమిట్లు పెట్టుకొంటి వేల? మేమిప్పుడే వెళ్లుచున్నాము. మేము గట్టిగాఁ బ్రయత్నించెదము. మా యీపని పూర్తి యగువఱకు రాము. అదియైనను మీ రీమధ్యలో విఘ్నము కావింపకుండిన నే.''

లక్ష్మికి మిక్కిలి ఆనందమయ్యెను. భగవానుఁడు తన గరుడవాహనమును బిలిచి, అత్రి ఆశ్రమమునకుఁ బోయెను.

అచ్చట నారదుఁడు కైలాసమునకుఁ జేరెను. ఉమాదేవి యొంటరిగాఁ గూర్చుండి పూజ చేయుచుండెను. వీణమీటుచు నృత్యము గావించుచు వచ్చిన నారదుని గాంచి పార్వతి స్వాగత మొసంగి, తినుటకొక లడ్డు నొసంగెను. ఒక్కసారిగా దానిని నోటిలో వైచుకొని నారదుఁ డిట్లనెను:- "ఆహా! ఎంత రుచిగలిగిన లడ్డు! అమృతోపమానముగ నున్నది. కాని అనసూయాదేవి చేసిన లడ్డువలె లేదు.''

పార్వతి మనస్సులో నిట్లనుకొనెను:- "అయ్యో ! ఎంత కృతఘ్నుఁడీతఁడు? నేనెంతో యుల్లాసముతో సుధామయమగు మోదకమీయఁగా ననసూయాదేవి యిచ్చిన లడ్డుతో సమాన ముగ లేదనుచున్నాఁడు." అంత నామెకు రోషము వచ్చి యిట్లనెను:- "నారదా ! ఏమనుచున్నావు ? లడ్డు ప్రశంసను దెచ్చిన యా అనసూయ యెవరు ?"

నారదుఁ డిట్లనెను:- "అమ్మా ! సతీసాధ్వి యగు అనసూయాదేవి అత్రిమహర్షి ప్రాణప్రియపత్ని. నేఁడీ ప్రపంచములో నామెను బోలిన పతివ్రతలేదు."

సతీదేవి నొక్కి- యిట్లనెను:- "నాకంటె నధికమా?" నారదుఁ డుపేక్షా స్వరమున నిట్లనెను:- "అమ్మా! అల్పమో అధికమో నాకు తెలియదు; కాని ఆమె పాతివ్రత్యము ముందు మీ పాతివ్రత్యము తీసివేఁతగనే యుండును."

ఇది వినఁగానే సతీదేవి పరుగెత్తుకొని శివుని కడకుఁ బోయి యిట్లనెను:- "నేను పతివ్రతా శిరోమణినని మీరు చెప్పితిరే."

శివుఁ డిట్లనెను:- "ఎందుకు ? ఈ విషయమున నీ విషయమున సందేహ మున్నదా యేమి?"

సతీదేవి యిట్లనెను:- "నాథా! ఇంత వఱకు సందేహము లేదు. ఈ నారదుఁడు నన్ను సందేహములోఁ బడవేసినాఁడు. అత్రి పత్నియగు ననసూయ పాతివ్రత్యము ముందు నా పాతివ్రత్యము తీసివేఁతగనే యుండునని నారదుఁ డనుచున్నాడు."

ఇది వినఁగానే శివుఁడు నవ్వి యిట్లనెను:- "నారదుఁ డెచ్చట నున్నాఁడు? వానిని నాకడకుఁ దీసికొని రమ్ము" నారదుఁ డెచ్చట? నారదుఁ డెచ్చట నని పార్వతి వచ్చెను, కాని నారదుఁ డేడి? ఆమె వెంటనే తిరిగి వచ్చి శివునితో నిట్లనెను:- "నాథా! ఆతఁడు వెళ్లిపోయి నాఁడు; కాని ఈ విషయము సత్యమేమో మీరే చెప్పుడు"

బోళా శంకరునకు స్త్రీల మనస్సులలో నుండు అసూయ యేమి తెలియును? ఆతఁ డిట్లనెను:- "నారదుఁడు నిజమే చెప్పినాఁడు. దేవీ! నీవు అనసూయతో సమానవు కాఁజాలవు."

సతీదేవి యా సమయమున శివుని అరుణ చరణములను బట్టుకొని దృఢ స్వరముతో నిట్లనెను:- "అనసూయాదేవి పాతి వ్రత్యమును భంగము కావించి, లోకములో సర్వశ్రేష్ఠమగు పతివ్రతా శిరోమణిగా నన్నుఁ జేసెదనని మాట యిచ్చిననే నేను పాదములను వదలెదను."

శంకరుఁడు తన సర్పములను సవరించు కొనుచు నిట్లనెను:- "దేవీ! మేము ప్రయత్నించెదము కాని, మధ్యలో మరల గడబిడ చేయవలదు. ఈ స్త్రీలు క్షణములో రుష్టము, క్షణములో సంతుష్టము చెందు చుందురు."

సతీదేవి యిట్లనెను:- "నాథా! నాకు మీ భయమే. మీరు బోళా శంకరులు. పురుషు లెల్లప్పుడు కపటము చేతను, బలముచేతను, కళా కౌశలము చేతను, అదిలించి బెదరించియు, ప్రేమించియు, నసత్యములు పలికియు స్త్రీలను మోసము చేయు చుందురు. స్వామీ! నేఁటి వఱకట్లే మోసగించితిరి.

ఇప్పుడా మోసమును అత్రి పత్నియగు అనసూయ యెడల చేయుఁడు”

శివుఁడు నవ్వి లోలోన నిట్లనుకొనెను:- “ ఇతరులకు గోయుతీయువాని కై బావియే త్రవ్వఁబడి యుండును.” పైకిట్లనెను:- “దేవీ! నీవు నాకాళ్లను వదలిన నిప్పుడే వెళ్లెదను.” సతీదేవి వృషభధ్వజుని పాదములను వదలెను. ఏ స్త్రీ తన భర్త పాదముల నొక్క క్షణము విడిచినదో చివరకామెకుఁ గ్లేశములు తప్పవు. శివుఁడు తన నందీశ్వరునిఁ బిలిచెను. అది అంకెలు వైచుకొనుచుఁ బరువిడి వచ్చెను. శివుఁడు ఎగిరి దానిపై నెక్కి వెనుక వచ్చుచుండిన భూత, ప్రేత, పిశాచములను బంపివైచి, యొంటరిగా నత్రి ఆశ్రమమునకుఁ బోయెను.

అచ్చట నారదుఁడు బ్రహ్మలోకమునకుఁ బోయెను. సరస్వతీదేవి ఆతనికి స్వాగత సత్కారములు కావించి యిట్లనెను:- “వత్సా! నారదా! నీవు వచ్చి చాలదినములైనది, మమ్ములను మఱచితివా యేమి? ఏమైనఁ గ్రొత్తసమాచారములు కలవా?”

నారదుఁ డిట్లనెను:- “అమ్మా! అందఱు బాగుగానే యున్నారు. మర్త్యలోకములో నేనొక గొప్ప విషయమును గాంచితిని.”

ఉత్సాహముతో బ్రహ్మ యిట్లడిగెను:- “ఆ యద్భుత విషయ మేమియో చెప్పుము?”

నారదుఁ డిట్లనెను:- “అమ్మా! ఏమి చెప్పుదును? అత్రి పత్నియగు అనసూయా పాతివ్రత్య ప్రభావమును గాంచి ఋషులు, మునులు స్తుతులొనర్చి పోవుచుందురు. లోకములో

నా మెతో సమానమగు పతివ్రత లేదు. నేనామె ఆశ్రమమునకుఁ బోఁగా నీ బ్రహ్మ లోకములోఁ గూడ లభింపని శాంతి అచ్చట లభించినది. పతివ్రత యొక్క ప్రభావ మిట్లే యుండును."

క్రోధముతో శారద యిట్లనెను:- "ఏమి ఆమె నన్ను మించినదా?"

నారదుఁ డిట్లనెను:- "నేనిప్పుడెట్లు చెప్పఁగలను తల్లీ! అమ్మ అమ్మయే, సర్వశ్రేష్ఠు రాలే; కాని సమస్త ఋషులు, మునులు ఇట్టి పతివ్రత యిప్పుడు లేదని పలుకు చున్నారు."

అప్పుడు సరస్వతికి చాల చింత కలిగెను. ఆమె యిట్లనెను:- "వెళ్లి, త్వరగా మీ తండ్రిని బిలిచికొని రమ్ము."

తల్లి యాజ్ఞచే నారదుఁడు బ్రహ్మ సభకుఁ బోయెను. సమయమునఁ బరస్పరము పోట్లాడుకొనుచున్న దేవాసురుల విషయ మచ్చట చర్చ జరుగు చుండెను. ఈ సంభాషణము కశ్యపునితో జరుగు చుండెను. ముందుగా వేద గర్భుఁడగు బ్రహ్మను స్తుతించి నారదుఁడు శారదా సందేశమును విని పించెను.

ఏదియో గొప్ప పని యున్నదని బ్రహ్మ లోనికి వచ్చెను. రాఁగానే సరస్వతి యిట్లనెను:- "నాథా! నేఁడీ లోకములలో సర్వశ్రేష్ఠమగు పతివ్రత యెవరు?

బ్రహ్మ విస్మయముతో నిట్లడిగెను:- "ఈ యప్రాసంగిక ప్రశ్నవలనఁ బ్రయోజన మేమున్నది?"

హఠ స్వరముతో బ్రహ్మాణి యిట్లనెను:- "ప్రయోజన మేమియును లేదు. మీరు ముందుగా నాకీ విషయమునఁ బ్రత్యుత్తర మీయవలెను."

బ్రహ్మ ప్రేమతో నదరిపడి యిట్లనెను:- "ఇన్ని మాట లెందులకు? నిన్ను మించిన పతివ్రత యీలోకములో నెవరుండఁ గలరు?"

బ్రహ్మాణి ప్రేమ స్వరముతో నిట్లనెను:- "నాథా! మీరీ ముఖప్రీతి మాటలాడకుండఁడు. నిజము చెప్పండు. లోకములో అనసూయను మించిన పతివ్రత లేదని నేను విని యున్నాను."

ఇది వినఁగానే బ్రహ్మకు కొంచెము చింతయుఁ గలిగెను; పైకి నవ్వెను. ఇట్లను కొనెను:- స్త్రీలకు శీఘ్రముగ నసూయ కలుగును. అనసూయ విషయములో విశేషము అన్యు లెవరిపై నసూయ చెందకుండుటయే. నిజమున కామెను మించిన వారెవరు కలరు? ఎట్లైన నామాటను దాఁటించ వలయునని బ్రహ్మ యిట్లనెను:- "నీతో నీమాట నెవరు చెప్పిరి?"

బ్రహ్మ అటు నిటుఁ జూచెను. నారదుఁడు లేఁడు. తల్లి దండ్రు లేకాంతముగ మాటలాడు కొనుచుండఁగా వయస్సు మీరిన పుత్రుఁడచ్చట నుండరాదు. అందువలన నారదుఁడు మెల్లగ నెప్పుడో మాయ మైనాఁడు. నారదుఁడు కనఁబడక పోఁగానే బ్రహ్మాణి యిట్లనెను:- "నాతో నల్లదొంగ చెప్పి నాఁడు. ఇది నిజమో అబద్ధమో నాకు చెప్పవలయును."

బ్రహ్మ గడ్డము నిమురుకొనుచు నిట్లనెను:- "నిజమే నను కొమ్ము, ఇందు నీవు చింతింప వలసిన దేమున్నది? ఆమె నీకోడ లేక దా!

సరస్వతి రోష స్వరమున నిట్లనెను:- "మానసిక పుత్రు లతో నేమి సంబంధము? వారు నీ యంగముల నుండి వేఱు

వేఱుగఁ బుట్టుటచేఁ బరస్పరము భిన్నులే. మీరెట్లైనను అనసూయాదేవి పాతివ్రత్యమును భంగము కావింపవలెను.''

ఆ సమయమున సర్వజ్ఞుఁడగు బ్రహ్మ ధ్యానమునఁ జూచెను. సమాధిలో సమస్త విషయములు తెలిసెను. భగవంతుఁడు లీల చేయఁ దలఁచెను. ఆతఁడు త్వరగాఁ గిరీటమును సవరించుకొనుచు నిట్లనెను:- "మంచిది, నేను వెళ్లి వచ్చెదను." అని యిట్లు పలికి హంసనెక్కి యొంటరిగాఁ బోయెను. మందాకినీ నది యొడ్డున నున్న అత్రి ఆశ్రమమునకు త్రిమూర్తులు చేరిరి. పరస్పర మర్యాద లొనర్చుకొని తాము వచ్చిన కారణమును విచారించుకొనిరి. భగవానున కన్నియును దెలియును గావున నిట్లనెను:- "మనము ముగ్గురము వేషములను మార్చుకొని పతివ్రతయగు ననసూయను బరీక్షింపఁ బోవుదము.'' అందఱు దీని కంగీకరించిరి. ముగ్గురును సాధు వేషములతో ననసూయా దేవి కడకుఁ బోయిరి. ఆ సమయమున నత్రి మహర్షి ఆశ్రమమున లేఁడు. మునుల రూపమున నతిథులు వచ్చుటను గాంచి అనసూయ వారికి స్వాగత సత్కారములను గావించెను. అర్ఘ్యపాద్యాచమనాదుల నొసంగి, కందమూల ఫలాదులను సమర్పించెను. కాని మునులామె యాతిథ్యమును గ్రహింప లేదు."

అంత అనసూయా దేవి వినీత భావముతో నిట్లనెను:- "మునులారా! నావలన నేమి యపరాధము జరిగినది. మీరు నా యీ పూజ నేల యంగీకరింపరు?

మును లిట్లనిరి:- "నీవు మా కోక మాట నిచ్చిన మేము నీ పూజాదులను స్వీకరించెదము. లేకున్న స్వీకరింపఁ జాలము."

అనసూయా దేవి యిట్లనెను:- "మునులారా! అతిథి సత్కారము ప్రాణములను బలి యిచ్చియైనఁ జేయఁదగినది. కపోత రాజము తన భార్యను జంపిన వ్యాధునకుఁ దా నగ్నిలోఁ బ్రవేశించి ప్రాణముల నొసంగి చేసెను. మీ రెట్లా నందిం చెదరో అట్లు చేయుటకు సిద్ధము నున్నాను."

అప్పుడు మును లిట్లనిరి:- "దేవీ! నీవు వివస్త్రవై మా కతిథి సత్కారములను గావింపుము."

ఇది వినఁగానే పతివ్రతయగు అనసూయ నిర్ఘాంత పోయెను. ఇట్టి సదాచార హీన ప్రస్తావమును గావించు వీరు నిజముగ మునులా లేక ఛద్మవేషధారులగు కపటులా ? ఆమె ధ్యానమునఁ జూచి, రహస్యమును దెలిసికొని యిట్లనెను:- "నేను వివస్త్రనై మీకు సత్కార మొనర్చెదను. నేను నిజ ముగ పతివ్రతనే యగునెడల, పొరపాటుననైన స్వప్నమున నైనను నేను పరపురుషునిఁ గామభావముతోఁ జింతింపనియెడల మీరు ముగ్గురును ఆఱునెలల పిల్లలగుదురుగాక!"

పతివ్రత యిట్లనఁగానే ముగ్గురును నాఱునెలల పాలు ద్రావు పసిపాపలై యేడ్వసాగిరి. మాత వివస్త్రయై పాలు ద్రావించి, ఉయ్యాలలోఁ బరుండఁబెట్టి నిద్రింపఁజేసెను. ఇంత లోనే అత్రిమహామునియు వచ్చెను. సుకుమారులగు పిల్లలను ముగ్గురను గాంచి యాతఁ డాశ్చర్య చకితుఁడై యిట్లడిగెను:- "దేవీ! దేవస్వరూపులును, పరమ సుందరులును, అత్యంత మనోహరులు నగు నీ ముగ్గురు పిల్ల లేభాగ్యశాలి యొక్క బిడ్డలు ?"

అనసూయ యిట్లనెను:- "స్వామీ ! వీరు మీబిడ్డలే."

ఋషి యిట్లనెను:- "మనకిట్టి భాగ్యమెక్కడిది?"

దేవి యిట్లనెను:- "కాదు స్వామీ ! మీ బిడ్డలే. భగవంతుఁడు స్వయముగఁ గృపచూచినాఁడు." ముని రహస్యము నంతను గ్రహించెను. ఇప్పుడు త్రిమూర్తులు బిడ్డలై యాడుకొనుచుండిరి. తల్లియగు అనసూయ వారి కన్నము పెట్టుచు, ముద్దులాడుచుఁ బ్రేమించుచుండెను. వీరందఱు నుత్సాహముతోఁ దల్లితోఁ గ్రీడించుచుండెను.

ఇచ్చట త్రిమూర్తుల భార్యలు తమ పతులు రాలేదని చింతించుచుండిరి. ఎవరి నడిగినను తమకుఁ దెలియదని చెప్పుచుండిరి ! ఏమి చేయవలయును ? ఎచ్చట నుండిరి ? ముగ్గురు నింటినుండి బయలు దేరిరి ! దైవయోగముచే ముగ్గురును జిత్రకూటమునఁ గలిసికొనిరి. ఒకరొకరు పరస్పరము తమ తమ దుఃఖమును జెప్పుకొనిరి. రమాదేవి ఉమాదేవితో నిట్లనెను:- "నీకెట్లీజాడ తెలిసినది ?"

ఆమె యిట్లనెను:- "నాకు నారదుఁడీ విషయమునంతను జెప్పెను."

శీఘ్రముగ శారద యిట్లనెను:- "అయ్యో ! ఆతఁడు నాకును జెప్పినాఁడు."

లక్ష్మికూడ నెత్తి బాదుకొనెను. ముగ్గురును నారదునిపై మండిపడిపోవుచుండిరి. లక్ష్మీదేవి మిక్కిలిగఁ గోపము చెందెను. ఆమె పండ్లుకొఱికి యిట్లనెను:- "వాని సొరకాయ బుఱ్ఱ దొఱకెనా దానిని బ్రద్దలు చేయుదును. పసినాఁటి ఉగ్గుపాలుకూడ గ్రక్కునట్లు వానిని బాదుదును." వీరిట్లనుకొను చుండఁగనే

"జయరామ కృష్ణహరి" యను శబ్దము వినిపించెను. ఇంతలోనే నారదుఁడు ప్రత్యక్షమయ్యెను.

దూరమున నుండియే నారదుఁ డిట్లనెను:– "అమ్మా! నమస్కారము. తల్లు లందఱకు నమస్కారము."

లక్ష్మీదేవి లోలోనఁ గుపితయై యుండెను. అందఱి కోపము పరాకాష్ఠ నందెను. తన కోపము నణఁచుకొని రమాదేవి యిట్లనెను:– "వహ్వా! నారదా! మంచి సమయము నకే వచ్చితివి. దూరముగ నిలిచితివేమి? మాదగ్గఱకు రమ్ము నీ యీ వీణ చాల అందమైనది. ఇది యెట్లున్నదో ఒక్కసారి చూడవలయును. ఈ సరస్వతి చాల బాగుగా వీణ వాయించఁ గలదు."

నారదున కంతయును దెలియును కావున నిట్లనెను:– "అమ్మా! నేనిప్పుడనుష్ఠానములో నున్నాను. నేనెవ్వరి కడకు వెళ్లి మాటలాడను. విశేషించి స్త్రీలకు చాల దూరముగ నుందును.ఎవ్వరి పాదములను దాఁకను. ఇఁక వీణ యందమా ఇది నాకు ప్రాణములకంటెఁ బ్రియమైనది. దీని నెవ్వరను దాఁక నీయను. సరస్వతిని ఆ మెవీణను వాయించుకొన నిమ్ము. నారామ నామమును సాగనిండు. "జయ జయ సీతారామ" ఇట్లని నారదుఁడు వెళ్లిపోయెను.

ఇప్పుడు ముగ్గురును జాల భయపడిరి. కోమల వాక్కులతో బ్రహ్మణి యిట్లనెను:– "నారదా! నారదా! నీమీఁద ఒట్టు. నీవు తిరిగి రాక పోయితివా మీ నాయనమీఁద ఒట్టు, అబ్బాయీ! ఒక్కమాట వినిపొమ్ము. నీకన్నియుఁ దెలియును. త్రిమూర్తు లెచ్చటికిఁ బోయిరి?"

నారదుఁడు వ్రేలితోఁ జూపించుచు నిట్లనెను:– "వారు అనసూయ యాశ్రమమున నాడుకొను చున్నారు."

లక్ష్మీదేవి శీఘ్రముగ నిట్లనెను:– "ఏమి యాట? ఎన్ని దినములైనది? నీవు మా దగ్గఱకు రమ్ము. ఇప్పుడు నీ వీణను గీణను బగులఁగొట్టుము. మాట చెప్పుము. మేము మా పతులతో నెట్లు కలిసికొందుము?"

నారదుఁ డిట్లనెను:– "నాకీ విషయము లన్నియు నెట్లు తెలియును? నాకు తల్లుల దగ్గఱకు వచ్చుట తెలియును."

పార్వతి యిట్లనెను:– "నారదా! నీ పొట్టలో నన్నియును గలవు. అన్నియు నీకుఁ దెలియును. మేమా యాశ్రమమున కెట్లు వెళ్లవలయును? అనసూయ అప్రసన్నము కాదుకదా! మాకు చాల భయముగ నున్నది."

నారదుఁ డిట్లనెను:– "మీరు పొరపాటునైన నచ్చట యడుగు పెట్టవద్దు. మీరు లోపలికిఁ బోయితిరా ఆమె తన పాతివ్రత్య ప్రభావముచే మిమ్ము భస్మము చేయఁగలదు."

ముగ్గురును మిక్కిలి భయపడి యిట్లనెను:– "నారదా! ఇప్పుడు పరిహాసము లాడకుము. విషయ మంతను జెప్పవలయును. వారు ముగ్గు రెచ్చట నున్నారు ?"

నారదుఁడు నవ్వు నాపుకొని యిట్లనెను:– "వారు ముగ్గురు 'క్యావు' 'క్యావు' మను చున్నారు. ముగ్గుర నోళ్లు కట్టుపడినవి. చుబుకు చుబుకుమని పాలు త్రావుచున్నారు. కిలకిల నవ్వుచున్నారు. పిల్లలంత పిల్లలైనారు. ఆమె యెచ్చట కూర్చుండఁబెట్టిన నచ్చటనే కూర్చుందురు. ఎచ్చట పరుండఁ

బెట్టిన నచ్చుట పరుండెదరు. ఇఁక వారిపై నాశ పెట్టుకొనకుఁడు. పదునైదు, యిరువది సంవత్సరములకుఁ బెద్దవారు కాఁగలరు. అప్పుడనసూయ వారికి మరల వివాహ మొనర్పఁ గలదు. ఇఁక మీరందఱు భస్మమలదుకొని జపమాలతో రామ రామ యని జపింపుఁడు. ఇంకొక ఉపాయము లేదు. అనసూయకు మించిన పతివ్రత లోకములో లేదని యిప్పుడు గ్రహించితిరా?''

లక్ష్మీదేవి యిట్లనెను:- "ఈ విషవృక్షమును నీవే నాటితివి. నీవు గెలిచితివి, మేము ఓడితిమి. మేమామెతోఁ గలిసికొను నుపాయ మాలోచింపుము. మేము చేసిన దానికి ఫల మనుభవించితిమి. నిజముగ నెప్పుడును గుణవంతుల యెడల నసూయఁ జెందరాదు. ఇతరులను ద్వేషించుటయే అన్నిటికంటె గొప్ప పాపము.''

నారదుఁ డిట్లనెను:- "ఇప్పుడు వచ్చినారు సరియైన త్రోవకు. పశ్చాత్తాపము వలన పాపములన్నియుఁ బోఁగలవు. ఇప్పు డొక్కటే యుపాయము కలదు. మీరు సతీ అనసూయను శరణు వేఁడిననే మీకు కల్యాణము కలదు."

ముగ్గురును ఆశ్రమ సమీపమునకుఁ బోయిరి. తలుపు వేసియున్నది. తలుపు తీసికొని లోపలికిఁ బోవు సాహస మెవ్వరికిని లేదు. అనసూయ కోపబడునేమోనను భయము కలదు. స్నానార్థ మామె మందాకినీ నదికి వెళ్లి యుండ వచ్చును. కుటీరము వెనుక నొక విశాలమగు వటవృక్షము కలదు. దానిపై నెక్కి చూడఁగా నొక యుయ్యాలలో ముగ్గురు బిడ్డలు పరుండి కిలకిల లాడుచుండిరి. విష్ణువు ఉయ్యాల సందుల

కుండా లక్ష్మిని జూచి "మ్యావు" "మ్యావు" మని అఱచెను. లక్ష్మీదేవి చేతితో సైగఁ జేయుచు యిట్లనెను:- "ఏల మోసము చేసెదరు, రండు." అచ్చట నుండియే చేతిని గదలించు చుండిరి. ముగ్గురు ముగ్గురను గాంచిరి. కాని వారు ముగ్గురు అనసూయ తపమునకు వశులైరి. అందువలన నామె నడుగక రాఁజాలరు. ఈ ముగ్గురకు అనసూయ శాపభయము కలదు. ఆమెనడుగక క్రిందకు దిగుటకు వారికి సాహసము లేదు. అల్పకాలముననే అనసూయ తడిగుడ్డలు కట్టుకొని వచ్చెను. ముగ్గురును జెట్టునుండి దిగి కుటీరద్వారమున నిలువఁ బడిరి. అచ్చటనేయుండి "అమ్మా! అమ్మా! మేము లోపలికి రావచ్చునా ?" అనిరి.

తల్లి లోపలనుండియే యిట్లడిగెను:- "మీ రెవరు ?" ముగ్గురిట్లనిరి:- "దేవి ! మేము మీ కోడండ్రము."

తల్లి యిట్లనెను:-"అయ్యో ! కోడండ్రడుగు టెందులకు? రండు, ఇది మీ యిల్లే." ఇది విని ముగ్గురును సిగ్గుపడుచు లోపలికి వెళ్లి అనసూయపాదములపై బడిరి. అనసూయ యిట్లనెను:- "మీరు పెద్దవారే, మీ భర్తలకుఁ బ్రియమైనవారే. అయితే మా పిల్లలు చిన్నవారు, కోడండ్రు పెద్దవారు."

ఇంతలోనే అత్రిమహాముినియు వచ్చెను. కోడండ్రు ముగ్గురును ముసుఁగులు సవరించుకొని యొక్కప్రక్కకు నొదిగిరి. "దేవీ! ఈ ముగ్గు రెవ"రని ముని యడిగెను.

అనసూయ యిట్లనెను:- "నాథా! వీరు మీకోడండ్రు."

ముని యిట్లనెను:- "నీవు పరిహాసములాడుచున్నావు, ఇప్పుడే పుత్రుల నొనర్చితివి. వారికను ఆఱునెలల వారు

కాలేదు, అప్పుడే కోడం[డ్రా? చేతెడు కొడుకులు, అయిదు చేతుల పొడవు కోడం[డ్రా? ఇదెక్కడి విచిత్రవిషయము!"

అనసూయ యిట్లనెను:- "స్వామీ! ఇందులో హాని యేమికలదు? కోడలు పెద్దదైన భాగ్యము పెద్దదను సామెత కలదుకదా! పిల్లలు పెద్దవారు కారాయేమి?" ఇది విని ముని నవ్వి రహస్యమునంతను గ్రహించెను.

ఇప్పుడు ముగ్గురును అనసూయ పాదములను బట్టుకొని యిట్లనిరి:- "దేవీ! మమ్ములను క్షమింపవలయును. మేము చేసినదానికి ఫల మనుభవించితిమి. ఇఁక మాపతులను మా కొసంగుఁడు."

అనసూయ యిట్లనెను:- "నేను కాదంటినా? నిద్రపోవు చున్నారు. లేవఁదీసి తీసికొనిపొండు."

ముగ్గురిట్లనిరి:- "అమ్మా! మమ్ములను లజ్జితలఁ గావింప కుఁడు. లోకములో మాకు నగుబాటు గావింపకుఁడు. ఎవరైన నేమందురు? వీరిని యథాప్రకారము కావింపుఁడు."

వీరు ముగ్గురు దుఃఖించుటను గాంచఁగానే అనసూయ హృదయము కరిగిపోయెను. ఆమె చేతిలోనికి నీటినిఁ దీసికొని పిల్లలపైఁ జల్లెను. త్రిమూర్తులు తమ స్వస్వరూపములను ధరించి తమ తమ వాహనములపై నెక్కిరి. సతీ అనసూయ లేచి ముగ్గురకు వందనమొనర్చి, ప్రదక్షిణము గావించి, పూజిం చెను. తల్లి పూజకు ప్రసన్నులై త్రిమూర్తు లిట్లనిరి:- "పతివ్రత లారా! మేము నీ పాతివ్రత్యమునకు సంతసించితిమి. నీకు కావల సిన వరము నడుగుము."

ఇది విని బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు నమస్కరించి గద్గద కంఠముతో ననసూయ యిట్లనెను:- "మీరు నాపై ననుగ్రహముంచినచో మీరు ముగ్గురు నాకు పుత్రులు కావలె నను వరమును గోరుకొందును."

ప్రసన్నులై త్రిమూర్తు లిట్లనిరి:- "తథాఽస్తు" మంచిది. మేము మా అంశములతో నీకు పుత్రుల మగుదుము."

సూతుఁ డిట్లనెను:- మునులారా! అనసూయ కీవిధ ముగ వరములొసంగి, యెదుట సిగ్గుతోఁ దలవంచుకొనిన ఉమా రమా సరస్వతులను గాంచి త్రిమూర్తు లిట్లనిరి:- "నేఁడీ లోకములో సర్వశ్రేష్ఠమగు పతివ్రత యెవరు?"

లజ్జించుచు ముగ్గురు నేక కంఠమున నిట్లనిరి:- "పుణ్య శ్లోక ప్రాతఃస్మరణీయ యగు అనసూయయే సర్వశ్రేష్ఠమగు పతివ్రత. ఈమెను మించిన పతివ్రత యీ లోకములో నింకొ కతె లేదు."

ఇది విని శౌనకుఁ డిట్లనెను:- "సూతా! నీవు అద్భుత మగు పాతివ్రత్యమహాత్మ్యమును వినిపించితివి. త్రిమూర్తులు తమ యైశ్వర్యమునుగూడ మఱచునట్లు చేసిన పాతివ్రత్యప్రభావ మతిశ్రేష్ఠమైనది."

అంత సూతుఁడిట్లనెను:- "ఋషులారా! పతిని బరమే శ్వరుఁడనుకొని, తన మనస్సును బతిమనస్సునందుఁ గలిపిన

---

శ్లో॥ అనసూయాబ్రవీన్నత్వా దేవాన్ బ్రహ్మేశకేశవాన్
యూయం యది ప్రసన్నా మే వరార్హా యది వాప్యహమ్॥
ప్రసాదాభిముఖాః సర్వే మమ పుత్రత్వ మేష్యథ॥

సాధ్వి యేమిచేయఁజాలదు ? పతి యెట్టివాఁడైన గానిండు' ఆమె యాతని గుణకారణమునఁగాదు, తన ప్రభావకారణమున, దన సాధనసహాయమున, తదేక నిష్ఠాయాధారమున నేమైనఁ జేయఁగలదు. ఈ విషయములో మీకత్యంత సుందరాఖ్యాన మును జెప్పెదను. దీనివలన మీకు పాతివ్రత్య ప్రభావము తెలియఁగలదు. పాతివ్రత్యముముం దేదియుఁ బనికిరాదనియు, వా రసంభవములను సంభవములను జేయఁగలరనియు, దేలఁగలదు."

—:0:—

## పతివ్రతా ప్రభావము.

మనస్సులో మహాశక్తి కలదు. బ్రహ్మ మనస్సుతోడనే యీ చరాచర విశ్వమును రచించినాఁడు. మనస్సంకల్పము చేతనే మహావిష్ణువు విశ్వమును బరిపాలించును. మనస్సుచేత నే శంకరుఁడు సృష్టినంతను సంహరించును. మనోవశమైన జగత్తం తయు వశమగును. భగవంతుని వశముచేసికొనినవాఁడు అందఱి కంటె శ్రేష్ఠుఁడు. మనస్సునకు వశపడినవాఁడు తృణమునకుఁ గూడ వశమగును, హీనాతిహీనుఁడగును, విషయదాసుఁడగును. మనశ్శక్తి కంటెలేదు. ఇంత శక్తిశాలియగు మనస్సు మన దగ్గఱనుండియు మనము దుర్బలులము, దుఃఖితుల మేల కావల యును ? కారణము దానిని మనము విషయములలోఁ బడవైచి నాము. సంయమమొనర్పక దాని నటునిటు బోవదలినాము. దానిని నిరోధించి, దానిమెడకు త్రాడువైచి, ఒక నియతస్థాన మునఁ గట్టియుంచలేదు. అప్పుడు మేకుకుఁ గట్టినచో, సమయ

మనకుఁ బాలిచ్చును, దానివలనఁ బెరుగగును. పెరుగువలన మజ్జిగ వెన్న వచ్చును. వెన్నవలన ఘృతములభించును. యజ్ఞ యాగములు జరుగును. భగవత్ప్రసాదము లభించును. అంద ఱకుఁ దృప్తికలుగును. దూడలను బెట్టును. వంశవృద్ధి కాఁగ లదు. సమస్త సుఖముల నొసంగును. గోవును స్వతంత్రముగ వదలినచో నితరుల పొలమున మేయును. ఆ పొలమువారు తిట్టుదురు. శాపములు పెట్టుదురు. అపయశము కలుగును. పాల పెరుగు నీయదు. దుఃఖమే కలుగును. ఇట్లే సంయమమున నుంచిన మనస్సు, ఒకలక్ష్యమున బంధింపఁబడిన మనస్సు మహా బలము కలదగును. అది యేపనినైనఁ జేయఁగలదు. చిత్తవృత్తి నిరోధమే యోగము. తనకుఁ బ్రియమైనది, యిష్టమైనదేదియో దానియందు సర్వాత్మభావముతో మనస్సును లగ్నము చేయు టకు యోగమందురు. కొందఱు మనస్సును భగవత్ప్రతిమయం దుంచెదరు. కొందఱు మంత్రజపమందును, కొందఱు ధర్మ మందును, కొందఱు ప్రాణములందు నుంచెదరు; కాని పతివ్రత తన ప్రాణనాథుని యందుంచి యోగులకు మించిన సామర్థ్య మును, సిద్ధులను బొందును. ఆమె తరించుటయేగాక పాపియగు తన పతినిగూడ తరింపఁజేయును.

సూతుఁ డిట్లనెను:– "మునులారా! మీకు నేను పతివ్రత లలో శ్రేష్ఠురాలగు శైబ్య చరిత్రమును సంక్షిప్తముగఁ జెప్పెదను."

ప్రాచీనకాలమందు గంగా యమున మధ్యప్రదేశమున సమృద్ధిశాలియగు ఆహారమను నగరమున నొక బ్రాహ్మణుఁడు నివసించుచుండెను. బ్రాహ్మణుఁడు పూర్వజన్మ పాపకారణమునఁ

గాముకుఁడును, కుష్ఠురోగియునై యుండెను. ఆతని శరీరమంత టను గలితకుష్ఠ ముండెను. ప్రతిదినము క్రొత్తపుండ్లై, దాని నుండి రసిక కారుచుండును.''

శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! ఏకారణమున బ్రాహ్మణుఁడైనను ఆతనికి గలితకుష్ఠము ప్రాప్తించినది? ఆతఁ డింతటి పతితావస్థలోఁగూడ కామిగా నేల నుండెను?''

సూతుఁ డిట్లనెను:- "మహానుభావా! పూర్వజన్మమందా బ్రాహ్మణుఁడు బ్రహ్మహత్యను గావించెను. ఇంకను పరనిందాపాపమును బొందెను. పరనిందకు మించిన పాపములేదు. అందువలన నాతఁడు కుష్ఠురోగి యయ్యెను. కాని పూర్వపుణ్యవిశేషముచే నాతనికి పతివ్రతయగు ప్రాణపత్ని లభించినది. ఆమె పేరు శైబ్య. ఆమె తన పతినే పరమేశ్వరుఁడుగ నెంచెడిది. ఆతఁడు కుష్ఠువాఁడైనను సర్వదా ఆతనిని శ్రద్ధతో సేవించెడిది. ఆతని గాయములను గడిగెడిది. చీమును దుడిచెడిది. ఆతనిని చక్కని శయ్యపైఁ బరుండఁబెట్టెడిది. మంచి మంచి పదార్థములను దయారుచేసి పెట్టెడిది. మంచి సుగంధ ధూపముల నాతని సమ్ముఖమున వేసెడిది. సారాంశమేమన నామె సర్వవిధముల తన పతిని సంతోషపెట్టుచుండెడిది.''

శౌనకుఁ డిట్లనెను:- "సూతా! ఇట్టిపాపి కింతటిపతివ్రతయగు భార్య యెట్లు లభించినది? శైబ్యవంటి మహాపతివ్రతకు భర్తయగునంతటి దేవదుర్లభపద మాతని కే సర్వోత్కృష్ట సుకృతముచే లభించినది?''

సూతుఁ డిట్లనెను:- "మునివరా! పూర్వజన్మమున నాతఁడొక పుణ్యకర్మమును జేసినాఁడు. ఆ జన్మమున నాతనికి

నల్గురు పుత్రికలు కలరు. వారు రజస్వలలు కాకపూర్వమే, పది సంవత్సరముల ప్రాయమున సజాతీయులును, సుశీలురును, వేదజ్ఞులగు బ్రాహ్మణ యువకులకు సాలంకృత కన్యాదాన మొనర్చెను. శౌనకా ! గృహస్థాశ్రమములో నిత్యమును దెలిసి కొన్ని, తెలియక కొన్ని పాపములు చేయుట సంభవించుచుండును. అయితే దీనిలో గొప్ప పుణ్యములు రెండు కలవు. మొదటిది అన్నదానము, రెండవది కన్యాదానము. గో, భూదానములు శ్రేష్ఠములే కాని అన్నదానము వీనికంటెను శ్రేష్ఠమైనది. ఆఁకలి గొన్నవానికి అన్నదానము చేయుట యనఁగాఁ బ్రాణదానము చేయుటయే. ఇతర దానములకు గొప్ప గొప్ప నియమములు కలవు. అపాత్రునకు దాన మొసంగిన నది నిష్ఫలమగును. ఒకొక్కప్పుడు పుణ్యమునకు బదులుగఁ బాపము సంభవించుచుండును; కాని అన్నదానము విషయములోఁ బాత్రాపాత్ర విచారములేదు. తన యింటి కెవఁడైన నాఁకలితో వచ్చెనా, ఆ యాఁకలిగొన్నవానికి తృప్తిగా నన్నము బెట్టుటకు మించిన పుణ్యకార్యము లేదు. ఈ యన్నదానమునకు సమానమైనది కన్యాదానమని చెప్పఁబడినది. యోగ్యుఁడగు వరుని వెదకి, శ్రద్ధతో వానికి వస్త్రాభూషణాదుల నొసంగి, తన శక్తికొలఁది ధన, వస్త్ర, గో హిరణ్యాదుల నొసంగి వేదవిధిచే దాన మొసంగుట సర్వశ్రేష్ఠమగు పుణ్యము. ఈ విధముగఁ గన్యాదానము చేసిన గృహస్థునకు జన్మాంతరమునఁ బతివ్రతయగు భార్య లభించును. ఈ బ్రాహ్మణుఁడు చేసిన పుణ్యమిదియే. ఆప్రభావముచే నీతనికి పతివ్రతయగు భార్య లభించినది. పురాణములలో నామె నామ మజరామరమయ్యెను.

ఆ కుష్ఠుబ్రాహ్మణుఁ డేది యడిగిన శైబ్య దానిని దెచ్చి యిచ్చుచుండును. శైబ్య యొక్క పాతివ్రత్య ఖ్యాతి సర్వత్ర వ్యాపించినది. మునివరులారా! పుణ్యకర్మను దాఁచిన వృద్ధి పొందును. పాపకర్మ ప్రకటమైన నశించిపోవును. పుణ్య పాప కర్మల నెన్నాళ్లు దాఁచినను, ఏదో దినమున నవి బయటపడి తీరును. మన పుణ్యపాపముల నేకాంతములో నెవ్వరును జూడ రని మన మనుకొనుచుందుము. పరమాత్మ అన్నిటిని జూచు చున్నాఁడు. సూర్య, చంద్ర, పృథ్వి, జల, వాయువు, ఆకాశము, అంతరిక్షము, దినము, రాత్రి, సంధ్యలు, ధర్మములు ఇవన్నియు సమస్త విషయములను జూచుచుండును.''

అంత శౌనకుఁ డిట్లడిగెను:— సూతా! పరలోకములోఁ బుణ్యపాపములు జరుగుచుండును; కాని చాల రహస్యముగ నేకాంతమునఁ జేసిన పుణ్యపాపము లెట్లు బయటపడును?''

సూతుఁ డిట్లనెను:— మహాభాగా! నీవేకాంతమున నేమి చేయుచున్నావు? నీమెదడులోనికి వచ్చిన యాలోచనలు వాయు మండలముద్వారా వచ్చును. మనము దేని నాలోచించినను, దేనిని జేసినను దాని ప్రభావము వాయుమండలమునఁ బడును. శబ్దము నిత్యము. మనము మాటాడిన శబ్దము నశింపదు. నశించునెడల దూరశ్రవణ యంత్రముద్వారా తీగె సంబంధ మును లేకయే విదేశ విషయముల నెట్లు వినుచున్నాము! ఒక రాజును పుత్రసహితముగ నొక యవనరాజు బందీగా నొనర్చెను. బంధితుఁడగు రాజు దానపుణ్యము నొనర్చుట కాజ్ఞను వేఁడెను. ఉదారతచే నాతఁ డాజ్ఞ నొసంగెను. పెద్ద పెద్ద గంపలలో మిఠాయిలు, పండ్లు వచ్చుచుండెను. ఒక

దినమునఁ బ్రాతఃకాలమున రాజు, రాజకుమారుఁడు పెద్ద గంపలలోఁ గూర్చుండి కారాగృహమునుండి తప్పించుకొని పోయిరి. యమున కావల గుఱ్ఱములుండెను. ఇద్దరును దాని పైఁ గూర్చుండి త్వరత్వరగాఁ బారిపోవు చుండిరి. పది పదునైదు క్రోసుల దూరము పోవునప్పటికి సూర్యోదయ మయ్యెను. చాలమంది గ్రామీణ స్త్రీ పురుషులు నదివైపునకు స్నానము చేయ వెడలుచుండిరి. వారు పరస్పరము రాజు, రాజకుమారుఁడు యవనకారాగృహమునుండి పారిపోయిరని వారిలో వా రనుకొను చుండిరి. కుమారునకు చాల ఆశ్చర్యము వేసెను. ఆతఁడు మహారాజుతో నిట్లనెను:- "తండ్రీ! ఇంకను కారాగృహవాసులకే మనము పారిపోవుట తెలిసియుండదు గదా, యీ స్త్రీ పురుషుల కందఱకు అప్పుడే యెట్లు తెలిసినది?"

ఇది విని మహారాజు నవ్వి యిట్లనెను:- "వత్సా! మనము పారిపోవుట కెప్పుడు నిశ్చయించితిమో అప్పుడే యా భావము వాయుమండలమున వ్యాపించినది: ఇచ్చట యెవఁడో ధర్మాత్ముఁడు దానిని గ్రహించియుండుటచే నీ విషయము వ్యాపించినది. ఏభావముగాని విచారముగాని దాఁగియుండదు. కావున మునులారా! ఆ సమయమున దిన, వారపత్రికలు లేకున్నను ఇంటింట వార్తాహరుఁడు తిరుగకున్నను, యీమె పతిని ఈశ్వరబుద్ధితోఁ బూజించుచున్నదను యశస్సౌరభము సర్వత్ర వ్యాపించినది.

ఒక దినమున నా కుష్ఠురోగి తన యింటి ముందు కూర్చుండి యుండెను. అత్రోవను ఆ నగరములోని సర్వశ్రేష్ఠ మగు వేశ్య బాగుగా నలంకారము చేసికొని వెళ్లెను. ఆమె

అచ్చటి రాజవేశ్య. అపార సౌందర్యము, విపుల ధనము, అనేక దాసదాసీజనములు కలది. ఆమె రూపజ్వాలయందు అసంఖ్యాకులగు ధనవంతులు, రాజులు, మహారాజులు పతంగముల వలె వచ్చి తమ ధన యౌవనములను భస్మము చేయుచుండిరి. అసలే ఆమె రూపసౌందర్యము కలది. అందులో నామె రాజసభకు గానముచేయుటకు అమూల్యములగు వస్త్రాభూషణములను, అలంకారములను జేసికొని వెళ్లుచుండెను. ఆతని కేవిధమునను జిత్తశాంతి లేనట్లుగఁ గామపీడ కలిగెను. అత్యంత చింతతో, దుఃఖిత చిత్తముతో నాతఁడు దీర్ఘశ్వాసములను గొనుచుఁ గొట్టుకొనుచుండెను. నేఁడు తన పతి దశను జూడఁగానే పతివ్రతకు మిక్కిలి దుఃఖము కలిగెను. ఆమె అత్యంత మధుర శబ్దములతో నిట్లనెను:— "ప్రాణనాథా! నేఁడేమో తమ కత్యంత మానసిక వ్యథ కలిగినట్లున్నది. అది దాఁచరానిదైన శీఘ్రముగ శలవిండు. నేను దానికి ప్రతీకార యత్నమును జేతనైనంతవఱకుఁ జేసెదను. మీ కష్టమేమి? ఈ దాసివలన సేవలో నేమైన లోటు కలిగినదా? తెలిసి తెలియక నేదైన నపరాధమును జేసియుంటినా?"

ఇది విని కుష్ఠురోగి మిక్కిలి దుఃఖముతో నిట్లనెను:— "దేవీ! నీవు నాకు మిక్కిలి సేవచేయుచున్నావు. నీవలన నే యపరాధము జరుగఁగలదు? నీవెన్నడును నాపనిలోఁ బ్రమాద పడవు. అందువలన నాసేవలో లోపము జరుగు నవకాశము లేదు. నేఁడు నా మనస్సు నిజముగ దుఃఖించుచున్నది; కాని అది నా పాపఫలమే. నీదోష మేమియును లేదు. నాకీ మానసిక వ్యథ బాధించుచున్నట్లు శారీరకవ్యథ బాధించుటలేదు."

సతి యిట్లనెను:- "దేవా! మీరు మీ మానసిక వ్యథకుఁ గారణమును దెల్పుఁడు; నేను నాశక్తికొలఁది దానిని నివారించుటకుఁ బ్రయత్నించెదను."

కుష్ఠురోగి యిట్లనెను:- "దేవీ! దానినిఁ జెప్పుటకు నాకు చాల సిగ్గగుచున్నది. కాని నీతోఁ జెప్పకున్నచో నాకు ప్రాణమే నిలువకపోవచ్చును. నా మనోరథము పూర్తికానిది. దుస్సాధ్య మనోరథము. నా పాపపు మనస్సు ఆ వారాంగనారూపమందు లగ్నమైనది. ఎంతగా మనస్సును గుదటపరుచుకొందమనుకొన్నను గుదుటపడుటలేదు. నాదుఃఖమునకుఁ గారణమిదియే."

సతి యిట్లనెను:- "ప్రభూ! ఇది యత్యంత కఠినకార్యమే కాని, అయినను బ్రయత్నించెదను. చేతనైనంతవఱకు నేను మీ మనోరథమును దీర్చెదను. మీరు నిశ్చింతగా నుండుఁడు." ఇట్లని సతి యావేశ్యను బ్రసన్నము కావించుకొనుట కుపాయము నాలోచించుచుండెను. ఆలోచించుచు నాలోచించుచు నామె తన కర్తవ్యమును స్థిరపఱచుకొనెను.

ఆమె తెల్లవారుజామున చీఁకటిలో చీపురు, ఆవుపేడను దీసికొని వేశ్యయింటికిబోయి, ఆమె యింటిముందు వాఁకిటిలో బాగుగా నూడ్చి, ఆవుపేడతోఁ గలయంపి చల్లి, రంగవల్లి ముగ్గులుతీర్చి యింటివారు లేవకమునుపే వచ్చివేసెడిది. వేశ్య లేచి క్రిందకు దిగి చూచునప్పటికి ఆవరణమంతయుఁ జిమ్మఁబడి కలయంపి చల్లఁబడి,ముగ్గులుపెట్టియుండుటను గాంచి చకితయై యట్టి శుభ్రమైన పని నెవరు చేసిరని యందఱ నడుగుచుండెను.

అందఱిట్లనిరి:- "మాకు తెలియదు, మేము మాత్రము చేయలేదు." అప్పుడామె కింకను నాశ్చర్య మయ్యెను. ఈ విధముగ మూఁడు దినములు గడిచెను. నాల్గవదినమున నామె యచ్చట దాఁగియుండెను. సతి వచ్చి యథాప్రకారముగఁ జిమ్ముట కారంభించెను. ఇంతలో నా వేశ్య వచ్చి శైబ్య రెండు పాదములను బట్టుకొని యేడ్చుచు నిట్లనెను:- "అమ్మా! నీవు పతివ్రతవు. సాధ్వివి. దేవతలుకూడ నిన్నుఁ బూజించెదరు. నేనొక లోకనిందిత, పతిత యగు పణ్యస్త్రీని. నీవు నాపై నేల పాపమును బడవేయుదువు? నేను నీ కే కార్యమును జేయ వలయును? దేవీ! నీకు ధన మావశ్యక మగునెడల నావద్ద మణుగులకొలఁది సువర్ణ మున్నది. కావలసినంత తీసికొని పోవచ్చును. నీకు మణిమాణిక్యములు, ముత్యములు కావలసిన యెడల కావలసినన్ని కలవు. తీసికొని పోవచ్చును. నీవు నా కేదైన నాజ్ఞనిండు."

సతి మిక్కిలి స్నేహముతో నిట్లనెను:- "అక్కా! నాకు ధన సంపత్తు లవసరము లేదు. నీ వొక పని చేయవలయును, అది చాల కఠినమైనది. దానిని నీవు చేయుదువా లేదా?"

అత్యంత స్నేహభావముతో దృఢతాస్వరమున వేశ్య యిట్లనెను:- "అమ్మా! నేను పతితనే కాని హృదయహీనను గాను. వేశ్యావృత్తిలో నున్నను నేను నా హృదయము నష్టము కావించుకొనలేదు. నా ప్రాణముల నర్పించియైనను నీకు ప్రియకార్యమును జేయఁగలిగిన యెడలఁ జేయుదునని ప్రతిజ్ఞను జేయుచున్నాను. వెంటనే చేయుదును, ఆలో

చింపకయే చేయుదును. నీవు కొంచెమైనను సందేహింపరాదు. నా మాటపై విశ్వాసముంచుము.''

సతి యిట్లనెను:— "దేవి ! నాకు నీ ప్రాణము లవసరము లేదు; కాని నేను నీద్వారా కుష్ఠువాఁడగు నాపతి మనోరథమును దీర్పఁగోరుచున్నాను. ఆతనికి శరీర మంతటను గళితకుష్ఠము. గాయములనుండి నిరంతరము రసిక, చీము కారుచుండును.''

ఇది వినఁగానే వేశ్య క్షణకాలము భయపడెను. మరల ధైర్యమును వహించి యిట్లనెను:— "దేవి! శరీర మందఱకుఁ బ్రియమను సంగతి నీకు తెలిసినదే. నా దగ్గఱకు రాజులు, రాజపుత్రులు, ధనవంతులు, గౌరవము గలవారు సర్వదా వచ్చుచుందురు. ఒకరోజు నేను నీ కవకాశ మీయఁగలను."

సతికి మిక్కిలి ఆనందము కలిగెను. ఆమె అత్యంతోల్లాసమునఁ బతి సమీపమునకుఁ బోయి యిట్లనెను:— "ప్రాణనాథా! మీ మనోరథము నెఱవేరినది. నేఁడు మీ యభిలాషను బూర్తి కావించుకొనవచ్చును.''

చింతతోఁ గుష్ఠురోగి యిట్లనెను:— "దేవి! నా కాలు తినివేసినది. నేనచ్చటికి కెట్లు పోఁగలను ?''

సతి యిట్లనెను:— "దీనికి చింతింపవలదు. నాభుజము మీఁదఁ గూర్చుండఁబెట్టుకొని నే నచ్చటికి మోసికొని పోయెదను".

లజ్జతోఁ దలవంచుకొని యాతఁ డిట్లనెను:— "దేవి ! నీవు ధన్యురాలవు. నీవు మర్త్యలోకపుమానినివి కాదు, వైకుంఠ లోకపు వనితవు. ఇంకొక స్త్రీ యిట్లు చేయఁగలదా ?''

సూతుఁ డిట్లనెను:- "మునులారా! కామాతురులకు లజ్జా సంకోచ, నిందాపవాద భయముండదు. చీఁకటి పడఁగానే ఆ కుష్ఠురోగి తన భార్య భుజముపైఁ గూర్చుండి వేశ్య యింటికి వెళ్లెను. దైవయోగముచే దారిలో మాండవ్యముని శూలమునకు గ్రుచ్చఁబడి యుండెను. ఇంతవఱ కాతఁడు సమాధిలో నుండెను. ఈ సమయమున నాతనికి సమాధి భంగమయ్యెను. అతి గాఢాంధకారము. దేవి కనఁబడుటలేదు. ఆ కుష్ఠువాని కాలు ముని శరీరమునకు దగిలెను. శరీరమునకు కాలు తగులుటచే, ఆ కుష్ఠురోగి నుండి అత్యంత భయంకర దుర్గంధము వచ్చుటచే మునికి క్రోధము కలిగెను. ఆతఁడు వెంటనే "ఏ దుర్మార్గుని పాదము తపఃపూతమగు నా శరీరమునకుఁ దగిలినదో నేఁటికి పదవరోజున సూర్యోదయము వేళకు ఆతఁడు మరణించుఁగాక!" అని శపించెను.

ఈ శాపమును వినఁగానే కుష్ఠురోగి కామము కర్పూరమువలె నెగిరి పోయెను. మృత్యువు ముందు కామభోగమేముండును?

ఆతఁడు శీఘ్రముగ నిట్లనెను:- "దేవి! ఇంటికి వెళ్లుము. ఇప్పుడు నేను మరణించెదను."

సతి మిక్కిలి ధైర్యముతో నిట్లనెను:- "ప్రాణనాథా! మీరు చింతింపకుఁడు. పదవరోజున సూర్యోదయమునకు మరణించెదరని ముని శపించెను. నేఁటినుండి సూర్యోదయమే కాదని నేననుచున్నాను. సూర్యోదయమే కాకపోయిన మీరు మరణించు ప్రశ్నయే లేదు."

ఇట్లని సతి తన పతిని దీసికొని యింటికి వచ్చెను. నిజముగ సతీ వచనముచే సూర్యోదయమే కాలేదు. జనులు నిద్రించి నిద్రించి విసుగుఁ జెందిరి. ఊరక పొరలుచుందురు. కాని యెప్పుడు లేచి చూచినను రాత్రియే. అందఱదరిపడిరి. యజ్ఞ యాగము లాగి పోయెను. సంసార కార్యము లాగిపోయెను. అగ్నిహోత్రములు లేకపోవుటచే దేవతలకు హవిస్సు లంద లేదు. తర్పణములు లేకపోవుటచేఁ బితరుల దాహము తీరలేదు. త్రిలోకములం దాహాకారము వ్యాపించెను. దేవతలు బ్రహ్మ దేవుని కడకు పరువిడిరి. బ్రహ్మ సమాధిలో సమస్తమును గ్రహించి యిట్లనెను:- "దేవతలారా! ఇది నా శక్తికి మించిన విషయము. పతివ్రతల పలుకుల కన్యథా చేయుశక్తి నావద్ద లేదు. శంకరునికే కాదు, సాక్షాద్విష్ణుభగవానునికిని లేదు. ఒక పతివ్రతకు మేము ముగ్గురము బిడ్డలమైతిమి. పతివ్రత వచనములను బతివ్రతయే నివారింపఁగలదు. మీరందఱామెనే శరణు వేఁడుఁడు.

దేవత లిట్లనిరి:- "స్వామీ! ఒంటరిగాఁ బోవుటకు మాకు సాహసము లేదు, మీరును దోడు రండు. మీరు పెద్దవారు గదా! పెద్దవారి కందఱు లొంగుదురు."

బ్రహ్మ యిట్లనెను:- "మంచిది. వెళ్లుదము, నేనును వచ్చెదను." ఇట్లని బ్రహ్మను ముందిడుకొని దేవతలందఱును సతియొక్క యింటికి వెడలిరి.

తనయిల్లు విమానముల కాంతులచే మిరుమిట్లు గొలుపు చుండుటను సతి గాంచెను. అప్పుడామె ఆశ్చర్యాన్విత

యయ్యెను. ఆమె బ్రహ్మాది దేవతలకు విధ్యుక్తముగ నభ్యర్చనము కావించెను.

దేవతలామె పూజను స్వీకరించి యిట్లనిరి:- "దేవీ! త్రిలోకములందు కేవలము నీ కారణమున హాహాకారము వ్యాపించినది. నీవు సూర్యోదయ మగునట్లు చేయుము."

సతి యిట్లనెను:- "సూర్యునితో నాకు వైరము లేదు. సూర్యోదయము కాఁగానే నాపతి మరణింపఁగలఁడు. అందువలన నేను సూర్యు నడ్డగించితిని.?"

బ్రహ్మ యిట్లనెను:- "నీభర్త యొక్కఁడు మరణించుటచే బ్రహ్మాండమునకు మేలు కలుగును. దేవీ! పరోపకారము చేయుము; క్షుద్రతను వదలుము, ఇట్టి హఠము మంచిది కాదు."

సతి యిట్లనెను:- "స్వామీ! సతికి సర్వస్వము పతియే. పతికి మించిన ధర్మము లేదు. విధవ యగుట పతివ్రతకు మిక్కిలి కలంకము. నేనేవిధముగనైన నొప్పుకొనుటకు వీలులేదు."

మనము చెప్పిన నీమె వినదనియు ఇంకొక పతివ్రత వచ్చి చెప్పిననే ఈమె విననియు బ్రహ్మ గ్రహించి దేవతలతో నిట్లనెను:- "మీరందఱు అనసూయ దగ్గఱకు బొండు. ఆమె చెప్పిన నీమె వినును. వీరిద్దరకు స్నేహభావము కలదు. ఈమెయందు మిక్కిలి భక్తి కలదు." బ్రహ్మయొక్క ఆజ్ఞను బొంది దేవతలు అనసూయ ఆశ్రమమునకుఁ బోయిరి. దేవతా ప్రార్థనమున అనసూయామాతావచ్చెను. ఆమె సతీశైబ్యను సమస్తవిధముల సమాధానపఱచి యిట్లనెను:- "దేవీ!

పతివ్రత విధవ యెన్నటికిని గాదు. నీవు నామాట వినుము. నీ భర్తను నేను బ్రదికించెదను. దేవతలుకూడ అనసూయ వాక్యముల ననుమోదించెను. అనసూయాదేవి దేవతా కార్యముకొఱకు తన పాతివ్రత్యప్రభావముచే దశరాత్రుల నొక్క రాత్రిగ నొనర్చెను. రాత్ర్యంతమున సూర్యోదయము కాఁగానే ముని శాపమువలన కుష్ఠురోగి శరీరము భస్మ మయ్యెను. ఏలననఁగా మునివాక్యము లన్యథా కారాదు; కాని వెంటనే అగ్నిపూతమగు స్వర్ణమువలె నాతఁడు దివ్య శరీరమును ధరించి ఆమె భర్త బయటకు వచ్చెను. అందఱ కానందమయ్యెను. సతియొక్క ప్రభావమును గాంచి యందఱును జకితులైరి.

ఈ విధముగ ననసూయాదేవి తన పాతివ్రత్య ప్రభావముచే త్రిలోకములను సంకటమునుండి రక్షించెను. అత్రి పత్నియగు ననసూయయొక్క పాతివ్రత్యము లోకములో విఖ్యాతి చెందినది.అందుకనియే త్రిమూర్తు లీమెకుఁ బుత్రులైరి. ఈమె తన తపోబలముచే గంగను బుట్టించెను.

శౌనకుఁ డిట్లనెను:- "సూతా! అనసూయాదేవి గంగ నేల బుట్టించినది? ఈ కథను నీవు మాకు చెప్పవలయును."

అంతఁ బ్రసన్నతను బ్రకటించుచు సూతుఁ డిట్లనెను:- "మునులారా! అనసూయాదేవి యెట్లు గంగను బుట్టించినదో ఆ వృత్తాంతమును నేను మీకుఁ జెప్పెదను. మీరు దాని నంతను శ్రద్ధాపూర్వకముగ శ్రవణము చేయుఁడు."

—*—

# పుత్ర ప్రాప్తికి అత్రి తపస్సు

వేలకొలఁది జన్మములు తపోయోగ సమాధులచే నా సర్వేశ్వర, సర్వాధార, ఆనంద కంద, సచ్చిదానంద ప్రభువు వారాధన చేసినవానికే భగవద్భక్తి ప్రాప్తించును. అదైనను ఆతని కృప కలిగినప్పుడే. ఆతని కృప ఛల కపట రహితులగు సరళ పురుషుల మీఁదనే కలుగును. భగవద్దర్శన మొక్కసారి కలుగుటయే దుర్లభము. ఆతనితో సంబంధమును స్థాపించుకొనుటయు, నాతనిని దన సంబంధిగా, పుత్ర, మిత్ర' పతి, సఖా సుహృదులుగఁ జేసికొనుట అత్యంత దుర్లభము. జన్మ జన్మాంతరములలో వేలకొలఁది సుకృత కర్మలు చేసినవారు, తపోబలమున హృదయము నత్యంత పవిత్రముగఁ జేసికొనిన వారెవరు కలరో అట్టి వారికడనే భగవంతుఁ డవతరించును.

పుత్రుఁడు మాతా పితరుల యొక్క సంయోగముచేఁ గలుగును. ఇద్దరును బవిత్రముగ నుండి, ఇద్దరును దయా దాక్షిణ్యాది గుణ సంయుక్తులై, ఇద్దరి హృదయములలో భగవద్భక్తి యుండి, ఇద్దరకు విషయ విరాగముండి, యిద్దరును అంతఃకరణమును తపఃపూతము కావించుకొని, నిర్మలులై, యిద్దరును సమస్త భూతములందును దన యిష్టదైవమును గాంచు చుండినచో అట్టి వారికి అజన్ముఁడు జన్మించును. వారికి నిర్గుణబ్రహ్మ సగుణరూపమును ధరించి క్రీడించును. అత్రి, అనసూయ లిట్టి భాగ్యశాలురగు దంపతులే. వీరికడ కేవలము విష్ణువే కాదు, త్రిమూర్తులు జన్మించిరి.

మైత్రేయ మహాముని విదురునితో నిట్లనెను:– "విదురా! బ్రహ్మ కపిలమహాముని దర్శనము కొఱకు కర్దముని ఆశ్ర

మమునకు వచ్చినపుడు, తనతో మారీచ్యాది మహామునులను గూడ వెంటఁబెట్టుకొని వచ్చిన సంగతి నీకు జ్ఞాపకముండి యుండవచ్చును. బ్రహ్మ కపిలభగవానుని దర్శించి తన లోకమునకుఁ బోయెను, కాని ఋషులందఱచ్చటనే యుండిరి. కర్దముఁడు దేవహూతి సమ్మతిచేఁ దన తొమ్మిదిమంది కూఁతుండ్రను తొమ్మిదిమంది మహర్షుల కొసంగెను. వారిలో అనసూయ యను కుమార్తెను మహా తపస్వియగు అత్రి మహాముని కొసంగెను.

మహామునియగు అత్రి సర్వగుణ సంపన్నయు, సుశీలయు వినయవతియు, సతీసాధ్వియు నగు అనసూయను వెంటఁ బెట్టుకొని బ్రహ్మసమీపమునకుఁ బోయెను. భార్యా భర్త లిరువురును సమస్త జగదాధీశ్వరుఁడగు బ్రహ్మకు భక్తితోఁ బ్రణామము కావించిరి. తన కొడుకు, కోడలు ప్రణామము చేయుటను గాంచఁగానే పితామహుని యానందమునకు మేఱ లేకుండెను. ఆతఁడు హృదయపూర్వకముగ నాశీర్వదించి యిట్లనెను:— "మీ యిద్దరకును సదా ధర్మమునందు మతి యుండుగాక! అనసూయ లోకములో శ్రేష్ఠమగు సతి యగు గాక! నీ వఖిల జగత్తులో ననుపమమగు పతి యగుదువుగాక! శ్రీహరియే మీ కిద్దరకు గతియగుఁ గాక! శ్రీకృష్ణ చరణార విందములందు మీ కహైతుకమగు రతి యుండును గాక! లోకములో సర్వత్ర మీకు ఖ్యాతి కలుగు గాక!"

బ్రహ్మ తనయెడలఁ బ్రసన్నుఁడగుటను గాంచి, చేతులు జోడించి అత్రిమహాముని యిట్లనెను:— "ప్రభూ! ఇప్పుడు మా కేమి యాజ్ఞ?"

ఇది విని స్నేహభావముతో బ్రహ్మ యిట్లనెను:- "నాయనా! ఇప్పుడాజ్ఞ యేమి? నీవు స్వయముగ బుద్ధిమంతుఁడవు. ఎచ్చటనైన నేకాంతమునకుఁ బోయి తపస్సు చేయుము. తపస్సువలననే సమస్త సిద్ధులు ప్రాప్తించును. తపస్సే హరి హృదయము. తపస్సుమూలముననే ఆతని ఉత్తమారాధనము జరుగఁగలదు."

బ్రహ్మయొక్క యిట్టి యాజ్ఞను బొంది అత్రి మహాముని తన భార్యయగు అనసూయతోఁ గలిసి ఋక్షపర్వతము దగ్గఱకుఁ బోయెను. దక్షిణ దిశనున్న పర్వతము అత్యంత సుందరమును, పరమ రమణీయకమును, సర్వ ఋతువులందు పూఁచి కాయునదియు, సుందర సరిత్తులచేఁ గూడుకొని యుండెను. అచ్చట పరమ రమణీయమైనదియు, పవిత్ర జలములు కలదియు, నిర్మల జలములతోఁ గూడిన నిర్వింధ్య యనునది యుండెను. పర్వత పాషాణములతో నాడుకొనుచుఁ గలకల శబ్ద మొనర్చుచు నా సెలయేరు సర్వత్ర శాంతి సామ్రాజ్యమును స్థాపించుచుండెను. దానిలోఁ గమనీయ కమలములు వికసించియుండెను. హంస, సారస, చక్రవాక, జల కుక్కుటాది పక్షుల కలరవము, దాని కలరములోఁ గలిపి పర్వత కందరములను శబ్దాయమాన మొనర్చుచుండెను. నదీతటములం దటు నిటు నున్న పుష్పితపాదపములు తమ పుష్పసౌరభముచే నా వన్యప్రదేశమును సువాసిత మొనర్చుచుండెను. పచ్చని యాకులు గల యసంఖ్యాకములగు పలాశవృక్షములు తమ యెఱ్ఱని పుష్పముల నా వనమందు వెదఁజల్లుచుండెను. అశోక,

తాళ, తమాల, జంబీర, పనసాది వృక్షములన్నియు నా యరణ్యాముసు దన యస్తిత్వముచే శ్రీసంపన్న మొనర్చుచుండెను.

ఇట్టి సుందర వనమును జూడఁగానే ముని చిత్త మత్యంత ప్రసన్నమయ్యెను. ఆతఁ డచ్చటనే తపస్సు చేయుటకు నిశ్చయించెను. నదీతటమున నొంటి కాలిమీఁద నిలుచుండి యాతఁడు ప్రాణాయామాభ్యాసమును జేయఁ బ్రారంభించెను. మొదట నాతఁడు వనకందమూల ఫలములను దినుచు, తర్వాత వానినిగూడ వదలి కేవల మెండుటాకులను దినసాగెను. తదనంతరము కేవలము జలమును ద్రాగుచు ఘోరతపస్సు చేయసాగెను. చివరకు జలములను గూడ పరిత్యజించి కేవలము వాయుభక్షణము జేయుచు మనో నియమనము కావించుచుండెను. చివర కాతఁడు వాయుభక్షణమును గూడ వదలివేసెను. ప్రాణాయామ మొనర్చి స్థాణువువలె నాతఁ డొంటి కాలిపై నిశ్చలముగ నూఱు సంవత్సరముల వఱకు నిలుచుండెను. ఇప్పుడు ముని విశ్వాత్మయమయ్యెను. ఆతని మనస్సు సమాహిత మయ్యెను. సర్వత్ర శ్రీహరిని దర్శించుటచే నాతని చిత్తము విశ్వమయ మయ్యెను. దీనివలన సమస్త ప్రాణము లాగి పోయినట్లుండెను. ముని శిరస్సునుండి తపోఽగ్ని బయలుదేరెను. దాని జ్వాలలు త్రిలోకములలోని ప్రాణులను గాల్చఁ బ్రారంభించెను. దేవతలు భయపడి యిట్లనుకొనిరి:— "ఈ అసమయమందు ప్రలయమేల వచ్చినది? ఎవరి తేజస్సు సర్వలోకములను దపింపఁజేయుచున్నదో యెవ్వరు నా రహస్యమును గనుఁగొనలేక పోయిరి.

అత్రిమహాముని యొకానొక దేవతా రూపమును ధ్యానించుచు నారాధనము చేయుట లేదు; కాని "యీ చరాచర విశ్వమునకు స్వామి యైనవానిని నేను శరణు వేఁడుచున్నాను. ఆతఁడు నాకు తనకు సమానుఁడగు పుత్రునిఁ బ్రసాదించుఁగాక!" యని మాత్రము పలుకుచుండెను. చరాచర జగత్తునకు బ్రహ్మయు స్వామియే, విష్ణువును స్వామియే, శివుఁడును స్వామియే. ముగ్గురిలో నెవరు రావలయును? అనసూయ కిచ్చిన వరము పూర్తి యగుటకే ముని మనమున నిట్టి సంకల్ప ముత్పన్నమైనదని త్రిమూర్తులు గ్రహించిరి. అందువలన వారు ముప్వురును తమ తమ వాహనములపై నెక్కి ముని సమీపమునకు వచ్చిరి.

బ్రహ్మ తన శ్వేతహంసపై నెక్కెను. ఆతని నాల్గు వైపుల నాల్గు ముఖములున్నవి. వాటిపై మణిమయ కిరీట ముకుటములు వెలుఁగుచుండెను. శివుఁడు బోళాశంకరుఁడే కదా! ఆతని నంది మంచి బలిసి సుందరముగ నుండెను. దాని వీఁపుమీఁద మణిమయ సింహాసన ముండెను. బంగారు పని కూడ చేయఁబడియుండెను. శరీరమందు సర్పములు బుసలు కొట్టుచు చుట్టుకొనఁబడియుండెను. జడలందు గంగ తరంగములతో నూగులాడు చుండెను. మస్తకమునఁ జంద్రుఁడు వెలుఁగుచుండెను. కంఠమున ముండమాల మనోహరముగ శోభించుచుండెను. శరీర మంతటను జితిభస్మము నలఁది, జడలు వ్రేలాడవైచుకొని వృషభధ్వజుఁడు, నీల కంఠుఁడు తన యెద్దుపై నెక్కి వేగముతోఁ బోవుచుండెను. విష్ణుని కాంతి విలక్షణమైనది. ఆతని గరుడవాహనము వాయువుతోఁ

బందెములు వేయును. ఆతని ఱెక్కలనుండి నిరంతరము సామ వేద మంత్రములు వెలువడుచుండును. వినతాసుతుఁడు తన ఱెక్కలపై విష్ణునిఁ గూర్చుండఁబెట్టుకొని రివ్వున నెగిరి పోవుచుండెను. భగవంతుని పీతాంబరము గరుడుని వేగముచే వాయువులో నెగురుచుండెను. ముక్కు బులాకి అటు నిటు నూగుచుండెను. మణిమయ ముకుటము శిరస్సున వెలుఁగు చుండెను. నీలకుంతల జాలములు వాయువులో విరియఁబడెను. విద్రుమకాంతిని గూడ లజ్జింపఁజేయుచున్న లోల కపోల మదరుచుండెను. లేత రావియాకువంటి అరుణాధరము చంచల మగుచుండెను. వనమాలాకాంతిచే దశదిశలు చిత్ర విచిత్ర ముగ గోచరించు చుండెను. మోహకమూర్తిని గాంచినఁ జిత్తము చంచలము లగునట్లు, ఒక్కొక్కప్పుడు చేయి పైకి యెత్తినప్పుడెల్ల కర కంకణములు చంచలము లగుచుండెను. శ్వాస ప్రశ్వాస కారణమున నుదరత్రివళి ఒక్కొక్కప్పుడు లోపలికి, ఒక్కొక్కప్పుడు పైకి వచ్చుచుండెను. యంత్రము లోని యూరువు అంటుకొని యుండునట్లు రెండు తొడలు గరుడుని వీఁపుపై నుండెను. గరుడుని వీఁపుమీఁద నటు నిటు వ్రేలాడుచున్న రెండు పాదముల నఖములనుండి వెలువడుచున్న కాంతులు శరన్మేఘములలో నైదుగురు తూర్పునను, నైదుగురు పశ్చిమముననను ఒక్కసారిగాఁ జంద్రు లుదయించి అంధకారమును భిన్నాభిన్నము చేయుచున్నట్లుండెను. వందల కొలఁది అప్సరస, ముని, గంధర్వ, ఉరగ, విద్యాధర, కిన్నర, కింపురుషులు త్రిమూర్తుల యశస్సును గానము చేయుచు వెను వెనుక నే పోవుచుండిరి.

ఈవిధముగఁ దమ యలౌకికప్రభచే నాకాశమునంతను ప్రకాశింపఁజేయుచు త్రిమూర్తులు అత్రిమునియొక్క ఆశ్రమమునకు వచ్చిరి. ఇంతవఱకు ముని మనస్సునందు ప్రకాశము కలుగలేదు. సహస్ర చంద్ర సూర్య్యులొక్కసారిగా నుదయమైనట్లు నేఁడాతని హృదయమునఁ బ్రకాశించెను. హృదయమున ననుపమ తేజఃప్రకాశము కలుగుటచే మునికత్యధికమగు నానందము కలిగెను. ఆ తేజము మునికి లోపల బయట సర్వత్ర ప్రకాశమే వ్యాపించెను. ఆమహాప్రకాశ మంధకారము నంతను నాశము గావించెను. కన్నులు విప్పి ముని చూచునప్పటికి త్రిమూర్తు లెదుట తమ తమ వాహనములపై నుండిరి. ఒక్కసారిగా త్రిమూర్తులు దుర్లభదర్శన మిచ్చునప్పటికి ముని స్థితి విచిత్రమయ్యెను. ఆతఁడు సంభ్రమముతో నొంటికాలుతోడనే భూమిమీఁదఁబడి దండప్రణామము కావించి తన కన్నులనుండి ప్రేమాశ్రువులను బ్రవహింపఁజేసెను. చాలసేపటివఱ కాతఁడు ప్రేమచే స్మృతితప్పి, నేత్రముల నానందాశ్రువులను రాల్చుచు నవనిపైఁ బడియుండెను.

కొంచెముసేపటికి బాహ్యజ్ఞానము కలుగఁగా లేచి నిలుచుండెను. ముని కన్నులను దెఱచి చూడలేనంతగా త్రిమూర్తుల తేజస్సు వ్యాపించెను. ఆతని కన్నులు మిఱుమిట్లుకొలుపుచుండుటచే నాతఁడు బాహ్యనేత్రములను మూసి హృదయమున వారి రూపములను ధ్యానించుచు మిక్కిలి భక్తితో గద్గదకంఠముతోఁ ద్రిమూర్తులను స్తుతింపసాగెను.”

శౌనకుఁ డిట్లనెను:- “సూతా! ముని భగవంతుని తేజస్సు నేల సహింపలేకపోయినాడు? ఆతఁడు కన్నులతో నేల

చూడలేకపోయినాఁడు? చాలమంది భక్తులు భగవంతునితో మాట్లాడుచుందురు, క్రీడించుచుందురు."

సూతుఁ డిట్లనెను:- "మహాభాగా! కొందఱు భక్తులు మాధుర్యోపాసకులు, కొందఱైశ్వర్యోపాసకులు. మాధుర్యమందు భగవంతునితో మధురతాసంబంధ ముండును. ఈతఁడు మన సఖుఁడు, బంధువు, పతి, పుత్రుఁడు మొదలగు సంబంధము లిట్టివి. ఐశ్వర్యమందు ప్రభావమునకే ప్రాధాన్యత కలదు. భూపతియొక్క ప్రభావమునే ప్రజలు సహింపలేరు. ఈతఁడా త్రిలోకస్వామి. ఆతఁడు జగత్స్వామి భావముతో నుపాసించెను. అట్టి రూపముతోడనే త్రిమూర్తులు దర్శనమొసంగిరి. ఇట్లున్నను ఆతని హృదయమందు మాధుర్యమే నిండియుండెను. అందువలన దేవతా సమ్ముఖమున నున్నను వారి ప్రభావమునకు భయభీతుఁడు కాలేదు. చేతులు జోడించి యాతఁడు మధుర వాక్కులతో స్తోత్ర మొనర్చెను."

—*—

## త్రిమూర్తులు పుత్త్రులగుదుమని వరమొసంగుట

మన మొక కోరికతో నొక పనిచేసినప్పుడు దానికంటె నెక్కువఫలము లభించుచో మన హర్షమునకు మేరయుండదు. మనమేదియో ఆశచే భూమిని ద్రవ్వగ నచ్చట అపారసంపత్తి లభించుచో మనకు హర్ష విస్మయోల్లాస సంభ్రమములన్నియు నొక్కసారిగాఁ గలుగును.

అత్రిమహాముని భగవదారాధనము పుత్త్రప్రాప్తికొఱకు చేసెను. ఆతని సంకల్పము ఈ లోకమునకు స్వామియగువాఁడు తనకు సదృశమగు పుత్రు నొసంగవలయుననియే. ఈ జగత్తునకు స్వాములు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. ఏదో ఒకానొక నామ రూపములను గైకొని యుపాసించియుండినయెడల నా దేవుఁ డొక్కఁడే వచ్చి వరమొసంగెడువాఁడు. కాని ముని మూఁకీ భావముగా నుపాసించుటచే లాభించినది. త్రిమూర్తు లాతనికి వరమొసంగుట కుద్యుక్తులైరి. ఈ ముగ్గురే యిదివఱకు అనసూయకు వరమొసంగియుండిరి. అనసూయకు పుత్రులు కలిగిన నత్రివీర్యముచేతనే కలుగవలయునుగదా! దేవత లిట్లు తలఁచిరి:- ఎటులనో మన మనసూయకుఁ బుత్రులము కావలసియున్నది. పోనిండు, అత్రికికూడ ఆదర మొసంగెదము. ఆతని యాధిక్య మును లోకమున కెఱింగించెదము. పాఱెడు గంగలోఁ జేతులు కడిగెదము. కావున ముగ్గురును దర్శన మొసంగిరి.

అత్రిముని వారి చరణములకు వందన మొనర్చి వినీత భావముతో నిట్లనెను:- "ప్రభువులారా! మీ యస్త్ర శస్త్రాది యాయుధములచేతను, వాహనచిహ్నాదులచేతను మీరు బ్రహ్మ

విష్ణు మహేశ్వరులని గ్రహించితిని. మీ ముగ్గురే మాయ ద్వారా వేఱువేఱు గుణముల నాశ్రయించి జగదుత్పత్తి స్థితి లయములు త్రిమూర్తులై యొనర్చుచున్నారు. మీరు ముగ్గురును మాకు దర్శనమొసంగితిరి; కావున నేను మీ ముగ్గుర పాదములకు భక్తితోఁ బ్రణామము చేయుచున్నాను."

త్రిమూర్తు లిట్లనిరి:- "మునివరా! మేము నీ తపస్సునకు సంతసించి నీకు వరమొసంగుటకు వచ్చితిమి, కావున నీయిష్టము వచ్చిన వరము నడుగుము."

అత్రిముని యిట్లనెను:- "పరమపూజనీయులారా! నేను సంతానము కొఱకు ఒక్క జగదీశ్వరునే చింతించితిని. మీరు ముగ్గురు కలిసి యెట్లు కృపచూపితిరి ?"

త్రిమూర్తు లిట్లనిరి :- "తపోధనా! నీ వొక్క దేవునిఁ బిలిచియుండిన, నొకే నిర్దిష్టరూపమునఁ జింతించిన, నా దేవుఁడే నీకు దర్శన మొసంగెడువాఁడు. నీవు కలగలుప ధ్యానించితివి. జగదీశ్వరుఁ డెవఁడో ఆతఁడే నీకు బుత్రుఁడు కావలయునని కోరితివి. మేము ముగ్గురమును జగదీశ్వరులమే."

అత్రి యిట్లనెను :- "మంచిది స్వాములారా! అనుగ్రహించితిరి. 'అధికస్య అధికం ఫలమ్' ఒక పుత్రునకు బదులుగా ముగ్గురు పుత్రులు కలుగుట చాల యుత్తమము."

మైత్రేయుఁ డిట్లనెను :- "విదురా! ఒక్కొక్కప్పుడు భగవంతుఁడు సమాధానము చెప్పఁజాలనంత యమాయకుఁ డగును. అజామిళుఁడు పుత్రుని బిలువఁగా నారాయణుఁడది తన నామమే యనుకొనును. శివుఁడు నంతియే. శివుని గంటను

దొంగతనము చేయుటకుఁ జోరుఁడు లింగముపై నెక్కెను. ఇంకేమున్నది? శివుఁడు ప్రసన్నుఁడై యిట్లనుకొనెను :- "కొందఱు నాపైఁ బూలువేయుదురు; కొందఱు బిల్వపత్రములు వేయుదురు. వీఁడెంతటి భక్తుఁడో కాని తననే సమర్పించుకొనినాఁడు." ఈ బోళాశంకరుని కృప కేమైన మేఱకలదా? హిరణ్యకశిపు నెంత కౌశలముతోఁ జంపవలసి వచ్చినది? భస్మాసురు నెట్టియుపాయముతో భస్మము చేయవలసి వచ్చినది? ద్రోణాచార్యుని నెన్నికుతంత్రముల చేతనో చంపవలసివచ్చినది. అత్రిమహాముని యీవిధముగ ప్రార్థింపఁగా త్రిమూర్తు లిట్లనిరి :- "మునివరా! నీవు సత్యసంకల్పుఁడవు. మాకు భక్తుఁడవు. నీభార్య పతివ్రత. నీసంకల్పము నెన్నఁడు నన్యథా కాఁజాలదు. నీవు తలఁచినట్లే కాఁగలదు. మేము ముగ్గురమును నీకుఁ బుత్రులమై నీయశస్సును లోకమున వ్యాపింపఁజేసి, లోకకల్యాణము కావించెదము."

మైత్రేయుఁ డిట్లనెను :- "విదురా! ఆ సమయమున భగవంతుఁడు "మంచిది, దత్త!" అనెను. అనఁగా మేము నీకు పుత్రు నొసంగితిమి. అందువలన శ్రీహరి యంశమునఁ బుట్టిన వానికి "దత్త" యను పేరు పెట్టఁబడెను. అత్రిపుత్రుఁ డగుటచే నాతఁడు "ఆత్రేయుఁ" డయ్యెను. ముని వస్త్రములు తపస్సుచే మలినము లగుటచే శివునకుఁ గోపమువచ్చెను. అందువలన నాతని యంశముచేఁ గ్రోధియగు దుర్వాసమహాముని యుద్భవించెను. అతఁ డందఱిపైఁ గోపము చూపుచుండును. శాప మతని నాలుక చివరనే తాండవ మాడుచుండును. బ్రహ్మ ధ్యానము శివుని శిరస్సుననున్న చంద్రునిమీఁద నుండెను.

ఆతని మనస్సు వనశోభచే నత్యంత ప్రఫుల్లిత మయ్యెను. అందువలన నత్యంత సుందరుఁడును, మిక్కిలి రసికుఁడును, త్రిలోక సుఖదాయకుఁడు నగు చంద్రుఁడు బ్రహ్మాంశమునఁ బుట్టెను. త్రిమూర్తులు వరము లీయఁగానే అత్రి అర్ఘ్య పాద్యాసన ఆచమనీయా ద్యుపచారములను, కంద మూల ఫలాదులను, భక్తితోఁ జేసిన పూజను స్వీకరించి త్రిమూర్తు లంతర్ధానమైరి. మహాముని పత్నీ సహితముగ నిలువఁబడిపోయెను. త్రిమూర్తులు వెళ్లిన తర్వాత వీరిద్దరా దిక్కునకు నమస్క రించి తమ యాశ్రమమునకు వచ్చెను. కాలాంతరమున నాతనికి ముగ్గురు పుత్రు లుదయించిరి. వారికి దత్త, దుర్వాస, చంద్రు లని పేరులు పెట్టిరి.''

అంత శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! చంద్రుఁడు సముద్ర మంథన సమయమున సముద్రమునుండి పుట్టెనని వింటిమి. అందుకనియే నేఁటికిని పూర్ణిమా దినమునఁ జంద్రుఁడు షోడశకళలతో వెలుఁగునప్పు డాతని వృద్ధిని గాంచి, తండ్రి యగు సముద్రుఁ డుప్పొంగుట చూచుచున్నాము కదా! లక్ష్మియు సముద్రమునఁ బుట్టుటచేఁ జంద్రుఁడు లక్ష్మికి తమ్ముఁడు కదా! అట్టియెడ మీరు చంద్రుఁ డత్రి పుత్రుఁడనియు, అనసూయా గర్భమునఁ బుట్టినవాఁడనియుఁ జెప్పుచుంటిరి. అది యెట్లు? ఈ మర్మమును మాకు తెల్పుము."

శౌనకుని ఈ ప్రశ్నను విని నవ్వుచు సూతుఁ డిట్లనెను:- ''స్వామీ! మీరుకూడా యిట్లు ప్రశ్నించుచుండుటచే నాకు భ్రమ కలుగుచున్నది. మహాభాగా! చంద్రుఁడు నిత్యుఁడే. సృష్టి ప్రకరణములోఁ జంద్రుడు విరాట్స్వరూపము యొక్క

